తప్పక చూడండి!




శాంతి (ఎయిర్ కూల్డ్)
హైదరాబాదు

ప్లాజా
సికింద్రాబాదు

(A) పెద్దలకు మాత్రమే



'జనవరి' నెల 'యువ' అత్యంత శోభాయమానంగా వుంది. ముఖ్యంగా ముఖచిత్రంలో ఎన్నడూ కనిపించని అందమేదో తొణికిసలాడింది. సరికొత్త పంథాలో సస్పెన్స్‌తో నడుస్తున్న 'నలుగురు ఫకీర్లు' సీరియల్‌లో రెండవ ఫకీరు కథ ఆశ్చర్యచకితులను చేసింది. 'బలిదానం' కథ చదువుతున్నంత సేపు మా హృదయాంతరాళంలో ఏదో తెలియని మధురానుభూతి కల్గింది. కథలో నూతనత్వముంది. కథను మలచిన తీరు, శైలి, ఉన్నత స్థాయిలో వున్నాయి. రచయిత్రి కౌసల్యాదేవి గారికి ధన్యవాదాలు. 'తాను - తవ్వివ గొయ్యి' కథ సహజంగా వుంది. 'చెరపకురా చెడెదవు' అన్న నీతిని, గుత్తుల భాస్కరరావు గారు చక్కగా నిరూపించారు. 'సొల్యూషన్', 'పంకజం-పని మనిషి' ఈ రెండు కథలు సమాజంలో జరిగే వాస్తవిక పరిస్థితులకు పట్టిన దర్పణాలు. ఇక పోతే మిగిలిన కథలు కూడా ఆసక్తిదాయకంగా వున్నాయి.

—పోమాల పరమేశ్వర్, షాద్‌నగర్.

# తప్పక చూడండి!




సంగం
హైదరాబాదు



రాజేశ్వర్
సికింద్రాబాదు

జనవరి నెల యువ అహ్లాదాన్ని కలిగించింది. అరెకపూడి కౌసల్యా దేవి గారి "బలిదానం" అద్భుతంగా వుంది. ఆవిడ అభిమానులను అపరిమితంగా ఆకర్షిస్తుంది.

"పంకజం-పని మనిషి" మరియు "ఈ పిల్లకు పెళ్ళికాదు!" కథలు నన్ను ఆకర్షించాయి. రచయితలకు నా అభినందనలు.

—జి. భూపాల్ రెడ్డి, నిజామాబాద్

జనవరి యువ చదివాను. అరికెపూడి కౌసల్యాదేవి గారి 'బలిదానం' నవలిక చాలా బాగుంది నలుగురు ఫకీర్లు 'సీరియల్' మొదటి నుంచే మంచి సస్పెన్స్‌తో యింటరెస్టింగ్‌గా సాగుతొంది అగ్నిపరీక్ష(సీరియల్)చెప్పనవసరంలేదు.

—పరశురాం, నిజామాబాద్.

జనవరి నెల యువలో అరికెపూడి గారి నవలిక 'బలిదానం' హైలైట్ అని చెప్పాలి. తులసికి తప్పకుండా ప్రతి వారూ ఒక కన్నీటి బొట్టయినా వదులుతారు.

ఇక పాలకోడేటి గారు ఈ పిల్లకు పెళ్ళికాదు' కథ ద్వారా ఈనాడు సమాజంలో స్త్రీ పై ఎంతటి దుష్ప్రచారం, అపోహలు లేవదీస్తున్నారో చక్కగా చిత్రించారు.

—విజయ, వికారాబాదు.

## రచయితలకు మనవి

మాకు నెలనెలా వందలకొద్దీ కథలు వస్తూన్నదృష్ట్యా, వాటిని పరిశీలించి, రచనలు పంపిన వారిని నిరీక్షింపజేయడం అంతసబబుగా ఉండదు కాబట్టి, కొంతకాలంపాటు రచయితలను/రచయిత్రులను కథలు పంపవద్దని సవినయంగా మనవి చేస్తున్నాము

— సంపాదకుడు

# ట్విన్ సిటీ గ్యాస్ కం

(కోసాన్ గ్యాస్ కంపెనీవారి ఏజంట్లు)

62-బి, సర్దార్ పటేల్ రోడ్, సికింద్రాబాదు-3 ఫోన్: 76600




* ఎస్సో గ్యాస్ తో
  వంట త్వరగా అవుతుంది
* ప్రతి సిలెండరుకూ
  ప్రపంచ ఖ్యాతిగాంచిన
  కోసాన్ సేఫ్టీకాప్ అమర్చబడింది.

షో రూమ్ :

86, సరోజిని దేవి రోడ్
రాక్‌మహల్ హోటల్ ఎదురుగా
సికింద్రాబాదు.

బ్రాంచీలు :

4-1-881/7, తిలక్ రోడ్ ఫోన్ 42586
15-9-311, అఫ్జల్ గంజ్ ఫోన్ 42629
15-6-68, చాదర్ ఘాట్ ఫోన్ 52400
ఆంధ్ర బ్యాంక్ ఎదురుగా, విద్యానగర్ ఫోన్ 62544
సత్యా టాకీస్ వద్ద, అల్వాల్ ఫోన్ 79009
గోల్డు స్పాట్ వద్ద, అమీర్ పేట ఫోన్ 32901
భారత్ హెవీ ఎలెక్ట్రికల్స్ రామచంద్రపురం

SEE TO-DAY ! SEE TO-DAY !!

A MUSICAL WONDER ON THE SCREEN!
THAT IS EXCITING, GAY & ROMANTIC...




# Yaadoon ki Baaraat

Music : R. D. Burman

| | | |
|---|---|---|
| **VIKRANTI** (Hyderabad) | **PRABHAT** (Hyderabad) | **SHAAM** (Hyderabad) |
| **SUDA** (Hyderabad) | **SKYLINE** (Hyderabad) | **NATARAJ** (Secunderbad) |

B. Marideswara Rao & Co., Release.

# యువ

సచిత్ర మాసపత్రిక

సంపాదకుడు చక్రపాణి

సంపుటి 29 ఫిబ్రవరి-1974 సంచిక 2

మార్చి నెల

## భావపరిచయ పోటీ

**బహుమానం .రూ 10-00**



ఈ కార్టూనుకు హాస్యయుత వ్యాఖ్య (Caption) కావాలి.

ఫిబ్రవరి నెల

# భావపరిచయ పోటీ

*బహుమతి పొందిన వ్యాఖ్య*



"తగిన జోడు కాదు తనకంటె పొడు" గని
ఎంచి వగచు భర్త నింతి చూచి
పళ్ళు నూరుచుండె పరస్త్రీలపైన అ
సత్యమేమి కాదు సత్య మిదియె.

— మోదుగ బాలసుబ్రహ్మణ్యం, కావలి.




నీలాల నింగిలో తెల్లని కొంగలు బార్లుదీరి ఎగిరిపోతున్నాయి. అలా క్రమ పద్ధతిలో ఎగరాలని, 'వి' ఆకారంలో ఎగరాలని వాటి కెలా తెలుసో! వాటి కున్న స్వల్పజ్ఞానంతో అవి ఎంత చక్కగ తమ విధిని నిర్వహిస్తాయి! వాటి కున్న జ్ఞానంలో ఆవంతైనా తనకున్నట్లు లేదు. తను ఏమైపోయింది! మాలతి అరుబైటకూర్చుని దీర్ఘంగా ఆలోచిస్తోంది. తను తప్పు చేస్తోందని తనకు తెలుసు. అంతరాత్మ హెచ్చరింపును అతిధైర్యంతో ధిక్కరించి ముందుకు సాగి పోయింది.

ఆ బాట పూలమయమై, సుగంధ సమ్మిళితమైన పిల్లతెమ్మెరలతో నిండి మనసుకెంతో ఆహ్లాదాన్ని కల్గించింది. తన జన్మ సఫలమైందని-తన కోరికలన్నీ

నెరవేరి తన జీవితం ధన్యమైందని భావించింది. ఆ మార్గంలో పయనించే కొలది ఉత్తేజితురాలై రెట్టించిన తెగింపుతో మరి వెనుదిరిగిరానని నిరాకరించింది. ఫలితం ఇది!

ఇప్పుడు విచారించి ఏంలాభం ? ఆ పూలబాటలోని ముళ్ళు చాల లోతుగా నాటుకుపోయాయి.

సాధారణమైన తలిదండ్రులకు జన్మించింది మాలతి. తండ్రి బడిపంతులు ఇద్దరు మగపిల్లలు తరువాత పుట్టటంవల్ల అతిగారాబం చేశారు. వయసొచ్చినప్పటి నించి పోరుపెడ్తూనే ఉంది పెళ్ళి – పెళ్ళి చేయమని తల్లి. మాలతి చదువు కుంటానని మొండికెత్తింది. తండ్రి బడిపంతులు – కొడుకుల్ని బి ఎ దాక చదివించి ఉద్యోగాల్లో పెట్టేశాడు. ముగ్గురూ తల్లికి వ్యతిరేకంగా నిలబడి మాలతికి బి ఎ. వరకు చదువు చెప్పించారు. ఆతర్వాత టైపింగ్, షార్ట్‌హాండ్ నేర్చుకొంది. చురుకైన పిల్ల అని పేరు గడించింది.

మాలతి పెద్ద అందగత్తె కాదు. కానీ ఆకర్షణీయమైన విగ్రహం. కన్నులు ముక్కు అమరికగా ఉండి విశాలమైన ఫాలభాగంమీదపడే ముంగురులతో ఎంతో అందంగా కనిపించేది. కాలేజీలో ఉన్నంతవరకు నిప్పులాంటి దన్న పేరు సంపాదించింది.

తండ్రిపోవటం - తల్లి పెద్దన్న దగ్గర జేరటం - చిన్నన్న ఉద్యోగరీత్యా దూరప్రాంతాలకు వెళ్ళిపోవటం - మాలతి పెళ్ళి పెద్ద సమస్యగా నిల్చి పోయింది. తీర్చలేక – ఖర్చులు భరించలేక - కట్నం యివ్వలేక అన్న మౌనం దాల్చాడు. అది గ్రహించిన మాలతి ఉద్యోగంచేయాలని సంకల్పించు కుంది. పోస్టల్ డిపార్టుమెంట్‌లో ఉద్యోగం దొరకటం తన అదృష్టమేననుకొంది.

ట్రైనింగ్ పూర్తిచేసుకొని వచ్చింది. చిన్నవాటా అద్దెకు తీసుకుని విజయ వాడలో పని ప్రారంభించింది.

తాను ఉన్న ఇల్లు షుమారుగా ఉంటుంది. అన్నీ వేరు వేరుగా ఉన్నా బాత్‌రూం ఒకటే. ప్రాంగణం ఒకటే. మరొకవాటాలో వృద్ధులైనదంపతులున్నారు. ఇంకొక వాటాలో స్వంతవాళ్ళు. బాగానే వుంది అనుకుంది. మాలతి జేరిన మూడునెలలకు ఆ వృద్ధులయింటికి చుట్టం వచ్చాడు.

ఆ సాయంత్రం గుమ్మంలో నిలబడి తానుగా పలకరించాడు, "నమస్కార మండి. ఆ ఇంట్లో ఉన్నవారు మా తాత, అమ్మమ్మ. నాకీఊళ్ళో ఉద్యోగమైంది. కొత్తగా వచ్చాను. ఏంతోచటం లేదు. ఏమైనా పుస్తకాలుంటే యిస్తారా!"

మాలతికి అతణ్ణి లోపలికి పిలవాలనిపించలేదు. తన దగ్గర ఏముంటాయి. రెండు పత్రికలు ఆ వారంవి తెచ్చి అందిస్తూ అంది. "నే నేమీ కొననండి. ఇవే తెచ్చుకొని చదివి మళ్ళీ ఫ్రెండ్స్‌కు యిచ్చేస్తుంటాను. వారం వారం కూడా తెచ్చుకోను." అతను అందుకొని కాసేపు తిరగేశాడు. మాలతి ఆగకుండా లోపల కెళ్ళిపోవటంతో అతడు తనవాటాలోకి వెళ్ళిపోయాడు. మాలతి పీక విరగ్గొట్టేంధని తలుపేసుకుంది. 'మంచిదే ప్రతివారం తెచ్చుకోనని కూడ చెప్పేశాను' అనుకొని తృప్తిచెందింది.

మరుసటిరోజు స్నానాలగది దగ్గర తారసిల్లాడు. మాలతికి అతడు పలుక రిస్తాడని తెలుసు. అందుకని అక్కడ ఉండకుండా గదిలోకి వచ్చేసింది. ఆరోజు బాగా ఆలస్యంగానే స్నానంచేసి వస్తోంటే పుస్తకాలు తిరిగి ఇచ్చేశాడు. "థాంక్స్" అన్నాడు.

మాలతి ముభావంగానే అందుకొని లోపలికి వచ్చింది. ఆ రాత్రి పడుకుని ఒక పుస్తకము తెరచింది. అలా చదువుతూ పేజీలు తిప్పుతుంది. ఒకచోట ఒక కాగితం జారి క్రింద పడింది. అది చదివిన మాలతికి కోపం వచ్చింది. అది ప్రేమలేఖ . అంతా పద్యరూపంలో ఉంది. అక్కడక్కడ కొట్టివేతలు. ఏమిటిది? ఆమెకు కోపం, అసహ్యం రెండూ వేశాయి. ఏంచెయ్యాలో తోచ చక ఛీ- అనుకొని కాగితాన్ని నాల్గు ముక్కలుచేసి మూలకు విసరికొట్టి నిద్రకుప క్రమించింది. కాని వెంటనే నిద్రపట్టలేదు. ఆ పద్యాలే మాటిమాటికి గుర్తొ స్తున్నాయి. వియోగాన్ని భరించలేక ప్రియుడు వ్రాసిన పద్యాలలోని సారాంశం ఆమె హృదయంలో కలవరాన్ని రేపింది.

తెల్లవారింది. ఈ రోజు త్వరగా స్నానం ముగించుకొని వంటకుపక్రమిం చింది. తలుపు చప్పుడైంది. తెరచి, నుంచున్న అతణ్ణిచూచి ఏమిటన్నట్లు చూసింది.

"రాత్రి కొన్ని పద్యాలు వ్రాశానండి. కాగితం కనబడలేదు. ఒకవేళ పత్రి కలో పెట్టానేమో – ఓ మారు చూస్తారా.''

మాలతి భృకుటీకరించి ఆలోచిస్తున్నట్టు నటించింది 'అదన్నమాట. ఇంకా నయం మూలగా ఆ కాగితాలు లేవు.' గబగబ లోపలికెళ్ళి పుస్తకాలుతెచ్చి తిరగే సింది. ఏమీ కాగితాలు కనబడలేదు.

"ప్రొద్దుట ఆఫీసుకు పట్టుకెళ్ళాను. అక్కడ ఎవరైనా తీశారేమో.''

''ఓమారు కనుక్కుంటారా?'' ఆత్రంతో అడిగాడు.

"గుర్తుంటే అడుగుతాను." అంటూ లోపలికొచ్చేసింది.

ఇతడొక చిన్న సైజు కవి అన్నమాట అనుకుంది. పేరేమిటో, ఏం చెప్పాలి ఏదో అబద్ధమాడాలి అనుకుంది. తాను అనుకున్నట్లు అతడు ఆమె రాగానే అడిగాడు. "నాలుగైదు చేతులు మారాయండి. ఎక్కడ జారిపోయిందో తెలీయదు'' అంది. ఇక మాటలు పొడిగిస్తాడేమో అన్న భయంతో లోపలికొచ్చేసింది.

అతడు కాసేపు తారట్లాడి వెళ్ళిపోయాడు.

మాలతి పుస్తకాలు తెచ్చుకోటం ఇవ్వటం మానేసింది కాని, కొత్తచిక్కొచ్చి పడింది. "పుస్తకాలు కావాలా అండీ-" అంటూ గుమ్మంలో పెట్టి వెళ్ళిపోతాడతను. అతని పేరు తెలిసింది. రాజేంద్రకుమార్ అని. రెండు రోజులు పోయాక అతడే వచ్చి పట్టుకెళ్తాడు. రెండు వారాలు గడిచిపోయాయి. ఈ తతంగం మాలతికి నచ్చలేదు. మెల్లగా చెప్పదల్చుకున్నది చెప్పేసింది. "నాకు పుస్తకాల పిచ్చి అంతగా లేదండీ. మా వాళ్ళ దగ్గరనించి పత్రికలు తెచ్చుకుంటాను. అవి చాలు. మీరు శ్రమతీసుకుని ప్రతిసారి నాకు యివ్వాలనుకోకండి. నాకు చదవటానికి టైం కూడా ఉండదు. ఆ టెస్ట్లు - ఈ టెస్ట్లు పాసవ్వాలని చదువుకుంటున్నాను."

"ఐతే రోజుంతా ఆఫీసులో పని, ఇంటి కొచ్చాక చదువు. మీకు డైవర్షన్ ఏమీ అవుసరం లేదా?" మీరు చాల గట్టివారు అన్నట్లు చూచాడు.

"వంట-చదువే డైవర్షన్." అంది. ఇక మాటలు లేవనుకుని లోపలికెళ్ళబోయింది.

"ప్లీజ్. ఒక్క నిమిషం. మీ తెలుగు రైటింగ్ బాగుంటుందాండీ?"

"ఓ మోస్తరుగా ఉంటుంది."

"నా అక్షరాలేమీ బాగుండవు. నా పద్యాలు ఫెయిర్ చేసిపెడ్తారా?"

మాలతికి విసుగేసింది. లాభంలేదు. కుండ బ్రద్దలు కొట్టినట్లు చెప్పాలి.

"మీరేం అనుకోకండి. నాకు టైం ఉండదు. అందునా నా రాత ముత్యాల్లా ఉండవు. అదీకాక నాకు పద్యాలంటే పెద్ద యిష్టంకూడా లేదు."

'ఎంత డ్రై పర్సన్?' అనుకుని అతడు వెళ్ళిపోయాడు.

రెండు రోజులు అతడి బెడదలేదు. మూడవ రోజు రానే వచ్చింది. ఆమె కాఫీ పెట్టుకుని తాగుతోంది. రాజేంద్ర పరుగులమీద వచ్చాడు. చక్కటి టై కట్టుకున్నాడు. ఆకర్షణీయమైన భారీవిగ్రహ మతడిది. ఎక్కడికో వెళ్ళటా






నికి తయారైనట్లున్నాడు. "ఏమండీ - మా అమ్మమ్మ అదోలా ఉందండీ. ఓ మారు ఆమె దగ్గరుంటారా? డాక్టర్‌దగ్గర కెళ్తున్నాను." ఆఖరి మాటలు అంటూ అంటూనే గబగబ వెళ్ళిపోయాడు. మాలతి గొళ్ళెంపెట్టి పక్కవాటాలోకి వెళ్ళింది. ముసలమ్మ కళ్ళుమూసుకుని పడుకుని ఉంది. ముసలాయన దగ్గర్లో స్టూలుమీద కూర్చుని ఆందోళనతో ఆమె చేతిని తన చేతుల్లో తీసుకుని ఏమీతోచక ఒత్తుతూ కూర్చున్నాడు. డాక్టర్ వచ్చి మందులిచ్చి యింజక్షన్ చేసి వెళ్ళిపోయాడు.

"తాతయ్యా డబ్బుందా? ఈ మందులు తేవాలి."

"ఇచ్చి వెళ్ళాడు కదురా" ముసలాయన గుర్తుచేశాడు.

"ఈ రాత్రికి, పదిహేను పుచ్చుకున్నాడు. మందులుకొని తెచ్చిపెడితే రేపు వస్తాడట."

"అసలు మీ అమ్మమ్మ కేమైందట?"

"వృద్ధాప్యం - హార్ట్ వీక్‌గా ఉందట. బ్లడ్ ప్రెజర్ లో-అట. డబ్బివ్వు" అని చేయి చాపాడు.

"నా దగ్గర లేవురా. నీవే సర్దు."

"నా దగ్గరా లేదు. జీతం అప్పుడే రాదు. నేనిచ్చిందంతా ఖర్చుపెట్టేశారా?" కళ్ళెర్రజేశాడు. "ఇప్పుడెలా? నువ్వే ఎవ్వరైనా అడిగి తీసుకురా. నా కంతా కొత్త. నా కెవరిస్తారు?"

ఇదంతా వింటూ మాలతి కేవలం మూడవ వ్యక్తిగా మౌనంగా ఉండలేక పోయింది. తనకై తాను ఇవ్వటానికి భయపడింది. తన దగ్గర మాత్రం ఎంతుంది? ఇరవై రూపాలున్నాయేమో! ఇంకా ఫస్ట్‌కు నాల్గు రోజులున్నాయి. ఆమె మౌనంగా ఉంది. ముసలాడు అడగనే అడిగాడు. ఇక లేదనలేక పోయింది. పదిహేను యిస్తూ అంది "నా దగ్గర ఇవే ఉన్నాయండీ."

"ఫరవాలేదు, సమయానికి ఆదుకున్నావమ్మా" అతడు కృతజ్ఞతలు వెల్ల డించాడు. రాజేంద్ర ఆ పదిహేను పట్టుకెళ్ళిపోయాడు. మాలతి తన ఇంట్లో కొచ్చింది. ఎందుకీ బెడద తనకు. అంటీఅంటనట్లుగా యిన్ని నెలలు గడిపింది. వీళ్ళూ తనలాంటి వారే. ఆర్థికంగా వెనుకబడి చాలీచాలని పెన్షన్‌తో ఈదుకొచ్చే వీరికి దూరంగా ఉంటే మంచిది. అంతరాత్మ హెచ్చరించింది కానీ ఆమె మరో విధంగా ఆలోచించింది. అతగాడికి జీతం వస్తుంది. ఇచ్చేస్తాడు.

ఆ మరుసటి రోజు ప్రొద్దుట మాలతి కాఫీనీళ్ళు పెట్టుకుని ముఖం కడుక్కో టానికి బైటికెళ్ళింది. "అమ్మాయ్ - ఆవిడకు కాఫీ కావాలంటోంది. రెండు చుక్కలు నోట్లో పోస్తాను, నువ్వు చేసుకున్నప్పుడు ఓ అరకప్పు ఆవిడకూ పెట్టిస్తావా?"

అదెంతభాగ్యం - అనుకుంది. ఇరుగు పొరుగు అన్నాక ఇలాంటి చిన్నచిన్న సాయాలు చేయక తప్పదు. కాఫీ గ్లాసునిండాపోసి పట్టుకెళ్ళి అందించింది. ఇద్దరూ చెరిసగం తాగారు. అక్కడ రాజేంద్ర లేడు. ఫరవాలేదనుకుంది. రెండు రోజులు కాఫీ - అని సర్దివేశాడు. మూడవ రోజు ఏకంగా టిఫిన్ అడిగాడు. ఉప్మా చేసిపెట్టింది. ఏ నెపంతో 'చేయను' అనగలదు! స్వంతవాళ్ళు అంతగా పట్టించుకోరు. నెలసరికి అద్దెవసూలు చేసుకుని వెళ్ళిపోతారు. పక్కగుమ్మం తడికలే అడ్డం-ఐనా వారికీ వీరికీ కొన్ని యోజనాల దూరంగా ఉన్నట్లుంటుంది. ఆమెకు చెవుడు. అతడెప్పుడు కిళ్ళీకొట్టు బెంచికి అంకితం. నాల్గు రోజులకు ముసలమ్మ కాస్త లేచి తిరుగుతోంది. మాలతి మళ్ళీ తనగదిలో ఇమిడిపోయింది. పక్కవాటాలో గొడవతో మెలకువ వచ్చింది. వినకూడదన్నా వినబడు తున్నాయి మాటలు. రాజేంద్ర కాస్త మెల్లగానే అంటున్నాడు.

"జీతం అప్పుడే రాదు తాతయ్యా. నువ్వే అద్దె సర్దు జీతం రాగానే ఇస్తాను"

"నా దగ్గ రెక్కడిదిరా?"

"పెన్షన్ వచ్చిందిగా?" భార్య గుర్తుచేసింది.

"నువ్వూరుకోవే. ఏం వందలకు వందలొస్తున్నా యనుకున్నావా? ఆరవై రూపాయలు. అంతే. మీ అమ్మమ్మ అతి తెలివైనదిరా! చిన్ననాటి నించి నిన్ను నా దగ్గర పెట్టి చిల్లిగవ్వ ఖర్చుకాకుండా నిన్ను పెంచింది. ఖర్చు, శ్రమ నాది - జీతం అనుభవించడం ఆమెది. నీ చెల్లెలుంటే ఏదో పార్టీకి నాయకురా లవవలసిన మాట. మనపాల బడింది. పిల్లలులేరని వీణ్ణి నాకంట గట్టింది! వీడేమన్నా ఉద్ధరిస్తాడంటావా? జీతం వందలకువంద లందుకుని చక్కగా తల్లికి



పంపి కూచున్నాడు రాజూ నే నివ్వను. ఈ మాటు అద్దె నువ్వేకటాలి గాక కట్టాలి." "తాతయ్యా నామాట నమ్ము. ఇంకెన్ని రోజులు పడ్తుంది. తప్పక ఇస్తాను.'' ప్రాధేయపడ్తుంటే మాలతికి జాలేసింది. మరి మాటలు వినబడలేదు. కాసేపు పక్కమీద పొర్లేసరికి తెల్లవారింది. ఆ వైపుగా వెళ్ళింది. రాంజేంద్ర బిక్కమొఖంతో బైట అరుగు మీద కూర్చున్నాడు. మాలతిని చూచి నేరస్తుడిలా చూస్తూ ఓ వెర్రినవ్వు ముఖానికి పులుముకున్నాడు. ఆమె అతణ్ణి పలుకరించలేదు. తన పనులు చేసుకొని వెళ్ళిపోయింది.

ఆ రోజంతా ఎందుకో అతని జాలిగొల్పే ముఖం ఆమె కళ్ళలో మెదుల్తూనే ఉంది.

ఆవేళ చాలా హుషారుగా వచ్చాడు. "ఏమండీ" అని తలుపుతట్టి ఈలపాట పాడుతూ నుంచున్నాడు. రాజేంద్రతో మాట్లాడి పక్షం రోజులకుపైగా అయిపోయింది. మాలతి తలుపుతీసింది. అతడు ఈల ఆపుజేసి "మిమ్మల్ని డిస్టర్బ్ చేశానేమో!" అన్నాడు. ఆతడి ముఖం సంతోషంతో తేజోవంతంగా ఉంది. "పరవాలేదు. ఏమిటి విశేషం?" అంది చనువుగా. "జీతం వచ్చిందండీ. అందుకే సెలబ్రేట్ చేస్తున్నాను. ఇది తీసుకోండి." ఆమె గుమ్మం అవతలనించి చేయిచాపింది. అతడు చేయి వెనక్కిలాక్కుని "మీరు ఇవతలగానైనా రండి, లేదా నన్ను అవతలగా రమ్మనండి. అంతేగాని గడపమధ్య ఉంటే నేను ఇవ్వ

లేను. అందునా మొదటి జీతం." అతడి కళ్ళలో చిలిపితనం-మాటలో చురుకుదనం ఆమెను కవ్వించాయి. లోపలికి జరిగి "రండి" అన్నది.

లోపల ఒకే ఒక కుర్చీ ఉంది. దానిమీద కూర్చున్నాడు. పదిహేను రూపాయలు బల్లమీద పెట్టి మరో చిన్నపొట్లం బల్లమీద పెట్టాడు. "అదేమిటండీ?" అంది మంచం చివర కూర్చుంటూ.

"సెలబ్రేషన్ అన్నాను కదూ? ఏ సినిమాకో-హోటల్‌కో రమ్మంటే మీరు రారు. సమయానికి ఆదుకున్నారు. మీ మేలు ఈ జన్మలో మర్చిపోలేను. అందుకే కొంచెం స్వీటు-హాటు తెచ్చాను."

"నాకెందుకండీ" అంటూ మొమోట పడింది. ఏనాటినించో అడగాలనుకున్న ప్రశ్న అడిగేసింది. "మీ డిపార్ట్‌మెంట్‌వారు అడగలేదా పార్టీ? ఎక్కడ పని జేస్తున్నారండీ?"

"కష్టాలలో ఉన్నప్పుడు - జీతంరాక నానా హైరానాపడినప్పుడొక్కడు ముందుకొచ్చి — 'ఎలా మేనేజ్ చేస్తున్నారు? జీతం రావటంలేదుకదా? ఏమైనా కావాలా? తర్వాత ఇవ్వొచ్చులే ...అహ' ... ఇలా ఒక్కరైన అన్నారనుకున్నారా? జీతం రాగానే గద్దల్లా తన్నుకుపోవాలని చూశారు. పైగా పార్టీ అట పార్టీ. అదేమాట గట్టిగా వారెదుటనే అడిగేశాననుకోండి. ముఖాలు ముఖాలు చూచుకుని నత్తగుల్లల్లా ముడుచుకుపోయారు. వారిలో కాస్త ధైర్యవంతుడూ-ఏ గాలికాచాప ఎత్తగల వ్యవహార దక్షతగలవాడూ ఒకడు మాత్రం 'అమ్మైనా అడగందే పెట్టదంటారు. మరి ఒక్కసారి మమ్మల్నెవరినైనా అడిగారూ?' 'ఎలా అడుగుతానండీ. కొత్తవాణ్ణి కదా. మీరంతా కొత్తే - మీకు నేనూ అంతే. మీరు ఒకప్పుడు జీతం అందక కష్టాలుపడినవారే అయిఉండవచ్చు. లేదా ఆ కష్టం లేకనూ పోవచ్చులెండి. అంతదూరం ఆలోచించలేదు మీరు. మర్చిపోయి ఉంటారు. బోలెడు అప్పులు చేశాను. పార్టీ యివ్వటానికి వీల్లేదు' అనేసి వచ్చాను."

"మరైతే ఒక్కడికి మాత్రం ఇవెందుకు తెచ్చారు?" ఆ కంఠంలో ఓరు కోపం ఉన్నట్లు గ్రహించిన మాలతి ఆశ్చర్యపోయింది.

అతను ఖిన్నుడై, కళ్ళు ఓట్లించి ముఖం కొద్దిగా ప్రక్కకువంచి ఆమెను చూచాడు. ఆ చూపు ఆమె కళ్ళలో చొచ్చుకునిపోవటమేకాక హృదయంలో ఎక్కడో మూసివేసిన తలుపులను బలంగా తట్టినై. అవి భళ్ళున తెరుచుకుని మధుర మందహాస రూపంతో ఆహ్వానిస్తుంటే ఆమె మరి మూసివేయలేక

పోయింది. అతడు మెల్లగా ఆవేశాన్ని అణచుకున్నట్లుగా అన్నాడు "వారూ - మీరూ ఒకటేనా? నా పరువు కాపాడారు. మందులకు డబ్బు మీరివ్వబట్టి మా అమ్మమ్మకు స్వాస్థ్యం చేకూరింది. లేకపోతే మా తాతయ్య అనేమాటలు భరించ లేక ఎటో పారిపోయేవాణ్ణి. అతడి మాటలు ఎదుటి వ్యక్తిని అంత పిరికిగా తయారుచేస్తాయిలెండి. మీరు లేదనకుండా నెలాఖరురోజులైనా ఇచ్చారు. మీ మేలు మరువలేను."

"పదిహేను రూపాయలకే నయమైందంటారా ?"

"లేదనుకోండి. కానీ పడవలసిన మందు సమయానికి పడటంలోనే ఉందికదా! అందుకే మీరంటే నాకు ప్రత్యేకమైన అభిప్రాయం ఏర్పడిందంటే ఆశ్చర్య మేముంది? ఐనా నా కొచ్చినదాన్లో ఈ మూడు రూపాయిల మిఠాయి పెద్ద లెక్క కాదు. ఏదో నా తృప్తి - తినండి" పొట్లం అందించాడు.

ఆమె రెండు ప్లేట్లలో సర్ది అతడి కందించింది. ఒకటి తను తీసుకుంది. "ఒద్దు" అంటూనే తిన్నాడు. "మీరింత స్నేహంగా నన్ను కూర్చోబెట్టి మీ భాగంలో నాకూ పంచుతారని తెలిసినట్లయితే మరికొంచెం తెచ్చేవాణ్ణి. గుమ్మం అవతలేగా నా స్థలం. అందుకని కొద్దిగా తెచ్చాను." ఆమె ఫరవా లేదన్నది మంచి నీళ్ళందించింది. అతడు తాగి లేచి నుంచున్నాడు. "వెళ్ళొస్తాను. సినిమాకు టైం అయింది. మీరు రారని తెలుసు. పిల్చి మిమ్మల్ని ఇరకాటంలో పడెయ్యటం మూర్ఖత్వమే అవుతుంది మీకు చాలా థాంక్స్''అని వెళ్ళిపోయాడు.

ఆమె తలుపు చేరవేసి కూర్చుంది ఎందుకో నోటిలోని తీపి తనువంతా ప్రాకుతున్నట్లుంది. అతడుకూర్చుని వెళ్ళిన కుర్చీలోని వెచ్చదనం ఆమెకు వింత అనుభూతిని కల్గించింది. అతడు త్రాగివెళ్ళిన గ్లాసులో మిగిలిన నీళ్ళు ప్రేమతో నిండిన సరస్సులా కనిపిస్తోంది. ఆ నీళ్ళలో ఆమె ప్రతిబింబం పద్మంలా తేలి పోతూ ఎక్కడికో.. ఎక్కడికో వెళ్ళిపోతోంది!

*            *            *

అతడు అప్పుడప్పుడు కనిపిస్తాడు. చిరునవ్వు నవ్వి విష్‌చేసి ఏదో పలుక రించి వెళ్ళిపోతున్నాడు, అంతే. కానీ అతడు చేరువకాలేకపోతున్నా డనుకుని బాధపడేది. ఇదీ మంచిదే - అనుకుని ఓ వైపు తృప్తి చెందేది. పక్షంరోజులు గడిచిపోయాయి. ఒకరోజు సాయంత్రం ముఖం వేలాడేసుకుని వచ్చాడు. తలుపుదీసి ఈమారు పక్కకుతొలగి నుంచుంది. అతడు తటపటాయిస్తూనే లోపలికెళ్ళి కూర్చున్నాడు.

"చాలా చిక్కులో పడ్డాను. మీ సహాయం కావాలి "

"ఏమిటి ?" మాలతి ఆత్రం దాచలేకపోయింది.

"రెండువందల చిల్లర ట్రంక్‌లో పెట్టివెళ్ళాను. చిన్నచిన్న అప్పులున్నా యంటూ డబ్బు అడగటం ప్రారంభించాడు మా తాత. అందుకని తాళంవేసి పెట్టుకున్నాను. నా ఖర్చులకని అరవై ఇచ్చాను. ఇంటద్దె ఇరవైఐదు నేనే కట్టాను. నా భోజనం, టిఫిన్ బైటనే. రాత్రుళ్ళు లైట్‌గా ఏదో తిని పండు కుంటాను. ఇవ్వాళ చూస్తే పదిరూపాయలే ఉన్నాయి. అడిగితే 'నేనే తీసు కున్నాను. ఏం - తీసుకోకూడదా ?' అని రెట్టించాడు పైగా! ఇంకా పదిరోజు లున్నాయి...'' మాటలు నాన్చాడు.

''మీకు డబ్బు కావాలా ? నా దగ్గర ఎక్కువలేదు. ముప్పై సర్దగలను." అంటూనే లేచి పెట్టెతీసి మూడుపదులు అతని కందించింది. రాజేంద్ర ఆ నోట్ల తోనే ఆమె చేతిని తన రెండు చేతుల్లోకి తీసుకున్నాడు. కళ్ళలో నీళ్ళు తిరుగు తుంటే ఆరాధనతో ఆమెను చూచి అన్నాడు. "మీరు దేవతలు." అనోట్లు అందు కుని మరి ఆగకుండా గబగబ వెళ్ళిపోయాడు.

ఆమె అలాగే చూస్తుండిపోయింది. ఏమిటీ వింతవ్యక్తి ? అంత త్వరగా వెళ్ళి పోయాడెందుకని ? ఆ చేతిని చూచుకుంది. బలిష్టమైన ఆ చేతుల్లో తన చేయి ! ఆ వెచ్చదనంలోని తీయదనం ! తన ఒళ్ళు గగుర్పొడిచినంతగా అయింది.

ఒకరోజు చనువుగా అడిగింది "మీకు పెళ్ళికాలేదా ?"

అతడు హాయిగా నవ్వాడు. తల ఎనక్కివేసి నవ్వుతుంటే అతడి చిక్కటి నల్లటి వెంట్రుకలు వెనగ్గావాలాయి. "అయిందని ఎలా అనుకుంటున్నారు ?"

"మరి మీకొచ్చే డబ్బుతో హాయిగా ఉండక ఈ చిన్న యింట్లో ఉండటం దేనికి ? పొదుపు చేస్తున్నారేమో! కుటుంబం లేకపోతే ఈ పొదుపంతా దేనికి ?"

"నిజమే. అంటే చిన్నసైజు ఆఫీసరుకుండవలసిన దర్జాలు నాకు లేవ నేగా ?" - మూడుపదులు బల్లమీదపెట్టి "చాలా థాంక్స్" అన్నాడు.

ఈ మాటు మళ్ళీ అడిగింది, "మీరెక్కడ పనిజేస్తారో ఇంతవరకు చెప్పారు కారు. సి. బి. ఐ. లోనా ?" అంది నవ్వుతూ - డబ్బు పర్స్‌లోదాచుతూ.

అతడి ముఖం ఆశ్చర్యాన్ని కనపర్చింది. "అరె - ఎలా కనుక్కున్నారు ?"

ఈసారి ఆశ్చర్యపడటం ఆమెవంతు అయింది. "రహస్యంగా ఉంచుతున్నా రని అలా అడిగాను. అదే నిజమైంది." గెలిచాను అన్నట్లు చూచింది.



నువ్వూ వట్టి దద్దమ్మవి రా! అది నా దురదృష్టం!!

దురదృష్టం కాదు నాన్నా! అది నీ అదృష్టం!! అటువంటి వాళ్లే గొప్ప ప్రజానాయకులౌతారు!! రేపు నేనూ ఔతాను!!

"కనుక్కున్నారుగాని రహస్యంగా పెట్టండి. చాల పెద్ద పనిమీద వచ్చాను. అందుకే ఈ షో."

"ఐతే వాళ్ళు మీ తాత అమ్మమ్మలు కారా ?"

"ఔననుకోండి. కాని వారికి ఏం తెలీదు. ఏదో క్లర్కుపని అనుకుంటు న్నారు. నేను పేదగా - ఈ చిన్న యింట్లో ఉండటం నా 'పని'కి ముఖ్యం."

"ఓ" అంది సాలోచనగా.

"ఎవరికి చెప్పరుగా ! రహస్యంగా ఉంచాలి."

"ఉహు, చెప్పను."

"ఐతే నా విషయాలు చెప్పేస్తాను. మీరు నాకు సన్నిహితులు, ఆత్మీయులై పోయారుగా ? ఇక ఫరవాలేదు. మాది నెల్లూరు దగ్గర పల్లె. అతి సాధారణమైన కుటుంబం మాది. ఇద్దరక్కలు ఒక అన్న. అందరికీ పెళ్ళయింది. నాకు చేయా లని ఆలోచిస్తున్నారనుకోండి. నేను బాగా చదువుకుని హైద్రాబాద్‌లో ఈ బ్రాంచిలో చేరాను. చదువుకోవటంమాత్రం బి.ఎ. వరకే లెండి. స్పోర్ట్స్‌లో బాగా ఉండేవాణ్ణి. నా సర్టిఫికెట్లు, డిగ్రీ, రికమెండేషన్ లెటర్స్ అన్నీ చూపి స్తాను. ఫొటోలు కూడా.

ఒకనాడు పెద్ద ఫైల్ తెచ్చి చూపించాడు. అవి చూస్తుంటే మాలతి హృదయం ఉప్పొంగిపోయింది. స్పోర్ట్స్ డ్రస్సులో ఎంతో ఆకర్షణీయంగా కనబడు తున్నాడు. అప్పటి ముఖంలో కాస్త అమాయకత - లేతదనం అగుపిస్తోంది. చూస్తూ చూస్తూ ఒక్కసారి రాజేంద్రవైపు తిరిగి పరీక్షగా చూచింది. "ఒకేలా ఉన్నానా ! ముసలాడిలా ఉన్నానా ?'' ఆమె చుబుకంపట్టి సూటిగా ఆమె

కళ్ళలోనికి చూస్తూ అడిగాడు. మాలతి మెల్లిగా చేయి తప్పించి సిగ్గుపడుతూ తల దించేసుకుంది.

రాజేంద్ర రాత్రుళ్ళు చనువుగా వచ్చికూర్చుని కబుర్లు చెప్పి వెళ్తుంటాడు. రెండురోజుల కొకసారైనా ఆమె వంటజేసి పెడ్తుంది. మెచ్చుకుంటూ తృప్తిగా తినిలేస్తే మాలతి ఆనందాని కవధిలేకుండా పోయేది.

తాను పట్టిన కేసులను గూర్చి చాకచక్యంతో వినేవారి నాకట్టుకుని చెబుతుంటే ఆమె అతణ్ణి ఆరాధిస్తూ వినేది.

సంవత్సరం గడిచిపోయినా రాంజేంద్ర తన పరిధి దాటి వెళ్ళలేదు.

అతడి ప్రవర్తనలో ఏలోపం లేకపోవటంతో మాలతి హృదయంలో అతనికి స్థానం దొరికింది. ఆమె అతణ్ణి ప్రేమిస్తోంది. తన జీవితమంతా అతనితో గడపాలని - అతని భార్యగా తన జన్మను తరింపజేయాలని ఉవ్విళ్ళూరింది. రాజేంద్ర ఆమె తలపులను, హృదయాన్ని ఆక్రమించాడు. అతనికి అందంగా కనబడాలని తాపత్రయపడేది. మంచి చీరలు కొనుక్కుంది. రెండు జతల గాజులు చేయించుకుంది. ముత్యాల నెక్లేస్ కొనుక్కుంది. ఒకటి రెండు మార్లు సెకండ్‌షో సినిమాకు కూడా వెళ్ళింది రాజేంద్రతో. వారం రోజులు రాజేంద్ర కనబడలేదు. ఆ తర్వాత ఒకనాటి రాత్రి వచ్చాడు. స్నానంచేసి మాలతి తలుపు తట్టాడు. అలసిపోయిన అతని ముఖం చూచి ఆమెకు జాలివేసింది. త్వరగా చపాతీలు - వంకాయవేపుడు చేసి వడ్డించింది. అతడు తిని - సేదతీరి ఆమె చేయిపట్టుకొని ఆమె విడిపించుకునే లాగా చేతిలో చిన్న డబ్బా పెట్టాడు. అది నగపెట్టె. మాలతి మెల్లగా తెరచి చూచింది. ఒక వరుస నాల్గుకెంపులు - మరొక వరుస నాల్గు తెల్లరాళ్ళు పొదిన ఉంగరం

"మాలతీ- నేను చేయకూడని పని చేయటంలే దనుకుంటాను. నిన్ను పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నాను. నీకూ సమ్మతమేనని నాకు తెలుసు. ఇలా రా"

మాలతి మెల్లగా దగ్గర కెళ్ళింది. ఆమెచేతిని ఆప్యాయంగా అందుకొని వేలికి ఉంగరం తొడిగాడు. అలాగే అతడి - చేతులు పాకుతూ ఆమె నడుముచుట్టూ వెళ్ళాయి. క్షణం మాలతి బిగుసుకుపోయినా మరుక్షణం అతడి బిగికౌగిలిలో అనిర్వచనీయమైన ఆనందా న్ననుభవించింది. మెల్లగా సుకుమారంగా ఆమె ముఖాన్నెత్తి ఆవేశంతో ముద్దుపెట్టుకొన్నాడు. మాలతి శరీరంలో విద్యుత్తు ప్రవహించినట్లైంది. గట్టిగా కళ్ళుమూసుకొనే అతని



మెడచుట్టూ చేతులువేసింది. కొన్నిక్షణాలు ఆ కౌగిలిలోని మాధుర్యం అనుభ వించాక మాలతి మెల్లగా విడిపించుకొని దూరంగా జరిగింది.

"పసిమీద హైదరాబాద్ వెళ్తున్నాను. రాగానే రిజిష్టర్ మేరేజి చేసుకుందాం. సరేనా?"

ఆమె ఆనందాని కంతులేదు. సరేనన్నది. వారిపెళ్ళికి ఎన్నో అడ్డంకు లున్నాయి. అందుకే రిజిస్టర్ మేరేజి మంచిదనుకుంది.

నాల్గురోజులు వెళ్ళిపోయాయి. అనుక్షణం మాలతి తీయటి ఊహలతో, అతని కౌగిలిలోని స్వర్గసౌఖ్యాన్ని తలపోస్తూ కాలం గడుపుతోంది. ఒక్కొక్క రోజు ఒక్కో యుగంగా గడుస్తున్నాయి.

ఐదవరోజు ఎక్స్ప్రెస్ ఉత్తరం వచ్చింది.

ఆత్రంతో తెరచి చూచింది. - హృదయం ఆనందాతిశయంతో గబగబ కొట్టుకుంటున్నది. రాజేంద్ర రాసిన లేఖ.

"మై డియరెస్ట్ మాలా!

ఆదివారం తెల్లవారి దిగుతున్నాను. చాలా పనితొందరలో ఉన్నాను. నీ దగ్గరుంటే ఒక ఐదువందల రూపాయలు టి.యం.ఓ. చెయ్యి. చాల రహ స్యంగా ఉంచు. ఈ క్రింద అడ్రస్ రాస్తున్నాను. రాగానే ఇచ్చేస్తాను.

లవ్

నీ—రాజేంద్ర"

ఉత్తరం చదివి నవ్వుకుంది. రాగానే ఇచ్చేస్తాడట!

వెంటనే సెలవడిగి ఐదువందలు డ్రాచేసి టి. యం. ఒ. చేసి వచ్చేసరికి మధ్యాహ్నమైంది. మరి మూడురోజులు. అంతే - ఈ విరహ వేదన మరి ఉండదు. క్షణమొక యుగంగా గడిపింది.

ఆదివారం వచ్చేసింది. రాజేంద్ర వచ్చాడు - ఇంకా తెల్లవారలేదు.

రెండు గులాబి పువ్వులు తెచ్చాడు. వాటిని అందిస్తూ దగ్గరకు తీసుకున్నాడు. మాలతి అతని విశాల వక్షస్థలంమీద తల ఆన్చి తృప్తితో కళ్ళుమూసుకుంది. రాజేంద్ర ఆమెను పొదివి పట్టుకొని ప్రేమపాఠం వల్లించాడు. తరువాత ఇద్దరూ ఎడమై మంచంమీద కూర్చున్నారు.

"అమ్మమ్మకు కనిపించాలి. లేకపోతే ఏదో గొడవ పెడ్తుంది. ఇదిగో నీడబ్బు" అంటూ ఐదువందల రూపాయల నోట్లు అందివ్వబోయాడు. ఆ క్షణం ఎంతో విలువైనదిగా ఉంది మాలతికి. ఆ పవిత్రసమయాన్ని డబ్బు మలిన పరుస్తుంది.

"అప్పుడే తెచ్చారు. నేను అడిగానా!" అంది బుంగమూతిపెట్టి.

"ఓ...కె... నీకు కోపంవచ్చింది. రేపు బాంక్‌కు వెళ్ళి నేనే కట్టేస్తాను. సరేనా!" అంటూ నోట్లను నిర్లక్షంగా జేబులో పెట్టుకున్నాడు. "డబ్బు - డబ్బు - డబ్బు. ఇక ఏ మాటలూ లేవా?"

"ఉన్నాయి, రేపే మన పెళ్ళి."

"ఔనా?" అన్నట్లు కళ్ళు విశాలంచేసి ఆశ్చర్యాన్ని ప్రకటించింది.

"ఒద్దా?" చిలిపిగా చూస్తూ అడిగాడు.

"ఒద్దు" అని పకపక నవ్వింది.

"సరేలే. చాలా పనులున్నాయి. వస్తాను" ఆమె భుజాన్నితట్టి లేచి వెళ్ళి పోయాడు.

ఆ సాయంత్రం వచ్చి - ఓ రెండు నిమిషాలు పలకరించి వెళ్ళిపోయాడు. మాలతి పడుకుంది, తీయటి కలలుకంటూ. ఇంకొక్క పన్నెండు గంటలు. తను రాజేంద్ర సొత్తయిపోతుంది. తనకు పెళ్ళి. కొన్నాళ్ళు నలుగురూ 'రిజిష్టర్ పెళ్ళి చేసుకుంది' — అంటారు. ఆ తరవాత అంతా తను మామూలుగానే చూస్తారు. తన కష్టాలన్నీ గట్టెక్కుతాయి. మధురమైన ఊహలు అల్లిబిల్లిగా అల్లుకు పోతుంటే నిద్రరాక మంచంమీద పడుకుని కనబడని నక్షత్రాలకేసి చూస్తోంది. ఎక్కడో పదకొండు కొట్టారు.

ఎవరో తలుపు తట్టారు.

గాభరాగాలేచి "ఎవరు?" అంటూ కిటికీలోంచి చూచింది.

"నేనే మాలా" రాజేంద్రకంఠం.

మాలతి తలుపు తీసింది. అతను మెల్లగా లోపలికొచ్చి తలుపు గడియ వేశాడు. ఆ చీకటిలో అతడు చేతులు చాచినట్లు మాలతికి తెలియదు. మరు క్షణంలో ఆమె అతని కౌగిలిలో ఉంది!

* * * *

తెలతెలవారుతుండగా మెలకువ వచ్చింది. రాజేంద్ర లేడు. పక్కలో నలిగిన రెండు గులాబి పువ్వులు - గతరాత్రి కథను గుర్తుకు తెచ్చాయి. నలిగిన ఆ పూలను చేతుల్లోకి తీసుకుని ఆఘ్రాణించింది. వాసనలేవు. నవ్వుకుని పార వేసింది

తను తొందరపడిందేమో!

తొందరేముంది. ఇవ్వాళ లోకంధృష్టిలో తను అతడి భార్య అయిపోతుంది. తను తప్పుచేయలేదు. ఇంకొన్ని గంటలే.

తలుపు తోసుకుని వచ్చాడు రాజేంద్ర. అతణ్ణి చూడగానే ఏదో నూతన అనుబంధం తాలూకు ఆనందం హృదయాన్ని ఆవరించింది విప్ఫారిత నేత్రా లను ఓ మారు నులుముకుంటూ లేచి కూర్చుంది. పక్కలో కూర్చున్న రాజేంద్ర భుజంమీద తల ఆన్చింది. రాజేంద్ర ఆమె నడుముచుట్టూ చేయివేసి పరిహాసంచేస్తూ అన్నాడు "పెళ్ళికూతురు - ఇంకా మంగళస్నానం చేసినట్లు లేదు నేనా చూడు!"

ఆమె నవ్వింది. గభాల్న లేచి గుడ్డలు తీసుకుని బాత్‌రూంలోకి వెళ్ళ బోయింది "ఆగు" అంటూ మంచం క్రిందినించి ఒక సూట్‌కేస్ తీశాడు. దానిలో తడిగుడ్డలున్నాయి. పైన ఒక పాకెట్ ఉంది. అది ఆమెచూసేలా తీసి పైన పెట్టాడు.

''ఇది నీకు. కానీ ఇప్పుడే చూడకూడదు. మనం కలసి వెళ్ళేటప్పుడు కట్టు కోవాలి." ఆమె నవ్వి వెళ్ళిపోయింది అదేమిటో పాదాలు భూమిమీద ఆనినట్లు లేదు. అంత హాయిగా ఉంది మనసు.

తలారా స్నానంచేసి తడి వెంట్రుకలను టవలుతో చుట్టి చలువచేసిన తెల్ల వాయిల్‌చీర చుట్టుక్షొని వచ్చింది.

గదిలో రాజేంద్ర లేదు. నవ్వుకుంది. మళ్ళీ వస్తాడు. మంచీ మర్యాద తెలిసినవాడు. తను ఫ్రీగా డ్రెస్ చేసుకోగలదు. తలుపు జారవేసి లోపలికెళ్ళింది. అక్కడున్న సూట్ కేస్ లేదు. మంచంమీద ఉన్న చీర పాకెట్ లేదు సరిగదా ఆ స్థానంలో బ్రౌన్ కవరుంది. దానిమీద చిరునామా లేదు. ఏమిటిది?

ఏమైనా అర్జంటు పని తగిలి వెళ్ళేడేమో అని, గబగబ చీరకట్టుకుని బ్రౌన్ కవరు అందుకుని ఆత్రంతో లోపలి కాగితాలు లాగింది. రాజేంద్ర ఉత్తరం! తారీఖు అదేరోజు ప్రాతఃకాలం 5 గంటలు.

ఆమెను సంబోధించలేదు. చదువుతూపోతున్నకొలది ఆమె రక్తాన్నెవరో పిండేస్తున్నట్లుంది. కళ్ళు బైర్లుకమ్మి నిస్త్రాణతో తలగడమీద తల ఆన్చింది. పూర్తిగా చదివే ధైర్యంలేదు. చేతికి నలిగిన పూలు తగిలాయి. అవి తగలగానే దుఃఖం కట్టలు తెంచుకొంది. లేని ఓపిక తెచ్చుకుని తలుపు గడియవేసి మళ్ళీ చదవటం ప్రారంభించింది

"నేను మళ్ళీ పోతున్నాను. ఎక్కడికి అని అడక్కు. మరొక కొత్త స్థలానికి. నీలాటి మరో వ్యక్తిని మోసపుచ్చి దొరికింది తీసుకుని పారపోవటానికి...!!

తడబడుతున్న కాళ్ళతో పరుగున వెళ్ళి డ్రాయర్ లాగింది. తన నగలుఏమీ లేవు. పర్స్‌లో కాస్త ఎక్కువే పెట్టింది. పెళ్ళిరోజు కదా! నూట ఏభై రూపాయలు లేవు. చిల్లర మాత్రం ఉంది. పరుగున వెళ్ళి పెట్టె తెరచింది. నాలుగైదు మంచి చీరలు లేవు. కొత్తగా కొనుక్కున్న ఐదు గిన్నెల స్టీలుటిఫిన్ కారేజి లేదు.

ప్రభూ—ఏమిటిది? ఇలా ఎందుకు జరిగింది—ఇంతలా మోసపోయానేమిటి? నేనింత చౌకబారు వ్యక్తినా? ఆందోళనతో బాధతో ఉవ్వెత్తున లేస్తోన్న హృదయాన్ని అదిమిపట్టి తిరిగి చదవటం ప్రారంభించింది.

''నేను నీకు చెప్పిన జీవిత కథ నిజమే. బి.ఎ. చదివాను. ఉద్యోగం దొరకలేదు. ఆకలి బాధ అంటే ఏమిటో నాకు తెలుసు. కోటి విద్యలు కూటి కొరకే కదా! ఈ విద్య అలవర్చుకున్నాను. ఐదేళ్ళుగా జీవితం ఈ విధంగా గడిచిపోతోంది. మూడు పూటలు తింటున్నాను. చేతిలో వందలు ఆడకపోయినా పర్స్ ఖాళీగా ఎన్నడూలేదు. నిరుద్యోగి - పేదరికపు చిహ్నాలన్నీ మాయమైపోయాయి.

"నీలా ఒంటరి వాళ్ళను - పెళ్ళికానటువంటి ఉద్యోగినులను పట్టటం చాలా




సులభమని గ్రహించాను. నీ స్నేహాన్ని సంపాదించాలని ఎంతో తాపత్రయ పడినా గుంభనంగా మెల్లమెల్లగా జయించాను. కొందరు చాలా త్వరలోనే వలలో పడిపోయారు. నీవు అందని పండుగా కనిపించావు. అందుకని నిన్ను పొంది - నీ సొమ్ము అపహరించాలని దుష్టతలంపును అహంకారంతో ఆచరణలో పెట్టాను.

"ఇలాగే ఈ సమయంలో మరిఇద్దరిని విడిచి వెళ్ళిపోవాలి. ఒకే సమయంలో ముగ్గురి దృష్టిలో మంచివాడిననిపించుకుని - నమ్మకం కల్గేలా ప్రవర్తించి ఈ పద్నాలుగు నెలలు మీ సొమ్ము తింటూ కాలం గడిపాను. ఒకరింట్లో కాఫీ టిఫిన్- మరొకరింట్లో భోజనం. ఇలాగే మీ ముగ్గురి సందున నాకు బాగానే దబ్బొచ్చింది.

"నీలాగే ప్రతివారు తామంతట తామే నా దగ్గరికి వచ్చారు. నేనెవ్వరిని బలా త్కారించలేదంటే మీ అందరి దృష్టిలో నా స్థానం ఎంత ఉన్నతంగా ఉన్నదో గ్రహిస్తే నా నటన మీకెంతో ఆశ్చర్యాని కల్గిస్తుంది.

"మా తాత గట్టివాడు. నాదగ్గర డబ్బున్నదంటే తన వ్యసనాలకు నా నించి డబ్బు లాగచూస్తాడు. అందుకని అతడి ముందర నీ నించి అప్పుగా తీసు కున్నాను. మా తాత ఉనికి నా కెంతో అవసరం. మీ ముగ్గురు నన్ను దొంగగా తలంచకుండా ఇతడొక బురఖా. అమ్మమ్మకు చెవుడు. తాతయ్య కిళ్ళీ కొట్టు దగ్గర మకాం. అందుకే ఎన్ని కల్పితకథలు చెప్పినా అవి బైటికి పొక్కలేదు. నువ్వెళ్ళి ఎవర్నీ అడగవు. నా మీద అనుమానముంటే కదా !

"నాకు కవిత్వం రాదు. దానికి లొంగుతావేమోనని చూచాను అంతే. ఎవడిదో కాపీ కొట్టాను. అది నా స్వంత కవిత్వం కాదు. నాకు ఎక్కువగా రాయటం కూడ ఇష్టంలేదు. టైం వేస్ట్ కూడా.

కొన్నాళ్ళు ఈ డబ్బుతో హాయిగ జీవించగలను. మీ లాంటివాళ్ళు పోలీస్ రిపోర్ట్ ఇవ్వరనే ధనవంతులజోలికి పోకుండా మీలాంటి వారి ఆదరణకోసం పాటుపడ్తుంటాను.

నువ్వు అదృష్టవంతురాలివి. ఒకామెను పెళ్ళాడి నెలకావస్తోంది. మరొక దానితో ఆరు నెలలుగా 'స్నేహం'తో ఉంటున్నాను.

"అంతేకాదు. రాత్రి నువ్వు ఐదు వందల తీసుకోలేదు. తీసుకోనంతా మంచిదే. అవి దొంగనోట్లు. నేను ఇంకొకరకం "సి. ఐ. డి.ని.

"మా తాత అమ్మమ్మను ఏమీ అడక్కు. వారికేమి తెలియదు. నాకు ట్రాన్స్ఫర్ అయిందని చెప్పాను. వందరూపాయలిచ్చాను. ఎంతో సంతోషించారు. చెప్పకుండా వెళ్ళిపోదామనుకొన్నాను గాని నా కోసం ఎదురుచూస్తావని జాలి తలచి రాస్తున్నాను.

"మరొకమాట. నెల పోయాక నీకు డాక్టర్ అవసరం కల్గితే ఈ క్రింది చిరునామాకు వెళ్ళు. ఆమె నీకు సహాయం చేస్తుంది."

ఆఖరి మాటలు చదివి ఆమె నిలువెల్లా కంపించిపోయింది. ఒక్కొక్క అక్షరం అణువణువును దహించివేస్తుంటే హృదయవిదారకంగా రోదించింది.

ఒకనాడు తనకు అనుమానం వేసింది. అతడు పెళ్ళి అన్నాడు. ఆరోజే తను చేస్తున్న పని సరియైనదేనా అని ప్రశ్నించుకుంది. తన హృదయానికి తగినట్లుగా జవాబు చెప్పుకొంది.

తన పెళ్ళిరోజు - నిర్జీవంగా నవ్వుకుంది. పిచ్చిగా తిరిగింది. అద్దంలో ప్రతిబింబం భయంకరంగా కనిపించింది. తలనించి కారిన నీరు కన్నీరు ఏకమై ధారకట్టినై. ఆ వికృతరూపాన్ని చూచి అనుకుంది. 'మనిషి ఎంత త్వరగా మారిపోతాడు!'

ఆమె బాధ తనను గూర్చి మాత్రమే కాదు. ముందు ఎందరు ఏయే ఊళ్ళలో మోసపోయారో! తనతోపాటు మరి ఇద్దరి జీవితాలు నాశనమైనై. ఈ వేళ మరెందరివి కానున్నవో! ఇటువంటి వారిని అరికట్టే మార్గంలేదా!

తన అవివేకానికి తనకే నవ్వు వచ్చింది. తన పిచ్చిగాని - ఇటువంటి వాళ్ళుంటారని తను పేపర్లలో, కథల్లో చదవటంలేదూ! మరిఅతడంతయుక్తితో చాకచక్యంతో నమ్మకంగా ఉండి ద్రోహంచేశాడు. చదువుకున్నది - ఇటువంటి వారుంటారన్న జ్ఞానంకల్గిన తనే ఈ వలలో చిక్కుకున్నది. ఎవరికి - ఏమని చెప్పగలదు.

ఆ రోజంతా కుమిలి కుమిలి ఏడ్చింది. అంతకు ముందు - ఆరాత్రి స్వర్గ సౌఖ్య మనుభవించాననీ మురిసిపోయింది. ఈ రోజు అదొక విషజ్వాలగా తలంచింది. ఇప్పుడదంతా ఇంకా జుగుప్సాకరంగా భరింపరానిదిగా అయి హృదయంలో అశాంతిని రేపుతోంది. అవమానభారంతో శరీరమే కుంచించుకు పోతు ట్లున్న భావించింది. దుఃఖమే శరణ్యమైంది.

ఏకధాటిని వారం రోజులు సెలవు పెట్టింది. ఏ జబ్బు లేకపోయినా ఏకో పెద్ద జబ్బువచ్చినట్లు ఫీలయింది. ఫ్రెండ్స్‌వచ్చి చూచి వెళ్ళారు. మాలతి వాలకంచూచి వాళ్ళెంతో ఆశ్చర్యపడ్డారు.

మాలతికి ఆత్మహత్య చేసుకోవాలన్నంత నిరాశ కల్గింది. కానీ ఎలాగో ధైర్యం చెప్పుకుంది. మళ్ళీ ఆఫీసుకెళ్ళటం ప్రారంభించింది.

రోజులు గడుస్తున్నాయి. యాంత్రికంగా వెళ్ళివస్తోంది. అతడి ఆఖరిమాటలు ఆమె నెప్పటికప్పుడు భయాందోళనలతో ముంచివేస్తున్నాయి. మానుతున్నగాయం రేగింది. ఏ విధమైన వికారం లేకపోయినా తనకు అనుమానం కల్గింది. ఆనాటి పూలబాటలోని ముళ్ళు బలంగా లోతుగా నాటుకుపోయాయి. కాళ్ళలో కాదు, హృదయంలో — గర్భంలో. అనుమానం దృఢమౌతున్నకొద్దీ ఆమె హృదయం బాధతో మూల్గుతుంది.

ఏంచెయ్యాలి ! ఆత్మహత్య - ఛీ ... ఛీ ... తనకు భగవంతుడిపై విశ్వాసం, భక్తి యెక్కువ. ఈ తృణప్రాయమైన శరీరంలో ఆత్మనుంచి ఈ లోకానికి పంపారు. ఈ ఆత్మ ఆయనది. ఈ తృణప్రాయమనుకున్న శరీరాన్ని తను త్యజించటానికి తనకు హక్కులేదే ! తనే తనది కాదు. నిత్యమైన ఈ ఆత్మపవిత్రతకోసం తను శ్రమించి తాపత్రయపడాలిగాని ఈ శరీరంకోసం కాదు. చనిపోయి సాధించేది లేకపోగా తన ఆత్మనాశనమైపోతుంది. దాని ఉనికి భగవంతుని సన్నిధానమే కదా ! ఆ మహావకాశాన్ని తాను జారవిడుచుకోలేదు. బ్రతికి తను సాధించలేకపోవచ్చుగాని తను పిరికిది కాలేదు. ఏదో మార్గాన్వేషణ ప్రారంభించాలి అటువంటివారికి భగవంతుని సహాయం ఉంటుందంటారు !

రెండునెలలు. ఎంతకాలం దాచుకోగలదు !

ఏమీ తోచలేదు. మార్గంవెదకాలి. ఇంట్లో కూర్చుంటే పనికాదు. ఆమె రిక్షా తీసుకునీ కృష్ణాబ్రిడ్జిదాటి ఆవలి ఒడ్డుకు వెళ్ళి కూర్చుంది. ఆ రోజు ఆదివారం. తన స్నేహితులు తనూ తరచు వ్యాహ్యాళికెళ్ళే స్థలం అది. ఆ రోజు ఐదుగంటలైనా ఎవరూ రాలేదు. మరో గంటలో చీకటిపడ్తుంది. చేతిలో గొడుగుంది.

పర్స్ ఉంది. కాసేపు ప్రకృతిని తిలకిస్తూ కాలంగడిపి తిరుగుముఖం పట్టింది. మెల్లగా నడుస్తోంది బ్రిడ్జిమీది కొచ్చింది కాలిబాటన చాలామంది వెళ్తూ వస్తు న్నారు. మాలతి కాసేపు రెయిలింగ్ పట్టుకుని నుంచున్నది. క్రింద నీరు వడిగా ప్రవహిస్తోంది. ఆ నీటి ఉరవడినిచూచి ఒకవిధమైన భయం ఆవరించింది. కళ్ళుమూసుకుని నుంచుంది. ఆ తరువాత తేరుకుని మళ్ళీ నడవటం ప్రారంభించింది.

ఆమె మరొకమారు బ్రిడ్జిమీద ఆగింది. తొంగిచూచింది. ఆ నీళ్ళలో తన భావిజీవితపు తాలూకు నీడలేమైనా కనిపిస్తాయా అన్నట్లు వెదుకుతుంది. ఉహూ- ఆ నీరు ఏదో భూమిని సస్యశ్యామలం చేయటానికి వడివడిగా వెళ్ళిపోతోంది తన కోసం సమస్యను పరిష్కరించటాని కిష్టంలేదు ! తను ఆ నీళ్ళలో పడిపోదు — అది నిజం. ఉస్సురని నిశ్వసించి మళ్ళీసాగిపోయింది.

ఆమె నాలుగడుగులు వేసిందో లేదో ఎవరో ఆమెను పిల్చారు - "ఏమండీ" అని. మాలతి వెనుదిరిగి చూచింది. స్కూటర్‌మీద ముప్పైఏళ్ళపైబడ్డ వ్యక్తి కూర్చుని ఉన్నాడు. "మీతో మాట్లాడాలి. బ్రిడ్జి చివర ఆగుతారా ?" అతను ఆమె జవాబుకోసం ఎదురు చూడకుండానే స్కూటర్‌మీద వెళ్ళి మలుపు దగ్గర ఆగిపోయాడు. మాలతి అతణ్ణి సమీపించి ఆగింది.

అతను స్కూటర్ ఆపుజేసి పక్కగాపెట్టి నుంచున్నాడు.

"మీరు రెండుసార్లు బ్రిడ్జిమీదనించి నీళ్ళలోకి చూచారు. అంతేకాక మీ ముఖంలో నిస్పృహ - రెండుసార్లుకూడ స్థిరనిశ్చయానికొచ్చినట్లు నిశ్వసించి నడిచారు. ఇదేదో ఆత్మహత్య బాపతేమో అని అడుగుతున్నాను. అంతే."

ఆమె అతడికేసి ఆశ్చర్యంగా చూచింది. ఈ వందలాది జనంలో తనను ఇతడు గమనించాడు ! తన ఉనికిని గుర్తించాడు.

"మీరు భయపడుతున్నారా ? ఈ పరాయివ్యక్తికి ఏం చెప్పాలని ?"

"ఔను. మీరెవరో తెలియదు, అనుమానపడటం సహజమే కదా."

అతడు మందహాసం చేశాడు. "నా పేరు ఆనందరావు అంటారు. ఇక్కడే ఇంజనీరుగా పనిచేస్తున్నాను. ఇవ్వాళ ఈ బ్రిడ్జి చెకింగ్‌కు వచ్చాము. సాయంత్రమైందని వెళ్ళిపోతున్నాను. మా యిల్లు స్టేషన్‌కు దగ్గర. ఇక చెప్ప దలిస్తే చెప్పండి."

"నా పేరు మాలతి. బి.ఎ వరకు చదువుకున్నాను. పోస్టల్ డిపార్ట్‌మెంట్‌లో క్లర్కుగా పనిచేస్తున్నాను." ఆమె పరిచయం చేసుకుని ఆపుజేసింది. అతడు



ఆమె కళ్ళలోకి తీక్షణంగా చూశాడు. "నా ప్రశ్నకు జవాబు రాలేదు ... ఐనా ఇది అనువైన స్థలం కాదు" అంటూ అటూ ఇటూ చూచాడు. రిక్షా కనబడింది. "ఎక్కండి...స్టేషన్‌కు పద" అని రిక్షావాడికిచెప్పి అతడు స్కూటర్ మీద ముందుకు వెళ్ళిపోయాడు.

మాలతి దగాపడిందోమాటు. ఇప్పుడు రిక్షాలో వెళ్ళటానికి సంశయించింది. తను తెగించందే ఏమీకాదు - అనుకుని రిక్షా ఎక్కింది. ఆమెకు స్కూటర్ ఎక్కడా కనిపించలేదు. మధ్యలో రిక్షాను తిప్పి తన యింటికెళ్ళాలన్న ఆలోచన నతికష్టంతో తిప్పికొట్టింది.

స్టేషన్ దారిలో అతను రిక్షాను ఆపుజేసి డబ్బులిచ్చి పంపించివేశాడు. చిన్న ఇంటిముందుకు నడిచి "రండి, లోపల కూర్చుందాము" అని చిన్న గేటు లోంచి లోపలికెళ్ళాడు. నాలుగైదు పూలకుండీలు, ఒక మాలతీలత - ఒక బోగన్‌విల్లా లత, మెట్టతామరలున్నాయి. అంతా పదిగజాల చతురస్రంలో ఉందాతోట. అప్పటికే రెండు లాన్ చెయిర్స్ వేసున్నాయి. చిన్న కుర్రాడు చిన్న స్టూలువేసి వెళ్ళాడు. మరి కాసేపటికి కాఫీట్రే తెచ్చిపెట్టి వెళ్ళిపోయాడు.

అతడే ప్రారంభించాడు "మీరు ఇంటికెళ్ళకుండా వచ్చారు. అంటే మీరు పెద్ద ఆపదలోనైనా చిక్కుకుని ఉండాలి - లేదా పరిష్కారాని కందని, సమస్యతో సతమతమౌతుండాలి. మరొకవ్యక్తి సహాయం మీకు అవసరమైతే

నిస్సంకోచంగా చెప్పండి. నేను పరాయివాడినే కాని నా జీవితంలో కొన్ని నియమాలు పెట్టుకున్నాను. వాటి నుల్లంఘించలేదు. నా జీవితధ్యేయం ఒక్కటే. చేతనైనంతవరకు పరులకు సహాయపడటం." అతడు ఒక కప్పు ఆమె కందించి మరొకటి తను తీసుకున్నాడు.

"ఇంట్లో మీరొక్కరే ఉంటారా ? మీ భార్య లేరా ?" అతి మామూలుగా అడిగింది.

"ఇంట్లో నేను, ఆ పని కుర్రాడు ఉంటాము. నాకు పెళ్ళయింది. మూడేళ్ళ క్రితం విడాకులు తీసుకున్నాము."

ఆమె ఆశ్చర్యంతో చూచింది. 'నిజమేనా ? ఇతడు మరొక రాజేంద్రకాడు కదా ! అతడు చెప్పింది నమ్మదగునా ?'

"ఏ కారణాలవల్ల విడాకులు తీసుకున్నామో ! అనుమానంగా ఉండొచ్చు కదా ! నాకు సంతానం కల్గించే శక్తిలేదు. అంటే నా రక్తం R.H. (Rhesus పాజిటివ్ – రక్తంలో ఒక రకమైన జబ్బు, పిల్లలకు వస్తే వారు బ్రతకరు.) పాజిటివ్. ముందరే ఆపరేషన్ చేయించుకున్నాను. తలిదండ్రులామెకు బలవంతంగా పెళ్ళిజేశారేమో. నాకి యోగ్యతలేదని వెంటనే విడాకులడిగింది. విడాకులు తీసుకున్న నెలలోపుగా మరొక వివాహం చేసుకుంది. నాకు పిల్లలంటే ఎంతో అపేక్ష. పెంపకానికి తీసుకుందామని ప్రయత్నం చేశాను. కాని ఆమె వెళ్ళిపోయింది. ఈ మూడేళ్ళనించి ఇలా ఒంటరి జీవితం గడుపుతున్నాను నిస్సారమైన ఈ బ్రతుకులో ఏమార్పు లేదు. యాంత్రికంగా రోజులు వెళ్ళబుచ్చటమే. పునర్వివాహం చేసుకుందామని ఆలోచించానుగాని నా బలహీనతను అంగీకరించే విశాలహృదయిని దొరకలేదు. టైం కలిసిరాలేదని సర్దిచెప్పుకున్నాను. నాకు ముప్పైఎనిమిది సంవత్సరాలు. మా స్వగ్రామం వేటపాలెం. తల్లిఉంది, తండ్రి లేరు. మరొక తమ్ముడున్నాడు... మరి ఇక మీరు మీ మనసు విప్పి మాట్లాడవచ్చునేమో."

కాఫీ కప్పు మెల్లిగా స్టూల్‌మీద పెట్టింది.

"నేను మోసపోయాను. ఇంతా – అంతా అని చెప్పలేను. ఈ ఊబిలోంచి బైటపడి ఎలా గౌరవంగా బ్రతకాలో నాకు తెలియటంలేదు. మరి రెండునెలల్లో నా గౌరవాన్ని నేను నిలబెట్టుకోలేకపోతే నన్ను అతి నీచంగా చూస్తుంది ఈ సంఘం. తలెత్తుకుని తిరగలేను. ఆత్మహత్య చేసుకునేటంత పిరికిదాన్ని కాను. మర్గాన్వేషణకై ఒటుగా స్నేహితుల యిండ్లకు వెళ్ళాను."

"విడమర్చి చెప్పలేరా ?" అతడు సిగరెట్ వెలిగించాడు.

ఆమె అతడివైపు చూచింది. అతని ముఖంలో మానవత ప్రతిబింబిస్తోంది. జీవితంలో హూటాహుటిని పోరాడిన చిహ్నాలలో నుదుటిమీది చారలు – మనిషి హృదయాంతరాల్లో చూడగలశక్తి ఉన్నదా – అనిపించే విశాలనేత్రాలు – నిండైన విగ్రహంలో కూర్చున్న అతడిపై ఆమెకు భక్తిశ్రద్ధలు ఏర్పడ్డాయి.

పర్స్ తెరచి కాగితంతీసి దానిమీద తన ఇంటి అడ్రస్ రాసింది మరొక పాకెట్ తెరచి రాజేంద్రరాసిన ఉత్తరం తీసింది.

"ఇదొక లేఖ. నేను వెళ్ళిన తరవాత చదవండి. దానిలో మీ ప్రశ్నకు జవాబున్నది. ఇది నా అడ్రసు. చదివిన తరవాత దాన్ని పంపండి. లేదా మీ కభ్యంతరంలేకపోతే మీరు రావచ్చు. రిక్షా పిలిపిస్తే వెళ్ళిపోతాను. మీకు నా కృతజ్ఞతలు"

అతడామె అందించిన వాటి నందుకున్నాడు. వీధిలోకివచ్చి ఆమెను రిక్షా ఎక్కించి వచ్చాడు.

అతడు తారట్లాడలేదు. వెంటనే కూర్చుని ఉత్తరం ఆమూలాగ్రం చదివాడు.

* * *

ఇల్లుజేరిన మాలతి నిర్లిప్తంగా ఉండిపోయింది. తను అలా ఇచ్చివచ్చింది. ఇతడు మరొక పట్టువల తనచుట్టూ వేయటంలేదు కదా ! అసలు తనకేం కావాలి ? తనకు వివాహం కావాలి. ఈ పెళ్ళి బురఖాచాటున తన వ్యక్తిత్వాన్ని దాచుకోవాలి. తన గర్భఫలానికి పేరు – ఊరు ఇవ్వాలి. తను గుట్టుగా ఉద్యోగం చేసుకుంటుంది. తనకు కావలసినదల్లా ఒకటే. తనను వివాహం చేసుకుంటే చాలు. తనను పోషించనవసరంలేదు. తనకు వైవాహిక సుఖం యివ్వనవసరంలేదు. ఆ వ్యక్తి తరవాత ఎవరితో ఎలాఉన్నా తను అడగదు. తనకు ఒకటే కావాలి. పెళ్ళయిన చిహ్నం – అంతే.

మరుసటిరోజు మాలతి అలసిపోయి ఇంటికొచ్చింది. కాఫీ తాగి విశ్రాంతిగ పడుకన్నది. మాగన్నుగా నిద్రపట్టింది.

రిక్షావాడు అమ్మగారూ అని పిలవగా మెలకువవచ్చి తలుపుతీసుకుని బైటికొచ్చింది. అతడు వస్తాడన్న విశ్వాసం ఆమెకు లేదు. ఎందుకొస్తాడు ? అతనికి కావలసింది కళంకంలేని కన్నెపిల్ల. తనలాంటి కాలుజారిన చౌకబారు మనిషికాదు.

ఆనందరావును చూచి ఆశ్చర్యానందాలను దాచుకునే నెపంతో ముఖాన్ని

కొంగుతో తుడుచుకుంటూ "రండి" అని లోపలికి దారితీసింది. ఆమె తన రాక కానందిస్తోందని ఆనందరావుకు తెలిసి సంతోషించాడు.

అతడే పలుకరించాడు "ఉత్తరంచదివి చాలా విచారించాను. ఒక వ్యక్తి లోని స్నేహశీలతను, నిజాయితీని మనం ఎల్లప్పుడు గౌరవిస్తాము. అది స్త్రీ అయినప్పుడు ఆరాధనాభావంతో ఉంటుంది. ఆమె అవివాహిత అయినప్పుడు ఆ ఆరాధనాభావం ప్రేమగామారి అతణ్ణి భర్తగా పొందాలనుకుంటుంది. ఇది సహజమైనది. ఆమె వివాహిత అయితే అతణ్ణి గౌరవిస్తుంది. అతడి సన్నిధిలో హృదయవికాసంపొంది ఆనందిస్తుంది. సోదరతుల్యునిగా భావిస్తుంది. కనుక మీరు సులభంగా మోసపోలేదని గుర్తుంచుకోండి. ఏ క్రమంలో అతడు మీకు చేరువఅయ్యాడో తెలియదుగాని అతడి ఉత్తరంద్వారా తెలిసినదాన్నిబట్టి చాల చతురతతో మీ మనసులో చోటుచేసుకున్నాడు." ఉత్తరాన్ని అందించాడు. ఆమె అందుకుని తలొంచుకుంది కొన్ని క్షణాలు మౌనంగా గడిచింది. ఆనందరావు అన్నాడు, "మాలతిగారూ – మీకేం కావాలి? ఏదో నెపంతో వెళ్ళిపోయి డాక్టర్ సలహాపొంది ఖాళీగా తిరిగొస్తారా? లేదా మరొకర్ని వివాహం చేసుకుంటారా? మీ హృదయంలోని మాట చెప్పి సెయ్యండి." అతడి మాటల్లో గంభీరతకు ఆమె చలించిపోయింది. ఇతడితో తన కోరికను చెబితే తప్పేముంది. నవ్వి వెళ్ళిపోతే వెళ్ళిపోనీ – అందువల్ల తనకేం అవమానం కల్గదు – అవమానం అన్నపదానికి అర్థం తనకులేదు. అంతాపోయింది- గౌరవం–పవిత్రిత అన్నీ ఆరాత్రే నలిగిపోయి వాడిపోయాయి.

అతడివంక నిశ్చలంగా చూసి కళ్ళువాల్చేసి మెల్లగా అంది, "ఎవరైనా నాకు పెళ్ళయిందన్న ముద్రవేసి వెళ్ళిపోతే చాలు. అతడు నాతో ఉండక్కర్లేదు. ఆ వివాహం లోకందృష్టిలో మాత్రం వివాహమైతే చాలు. నా ఈ స్థితిలో నేనొకర్ని మోసగించలేను. వారు నాకు కట్టుబడి ఉండనవసరంలేదు. అవివాహితగా – తల్లిని కాలేను.

అతడినించి వెంటనే జవాబు రాలేదు. నేలకేసి చూస్తున్నాడు! పదినిమిషాలు మౌనం! ఆమె తిరిగి ప్రారంభించింది. "మీ శక్తికి మించిన పని ఇది. మీరు నిశ్చింతగా వెళ్ళండి. నేనేమీ అనుకోను. ఉత్తరం చదివినట్లు మర్చిపొండి." గరళాన్ని మింగుతున్నట్లు అంది.

అతడు మౌనంగా పర్స్‌తీసి, తెరచి ఆమెకిచ్చాడు. ఐడెంటిటీ కార్డ్ ఉండవలసిన స్థానంలో నల్గు పంక్తుల చిన్న పద్యం ఆంగ్లంలో రాసుంది. సిట




మునిగిపోతున్నవాని ఆర్తనాదం విని ఏ నావికుడైనా ఊరకుంటాడా? వ్యాధిగ్రస్తులు చనిపోతారని తెలిసి ఏ వైద్యుడైనా నిశ్చింతగా ఉంటాడా? బిడ్డలు నాశనమైపోతుంటే చేయూతనిచ్చి నిలపకుండా ఏ తల్లి చూస్తూ ఊరకుంటుంది?

లక్షలకు లక్షలు బాధలు పడ్తుంటే నీవు చూస్తూ విశ్రాంతిగా కూర్చుంటావా? ఆమె అతడికి తిరిగి ఇచ్చివేస్తూ ఆశగా చూచింది "ఇందుకేనా మీరు స్వయంగా వచ్చారు?"

"ఔను. ఒకటి ఆలోచిస్తున్నాను. మీరు కోరినట్లు ఎవరైనా మిమ్మల్ని వివాహం చేసుకుంటారనుకోండి. కానీ వారు మీరు ఇచ్చే తేలికైన అర్థం వివాహాని కివ్వకపోతే? ఆ వ్యక్తి మిమ్మల్ని భార్యగా స్వీకరించి అర్ధాంగిగా గౌరవించి సంసారం చేయదలిస్తే ఏమంటారు?"

మాలతి గాభరాతో చేతులు గట్టిగా నులుముతూ బాధతో మూల్గి అంది, "మరి బిడ్డ! ఆ బిడ్డను అనాథగా వదల్లేను - డాక్టర్ దగ్గర కెళ్ళలేను." ఆనందరావు జాలిగొల్పేచూపుల్ని ఆమెపై కేంద్రీకరించి చూస్తున్నాడు. నిజంగానే 'స్త్రీ' అనే భగవంతుని సృష్టిని చూస్తున్నాడు. తల్లిగా ఆ స్త్రీ పరాకాష్ఠనందుకున్నది. తన సుఖం తృణప్రాయం. తన బిడ్డ ఆమె సర్వస్వం. తల్లి త్యాగశీలతను - ఆమెలోని ఈ ఉదాత్తగుణాలను ఎవరూ చులకనజేసి చూడగలరు? అతడు లాలనగా అన్నాడు, "ఆ బిడ్డ ఏ శరణాలయంలో పెరగనవసరంలేదు. మనదగ్గరే ఉంటుంది."

"మనదగ్గరా?" ఆమె కళ్ళు చక్రాల్లా అయినయ్. పాలిపోయిన పెదిమలు కంపించసాగినై. అంతే, ఒక్కసారి దుఃఖం కట్టలుతెంచుకుంది.

ఆమెదగ్గరగా కుర్చీలాక్కుని కూర్చున్నాడు. అతడి సమీపంలో ఆమె దుఃఖం వెల్లువలై ప్రవహిస్తోంది. అతడు గంభీరంగా కూర్చుని ఆమెకు వ్యవధియిస్తున్నాడు. అతడినించి ప్రసరిస్తున్న అజ్ఞాతశక్తి కిరణాలు ఆమెను తాకి ప్రశాంతపరుస్తున్నాయి. కొంతసేపటికి ఆమె తేరుకుని అశ్రుభరిత నేత్రాలను అతనివైపు మళ్ళించింది. ''మీరు ఎక్కడో ఉన్నత శిఖరాలమీద నిర్మలము, పవిత్రము అయిన మందిరం నిర్మించుకుని జీవితాన్ని గడుపుతున్నారు. నాలాటిదానికోసం మీరు మహాస్థానాన్ని ఒదిలి ఈ మలినమైన పాపపంకిలంలోకి దిగిరావటం అవివేకంకాదా ?"

"నన్నొక గొప్పవ్యక్తిగా ఎందుకనుకుంటున్నావు ? నేను నీలాటి మామూలు మనిషిని. అందుకే వస్తున్నాను. ఎక్కడో ఉన్నతస్థాయినించి దిగిరావటం లేదు. మామూలుగానే వస్తున్నాను...మరి నీ కిష్టమేనా ?"

చెంపలకు చేతులాన్చి దీర్ఘాలోచనలో మునిగిపోయింది. తను మళ్ళీ పొరపాటు చేయటంలేదుకదా ? తను రెండవసారి మోసపోసీ ఫరవాలేదు. న్యాయాన్యాయాలను తూచే సమయం కాదిది. మహా జరిగితే ఏం జరుగుతుంది. తనను పరిత్యజిస్తాడు. అంతేకదా ! ఆమె నిశ్చయించుకున్నది. దృఢంగా అంది ''నా కిష్టమే. కానీ ఒక షరతు" అతని ముఖంలోకి చూడలేక తల వంచుకుంది. ''నువ్వు... నువ్వు షరతు పెడ్తున్నావా అని ఆలోచిస్తున్నారా ? అదేమంత గొప్పది కాదు. ఉద్యోగం మానమన్న ఆంక్ష విధించకండి" ప్రాధేయపడ్తున్న దానిలా అడిగింది.

రెండురోజులు పోయాక వారిద్దరికీ వివాహమైంది. ఆనందరావు ప్రాణ స్నేహితుడు - తన లాయరు అయిన గోపీనాథ్ సమక్షంలో పెళ్ళిజేసుకున్నారు. హటాత్తుగా పెళ్ళయిందని చెప్పేసరికి ఆఫీసులో అంతా పార్టీ అని గోలజేశారు. ఎలాగో తప్పించుకున్నది. భర్త పేరు-ఊరు-ఉద్యోగం-ఇత్యాది వివరాలు కనుక్కుని ''అదృష్టవంతురాలని" అన్నారు స్నేహితులు.

రెండురోజులు తీరికగా ఇల్లుమార్చి ఆనందరావు గృహానికి వెళ్ళింది. ఆమెను సాదరంగా ఆహ్వానించి తనగదిలోకి తీసుకువెళ్తుంటే మాలతి భయంతో బిగుసుకుపోయింది కానీ గదిచూడగానే హాయిగా ఊపిరించింది. సింగిల్ మంచం, ఒకటే ఒక చెయిర్, డ్రెస్సింగ్ టేబుల్ మాత్రం ఉన్నాయి. ఆమె కృతజ్ఞతతో భర్తవైపుచూచి లోపలికెళ్ళి కొద్దిగా సామాను సర్ది బైటికొచ్చింది.

ఆ రాత్రి మాలతికి చదరంగం ఆటను నేర్పించాడు. ఇద్దరూ కలసి



న్యూస్ విన్నారు. ఆ తరువాత ఓ అరగంట పిచ్చాపాటీ మాట్లాడుకున్నారు. రోజూ ఇలాగే కాలవ్యయంచేసి ఎవరి గదుల్లోకి వారు వెళ్ళిపోయేవారు. మాలతి వంటచేసేది. ఇద్దరూ కూర్చుని తినేవారు. రాత్రుళ్ళు డ్రాయింగ్‌రూం సోఫాలో కూర్చుని తొమ్మిది పదిగంటలవరకు పుస్తకాలు తిరగేసేవారు వేడివేడి బోర్న్ వీటా అందించి వెళ్ళిపోయేది ఆమెను ఆకర్షించాలని తన కోర్కె వెల్లడి జేయాలని అతడు తాపత్రయపడలేదు. కాలమే ఆమెను మార్చగలదు.

మొదటిరోజు గడియ వేసుకుంటే నవ్వుకున్నాడు. నాల్గురోజులు పోయాక తలుపు జారవేసింది. అంతే. గడియవేసిన శబ్దం అతడికి వినబడనందున దారికొస్తోంది అనుకున్నాడు. వారంరోజులు పోయాక ఆమె తలుపు దగ్గరగా వేయకుండానే నిశ్చింతగా నిద్రపోతోంది. చొరవగా ఎన్నడైనా ఆప్యాయంగా దగ్గరకు తీసుకున్నా ఆమె బిగుసుకుపోయినట్లన్పించేది. అది గ్రహించి ఆనందరావు మెల్లగా ఆమెను విడిచిపెట్టి వెళ్ళిపోయేవాడు. ఆమె వారించకపోయినా హృదయాంతరంలో ఆమె భయపడ్తోందని గ్రహించి జాలిదలచి దూరంగా ఉండేవాడు.

రెండు నెలలు గడిచిపోయాయి మాలతి ఒక నిశ్చయానికొచ్చింది. ఆ రాత్రి తన భర్తతో చెప్పాలి. పని మానివేయటానికి సిద్ధంగా ఉన్నానని–భోజ

నాలైనై. ఇద్దరూ ముందుగదిలో కూర్చున్నారు. మాలతి వక్కపొడి అందిచ్చింది అతడు వక్కపొడి వేసుకుని చేరబడి కూర్చుని అన్నాడు:

"నాకు శ్రీశైలం ట్రాన్స్‌ఫర్ అయింది. పదిహేను రోజుల్లో జాయి నవ్వాలి. మరి నీవేంచేస్తావో నీ యిష్టం" ఆతడామెను చూడటంలేదు.

మాలతి నవ్వుకుంది. "మీ ఇష్టం. చెప్పండి."

"నా ఇష్టప్రకారం చేస్తావా ? ఆజ్ఞ అనుకుని గుడ్డిగా నా వెంబడిరావు కదా !" వ్యంగ్యంగా అన్నాడు.

ఆమె వచ్చి పక్కలో కూర్చుంది. "ఈ రెండు నెలలుగా ఆలోచిం చాను. రిజైన్ చేయాలనుకుంటున్నాను. మీరేమంటారు?"

"నిజమేనా ?" అన్నట్లు ఆమె కళ్ళలోకి తరచి తరచి చూస్తున్నాడు. మాలతి 'ఔను' - అన్నట్లు చూచింది. అతడి చేతినందుకుని గోముగా అంది.

"రిజైన్ చేస్తాను. మనం హాయిగా కలసి వెళ్ళిపోదాం సరేనా ?"

ఆమె భుజంమీద చేయివేశాడు. ఈ మాటు ఆమె బిగుసుకుపోలేదు. మెల్లగా దగ్గరకు జరిగింది. దగ్గరగా తీసుకున్నాడు. ఆమె మనఃపూర్వకంగా అతనికి చేరువ అయింది. ఆమె మరి తనగదిలోకి వెళ్ళలేదు.

ఆనందరావు ఒకనాడు పేపర్ చూపించాడు. అది ఒక ప్రకటన. 'అవి వాహితులైన స్త్రీలు - ఉద్యోగినులు - ఒంటరి స్త్రీలు జాగ్రత్త' - అన్న ప్రకటన కింద రాజేంద్రలాటి చీడపురుగు సంఘాన్ని తొలిచివేస్తున్నాడని, అతడివల్ల మోసపోకూడని ఉన్నది. అతడి పద్ధతి — ఎన్ని మార్గాలనుసరించేది కొన్ని ఉదాహరణలు కూడ ఇచ్చారు. వారంరోజులు వరుసగా పత్రికలలో పడింది. ఆనందరావే వేయించాడని మాలతికి తెలియదు.

ఆనందరావుకు కూతురు పుట్టిందని కొలీగ్స్ అంతా వచ్చి అభినందించి వెళ్ళారు. ప్రథమంగా మాలతిని - పొత్తిళ్ళలో పాపను చూడగానే అతడి మనసు ఆనందంతో పరిపూర్తి చెందింది. తన ఇంట్లో ఒక పాప ! పాప బుగ్గమీద చూపుడు వ్రేలితో అనురాగంతో రాశాడు. గులాబిరేకుల మృదుత్వానికి పర వశించిపోయాడు. చిక్కని నల్లని జుత్తును చేతితో రాశాడు గబుక్కున భార్యను చూచి "పాప ఆరోగ్యంగా ఉందికదా ? కళ్ళుతెరచిందా ?"

మాలతి అనిర్వచనీయమైన ఆనందంతో ఉక్కిరి బిక్కిరైంది. "తన స్వంత పాపలా - అనుభూతి - వారిదెంత విశాలహృదయం !" అనుకుంటున్న దల్లా భర్త ప్రశ్నకు చిరుకోపం నటిస్తూ అంది, "అంతేలెండి - నా ఆరోగ్యం

ఎటుబోయినా పరవాలేదు పాప ఆరోగ్యంకోసం ఆరాటం'' అని నవ్వేసి అంది. "పాప ఆరోగ్యంగా ఉందట. కళ్ళుతెరవలేదు. బహుశా తెరచి - ముందర మిమ్మల్నే చూస్తుంది కాబోలు." ఆమె అంటూనే ఉంది, పాప మెల్లమెల్లగా కళ్ళు తెరుస్తోంది.

"మాలతీ - తెరిచింది... ఈ పచ్చని ప్రపంచాన్ని చూడాలని...''

''కాదు - కాదు - అమృతహృదయులు - ప్రేమమయులైన మిమ్మల్ని చూడాలని'' అంది.

అంతలోకి నర్స్ రావటంతో వారికి మాటలు కరువయ్యాయి. పాప కోసం ఏమేమి సిద్ధంచేయాలో కనుక్కొని వెళ్ళిపోయాడు. పాపకు స్వర్ణలత అని పేరుపెట్టాడు. మాలతి అడ్డుచెప్పలేదు

మూడేళ్ళు కాలగతిలో లీనమయ్యాయి. లత చక్కగా మాట్లాడుతుంది. తండ్రిరాగానే తొడమీద కూర్చుని కబుర్లు చెబుతుంది. కథలు చెప్పించుకుంటుంది. ముగ్గురూ కలసి భోంచేస్తారు. నిద్రపట్టేవరకు తండ్రి పక్కలోనే ఉంటుంది.

పాపలో ఎక్కువ మాలతి పోలికలే. అందుకే రాజేంద్ర ఆమెకు జ్ఞాపకం వచ్చేవాడు కాడు _ ఆనందరావుకు ఓ విధమైన సంతృప్తి కల్గింది.

* * *

దాదాపు నాలుగేళ్ళ తరువాత రాజేంద్రను చూస్తోంది మాలతి. అతణ్ణి చూడగానే జుగుప్సతో హృదయం నిండిపోయింది. చూచి మాట్లాడితేనే పాపం చుట్టుకుంటుందేమోనన్నంత అసహ్యం వేసింది. అతడితో మాట్లాడనని వ్యతిరేకిస్తోంది మనసు. కానీ తప్పదు. ఈ దృష్టుడి బారినించి తప్పించుకోవాలి అతి సాధారణ వస్తులతో వచ్చాడు. చేతిలో కాన్వాసుసంచి.

వరండాలోనే నుంచోబెట్టింది. లోపలికి తీసుకువెళ్తే ఆ పవిత్రగృహం మలినమైపోతుందేమోనని భయపడింది.

"లోపలికెళ్దామా ?" లోనకెళ్ళబోతూ అడిగాడు.

''అక్కర్లేదు. నిన్ను ఇక్కడినించే మెడబట్టి గెంటటం సులభం'' ఒక్క మాటుగా నోట్లోనించి ఊసింది

అతడు వికటంగా నవ్వాడు.

''నువ్వంత చౌకబారుగా నవ్వకు. ఇది నీలాంటివారుండే గృహంకాదు."

"సరేలే. నీతో వాదనెందుకు నా ఉత్తరం అందిందా ?''

"ఊఁ."

"నా వ్యాపారం పడిపోయింది. అందుకే డబ్బుకోసం వచ్చాను. సిద్ధంగా ఉంచావా? ఇచ్చేస్తే వెళ్ళిపోతాను."

"డబ్బులేదు. ఇవ్వను" ఖచ్చితంగా అంది.

అతడి కళ్ళు చింతనిప్పుల్లా అయినై. పెదిమలు వికృతంగా ఒంపు తిరిగాయి. "పర్యవసానం ఎలా ఉంటుందో తెలిసే మాట్లాడుతున్నావా?"

"ఔను."

"నీకెంత ధైర్యం! నీ సంసారంలో నిప్పులుపోసి వెళ్తాను. నీ భర్తకు నీ పూర్వచరిత్ర విశదీకరించి నీ వెటువంటిదానవో చెప్పివెళ్తాను. నువ్వు పతితవని - వివాహం కాకుండానే తల్లివైనావని చెప్పివెళ్తాను. మహా పతివ్రతలా ఈ ఇంట్లో తిరుగుతూ నీ భర్తను కొంగున ముడివేసుకున్న జాణవు...గప్‌చిప్‌గా నాల్గువేలు ఇచ్చేసెయ్. వెళ్ళిపోతాను. లేదా..."

"ఆగాగు .." అంటూ ఆనందరావు లోపలినించి వచ్చాడు. అతడు రావటంతో రాజేంద్ర చెదరిపోయి మౌనం దాల్చాడు. ఏదో చెప్పి మాట తప్పిస్తుందేమోనని మాలతి వైపు చూచాడు. మాలతి చిరునవ్వు నవ్వి భర్తతో అంది, "ఈ పురుగును త్వరగా పంపించివేయండి. నేను వెళ్తున్నాను" అంటూ లోపలికెళ్ళిపోయింది.

"ఐతే నువ్వన్నమాట ఆ పురుగువు! ఇదిగో నువ్వు రాసిన ఉత్తరం. నాల్గువేలు కావాలా? నాల్గు పైసలు ఇవ్వను. అందరు నీలాంటి స్వార్థపరులు, దృష్టులు కారు. అంతా తెలుసుకునే పెళ్ళాడాను. ఆమె నన్ను మోసం చెయ్యలేదు. నీ ఉత్తరం అందగానే చింపకుండా నాకిచ్చింది. నీవు ఏ నెపంతో బ్లాక్‌మెయిల్ చేస్తావు? మర్యాదగా వెళ్ళిపో, లేకపోతే పోలీసుల్ని పిలిపిస్తాను... తిరిగి వెళ్ళటానికి డబ్బుందా?" రాజేంద్ర కొరకొరా చూచాడు. గంపెడాశతో వచ్చాడు. కనీసం రెండు వేలైనా దొరికేలా చూడాలనుకుని వచ్చాడు. విధి వక్రించింది. తను బికారిగానే వెళ్ళిపోవాలి. ఇంత అవమానం ఏనాడూ పొందలేదు.

"ఎందుకలా కొరకొర చూస్తావు? నాల్గువేలు అడుక్కుతింటే గొప్పగా ఉంటుంది ఐదు - పది అడుక్కుతింటే నీచంగా ఉంటుందనేనా? నీ ఇష్టం. ఈ పది రూపాయలు ఇక్కడ పెట్టివెళ్తున్నాను. ఇష్టముంటే తీసుకో. కష్ట




ఈ పుస్తకాల్లో విషయాలు
అర్థమైనట్లు - ఆ పుస్తకాల్లో అర్థమై
చావటం లేదురా!!

---

మైతే మానుకో." మరి ఆలసించకుండా ఆనందరావు లోపలికొచ్చి రాజేంద్ర ముఖంమీద దబ్బున తలుపేసి హాయిగా నవ్వాడు.

ఆ నవ్వు రాజేంద్ర హృదయాన్ని శూలంలా పొడిచింది.

గేటు వేసిన చప్పుడు విని ఆనందరావు బైటికొచ్చాడు. "చావలేనివాడై పోయాడు పిరికిపంద - డబ్బు తీసుకెళ్ళాడు మాలతీ" అన్నాడు. అప్పుడే పాప కూడా బైటికొచ్చింది

ముద్దుముద్దుగా "ఎవరు నాన్నా" అని అడిగింది.

"చీడపురుగు లతా" అన్నాడు.

"చీడపురుగు అంటే?" అంది అమాయకంగా.

"చూపిస్తానురా" అని చేయిపట్టుకుని తోటలో నడుస్తూ పూలచెట్లలో ఉన్న పురుగుల్ని చూపుతూ పాఠం చెప్పాడు.

ఆ రాత్రి మాలతి ఎంతో ఉత్సాహంగా ఉంది. హృదయం పూవులా తేలికగా ఉంది. 'నేను గెలిచాను - నేను గెలిచాను' అన్న అహంకారంతో గంతులు వేయాలన్నంత హుషారు పుట్టింది. విజయగర్వంతో నిశ్చింతగ నిద్రపోయింది.

* * *

మాలతి, ఆనందరావు పాపను క్రమశిక్షణలో వుంచుతూ విద్యాబుద్ధులు గరిపారు. ఆంధ్రదేశమంతా ట్రాన్స్‌ఫర్ అవుతూ తిరుగుతూ పాపకు చదువు చెప్పించారు. ఆఖరి రెండు సంవత్సరాలు ఎం ఏ. చదివినప్పుడు ఆనందరావు రిటైర్ అయి ఉండడంచేత విశాఖపట్నంలోనే స్థిరపడ్డారు.

విద్యావంతులైన తలిదండ్రుల మధ్య పెరిగింది. వయసుకు మించిన తెలివితేటలతో, లోకజ్ఞానంతో అందరి మధ్య అణకువతో మసలుతూ మన్నన లందింది. లతలో ఒకే ఒక లోటు. తండ్రిని చూస్తే చిన్నపిల్లే అయిపోతుంది. ఈ విషయంలో మాలతి కూతుర్ని మందలించేది. కూతురు ఎం.ఏ. చదువు తోంది. తెలివిగలది. ఈ ఆనందానికన్నా తన దగ్గర మారాంచేసి అల్లరిచేసి తన చిటికెనవ్రేలిచుట్టూ తనను తిప్పుకున్నప్పటి ఆనందమే ఆనందంగా తలంచి మురిసిపోయేవాడు. ఇక పెళ్ళిచేయాలి అన్న ఆలోచన రాగానే హృదయం విచారంతో ముకుళించుకుపోయేది. తప్పదు. ఏ వయసు కాముచ్చట తీరాలి. కనకై తానే సంబంధాలు చూస్తానన్నప్పుడు మాలతి సంతోషంతో కృతజ్ఞతతో నిండిపోయింది. తను తండ్రికూతుళ్ళ మధ్య ఎప్పుడూ రాలేదు. ఎప్పుడైనా జోక్యం కల్పించుకున్నదంటే అది కూతురి మంకుతనాన్ని చూచి కోప్పడి నప్పుడే.

ఫారిన్‌లో పి.హెచ్‌డి. చేసివచ్చిన తన స్నేహితుడి కొడుక్కి ఇవ్వ టానికి ఏర్పాట్లు జరిగాయి. కాల్‌టెక్స్‌లో ఇంజనీరుగా ఉంటున్నాడు. ఒకరోజు అబ్బాయి తలిదండ్రులు వచ్చి చూచుకుని వెళ్ళారు. ఆ మరుసటి రోజు పాప లేనప్పుడు మరొకమారొచ్చి అన్నీ మాట్లాడుకుని వెళ్ళారు. రవి అధునాతన భావాలుగలవాడు.

లత పరీక్ష వ్రాసివచ్చిన కొన్ని రోజులకే పెళ్ళి నిరాడంబరంగా జరిగింది. ఆ కొత్త ఊళ్ళో ఆనందరావుకి తెలిసినవా ళ్ళెక్కువమంది లేరు. అంతా లత కాలేజీవారు. వరుడి పార్టీవారు. అనవరమైన ఆర్భాటాంకు చెయ్య కుండా తిండి విషయంలో మాత్రం అందర్నీ తృప్తిపర్చారు. వధూవరుల నాశీర్వదించి - ఆనందించి వెళ్ళిపోయారు అతిథులు.

కూతుర్ని అత్తగారింటికి పంపి ఇద్దరు మిలిగిపోయారు. ఆనందరావు ఈ వియోగం భరించలేక కాలుకాలిన పిల్లిలా తిరుగుతుంటే మాలతి హృదయం బాధతో మూల్గేది. రెండుమూడు రోజుల కొకసారి వచ్చి తలిదండ్రులను చూచి వెళ్ళేది. రానురాను వారం పదిరోజుల కొకసారి చూచి వెళ్ళేది. ఆమెలేని 'ఖాళీ' ఇంటికి వారిద్దరు మెల్లమెల్లగా అలవాటవుతున్నారు. ఇంకానయం- కూతురు అదే ఊళ్ళో ఉంది కళ్ళముందే ఉంది. ఫరవాలేదని ధైర్యం చెప్పు కున్నారు.

రెండు సంవత్సరాలు గడిచిపోయాయి. పాలకంటే పాలమీద మీగడ,

అసలుకంటే వడ్డీ మీద ఎక్కువ ఇష్టం అన్నట్లు వారిద్దరికీ, ముఖ్యంగా ఆనంద రావుకు మనమరాలిపైన అత్యంత అపేక్ష. ప్రాణమంతా పాపమీదే పెట్టుకుని జీవిస్తున్నాడు.

అరవై సంవత్సరాల వయసు ఆనందరావు హెర్నియా ఆపరేషన్ అయి వచ్చిననాటినించి ఆరోగ్యం సరిగాలేదు. ఆపరేషన్ సక్సస్‌ఫుల్ అయినా ఆతడి ఆరోగ్యం రానురాను సన్నగిలుతోంది.

నాల్గురోజులుగా కాస్త లేచి తిరగ్గల్గుతున్నాడు. ఆ వేళ అంతసేపు వరండాలో కూర్చుని సాయంత్రం కాగానే పడుకున్నాడు.

పాప తప్పటడుగులు వేస్తూ "తాత-" అంటుంటే కళ్ళు తెరచి చూచాడు. మాలతి పాపను పక్కలో కూచోబెట్టి తను కుర్చీ దగ్గరకు లాక్కుని కూర్చుంది. పాపతో కాసేపు ముచ్చట్లాడి భార్యవైపు చూచాడు. ఆమె ముఖం గంభీరంగా ఉంది. "అతగాడొచ్చాడు" అంది ముక్తసరిగా.

"ఓ... ఎవరు చెప్పారు ?"

"లత ఫోన్ చేసింది. తీసుకురమ్మన్నాను రవి ఇంకా ఆఫీసునించి రాలేదు. ఇంకొక గంటకు గాని రాడట. రవి లేని సమయంలో చూచి వచ్చాడు."

"మంచిదే. ఫరవాలేదు" అన్నాడు. వారు మరి ఆ విషయం మాట్లాడ లేదు. పాపతో మాట్లాడటానికే సరిపోయింది.

పదిహేను నిమిషాలకు కారాగిన చప్పుడు విని మాలతి లేచింది.

"వెళ్ళొద్దు." అన్నాడు ఆనందరావు.

లత దూసుకుని వచ్చింది. "నాన్నా, ఎలాఉంది ?" అని దగ్గరగా వచ్చి రెండు చేతులతో తండ్రి చెంపలు, నుదురు రాసింది.

గబుక్కున తల్లివైపు తిరిగి "అమ్మా, అటు రా" అంది.

"ఒద్దులే. ఇక్కడే చెప్పు. అతడేమన్నాడేమిటి ? నాన్నగారిక్ తెలుసు "

"ఏమన్నాడూ ! ఆ స్కౌండ్రల్" క్షమించమన్నట్టు తండ్రిని చూచి- మరీ అంది.

"అతడు నా తండ్రి అట, నిజమేనా ?" అసహ్యం గూడుకట్టింది.

మాలతి హాయిగా నవ్వింది. నవ్వుతూ నవ్వుతుండగనే కళ్ళతో నీళ్ళు తిరిగినై. చెక్కిళ్ళమీదుగ కారిపోతోన్న కన్నీటిని తుడుచుకోటానికి ప్రయత్నించ లేదు. "నాకు తెలీదే లతా. తండ్రి అన్న పదానికి నిర్వచనం నువ్వే ఆలోచిం

చుకో. లేదా రవిని అడుగు. నేను తల్లిని.. ఆగు...... ముందర ఇది చదువు" అంటూ భర్త మంచంకాళ్ళవైపు పరుపు ఎత్తి ఒక కవరు అందించింది. "ఆ గదిలో కెళ్ళి చదువు."

పాతబడిన గుర్తుగా కాగితం పసుపువన్నె దాల్చింది. మాలతి గబగబ ముందుకొచ్చి ఉత్తరాన్నందుకొని పక్కగదిలో కెళ్ళింది. ఇంతకూ అతడేడీ ? అనుకుంటూ బైటికొచ్చింది. అతడు కార్‌లో దొంగలా కూర్చుని ఉన్నాడు. కాపలాగా వాళ్ళ అల్సేషన్ కుక్క కూర్చుని గుర్ మంటోంది. మాలతికి ఆ గంభీర వాతావరణంలో కూడ నవ్వు వచ్చింది.

అతడు తనను చూడకముందే లోపలికొచ్చేసింది.

లత కాసేపటికి తల్లిదగ్గరకొచ్చింది. ఆమె ముఖం తెల్లగా పాలిపోయి ఉంది. కంపిస్తున్న చేతుల్లో ఉత్తరం రెపరెపలాడుతోంది. హృదయం అవ్యక్తమైన బరువుతో నిండి బ్రద్దలయ్యేలా ఉంది. "ఐతే నిజమేనన్నమాట-అమ్మా" అంది. ఆ మాటలు గొంతులోంచి రావటానికి అవ్యక్తమైన బాధననుభవించింది. రెండు చేతుల్లో ముఖాన్ని కప్పుకుని సోఫాలో కూలబడిపోయింది. మాలతి చూస్తోంది. ఈ ఉత్తరంలోని సారాంశం ఆమె హృదయంలో ఇంకి ఎటువంటి పర్యవసానానికి దారితీస్తుందో ! చూడాలి. తను ఊహించని పరిణామానికి దారితీస్తే తాను భరించగలదా ? ముఖ్యంగా తన భర్త భరించగలడా !

లత పదినిమిషాలు అదో లోకంలో విహరించి చటుక్కున ప్రస్తుతంలోకి వచ్చింది. లోపలికెళ్ళి గ్లాసుడు మంచినీళ్ళు తాగి గబగబ బైటికెళ్తూ అంది, "ఆయనను లోపలికి తెస్తానమ్మా. నీ కిష్టం లేకపోతే వెళ్ళిపో". మాలతి పక్కగదిలోకి వెళ్ళి భర్తదగ్గర కూచుంది. మెల్లగా పనికుర్రాడికి పాపనప్పగించి పంపించివేసింది. డ్రాయింగ్ రూంలోకి మాటలు స్పష్టంగా విన్పిస్తాయి. ఆ గదికి ఈ గదికి మధ్య స్క్రీన్ మాత్రమే ఉంది.

కుక్కను పిల్చింది. "కమాన్ డైమండ్ - కమాన్" అనగానే అది మొరుగుతూ దగ్గరకువచ్చింది.

"ఇకరావచ్చు" అనగానే రాజేంద్ర హమ్మయ్య అనుకుని దిగివచ్చాడు. లోపలికి తీసుకునివెళ్ళి కుర్చీ చూపింది

"ఎందుకొచ్చినట్లు ?"

"డబ్బుకోసం"

"ఎంత ?"

"ఐదువేలకు పైన "



"ఇవ్వకపోతే ?"

"నీ భర్త రవికుమార్‌కు రహస్యం చెప్పేస్తాను "

"ఏమిటా రహస్యం" వెటకారంగా అంది.

"నేను నీ తండ్రినని."

"ఋజువు."

"ఋజువు కావాలా ? నీ తల్లిని సూటిగ ప్రశ్నిస్తే తేలిపోతుంది. లేదా ఆమె భర్త దగ్గరకెళ్ళి అడుగు. నిజం దాచగల శక్తి ఎవరికీ లేదు. 'నేను నీ బిడ్డను కానా ? అని అడుగు' చాలు."

"ఐతే నువ్వు నా తండ్రి వన్నమాట." ఆమె విరగబడి నవ్వింది. ఆ తర్వాత చండికాస్వరూపమే అయింది. క్రోధంతో ముక్కుపుటాలు అదరుతుంటే అతడి దగ్గరగా వచ్చింది. "నువ్వు... ఒక మోసగాడివి నా తండ్రివా ? నేను పొత్తిళ్ళలో పడుకుని కళ్ళు తెరచినప్పు డెక్కడున్నావు ? నేను తప్పటడుగులు వేస్తూ దబ్బున క్రిందపడ్తే ఎత్తుకుని ఎన్నడు లాలించి నా నొప్పికి మంత్రం వేశావు ? రాత్రుళ్ళు ఆరుబైట పడుకుని ఆకాశంలోకి చూస్తూ ఆ నక్షత్రాలమాలకట్టి నా మెడలో వేసినట్లే కథలు - కబుర్లు చెప్పి ఏ నాడు నిద్రపుచ్చావు ? నా చిన్నకుక్కపిల్ల చనిపోయి నేను ఏడుస్తుంటే ఎప్పుడు ఓదార్చావు ? పుట్టుక చావుల మర్మాన్ని నా చిన్నబుద్ధి కర్థమయ్యేలా ఏ రోజు బోధపర్చావు ? నా చేయి పట్టుకుని ఆప్యాయంగా ఎప్పుడు 'అఆ'లు దిద్దించి

నా విద్యకు పునాది వేశావు ? ట్రాన్స్‌ఫర్ అయి వెళ్తుంటే స్నేహితులను విడువ లేక దుఃఖిస్తుంటే జీవితంలో కలయికలోని ఆనందం - విడిపోవటంలోని బాధ— ఆ మధురస్మృతులు హృదయాన్ని విశాలపరుస్తాయని వ్యక్తిత్వానికవి మెరుగు పెడ్తాయని ఎప్పుడు చెప్పావు. టైఫాయిడ్ వచ్చి పడుకుంటే నిద్రకాచి నా మంచం దగ్గరే పడకవేసుకుని నా చెయ్యి పట్టుకుని - నా నుదురుతాకుతూ నన్ను కంటికి రెప్పలా ఎప్పుడు చూచావు ? జ్వరం తిరగబెడితే తగ్గేవరకు సెలవుపెట్టి నా మంచం దగ్గర ఎప్పుడున్నావు ? పథ్యం తింటున్న రోజున ఆప్యాయంగా బుజ్జగించి చప్పిడి మెతుకుల్లో మమతనంతా కూర్చి ఏనాడు తినిపించావు ? మఖమల్ భరిణెలో పెట్టిన వజ్రంలా నన్ను పెంచిన వారు నా తండ్రా - లేక నువ్వా - ఎవరు నువ్వు ! నా జన్మ కారకుడవని చెప్పకోటానికి సిగ్గు లేదూ ? ఈ రహస్యాన్ని బైటబెట్టి నన్ను నా భర్తనించి దూరం చేయటానికి కూడ సంకల్పించి వెనుదీయని వాడైన నువ్వు ఒక తండ్రివేనా ? తండ్రి అట... తండిరి... ఛీ ఛీ... బజారులో ఆం...బో......''

రవి చటుక్కున లోపలికొస్తూ "లతా ... ఆగు ... ఆ మాటలని చవకైపోకు...ఏమయ్యా...రహస్యం బైటబెడ్తావా ? ఇక్కడ ఏ రహస్యాలు లేవు నాకన్నీ తెలుసు. నీలాంటివాడొక స్పెసిమన్. ఎప్పుడు చూస్తానా అనుకున్నాను. దొరికావు. అసలు నీ కెంత ధైర్యం? సిగ్గువిడిచి వచ్చావు. వెళ్ళిపోతానంటావా సరే — లేదా డైమండ్ ఉంది."

రాజేంద్ర చటుక్కున లేచి చేతిరుమాలుతో ముఖం తుడుచుకుంటూ బైటికెళ్తుంటే రవి బిగ్గరగా నవ్వాడు.

"ఎలా వచ్చాడు ?"

"కదల్లేదు. డైమండ్ ఉందిగా బెదిరిస్తే వచ్చాడు."

"భయపడ్డావా?" భార్యను దగ్గరకు తీసుకుంటూ అడిగాడు.

"మీకు తెలుసా?" ఆశ్చర్యంతో అడిగింది.

"ఆ. పెళ్ళికి ముందరే మామయ్య చెప్పారు.

"ఓ" అని విప్పారిన కళ్ళతో భర్తవంక చూచింది.

మరేమనుకున్నదో పరుగున తెరతొలగించుకుని ఆనందరావు హృదయం మీద వాలిపోయింది.

"నాన్న...నాన్న" అంటూ తండ్రి భుజాలు తడుముతోంది.

"ఏం లతా?"

"ఇంతకుముందు నువ్వంటే కేవలం ప్రేమే ఉండేది."

"మరి ఇప్పుడు?"

"ఆరాధన కూడా - ఐ లవ్ యు సో మచ్ - మా నాన్న ఎంత మంచివారో" కూతురి వీపును తడ్తుంటే ఆయన కళ్ళు చెమ్మగిల్లాయి.

గాద్గదికంగా అన్నాడు "ఈ రోజుకోసం ఎదురుచూస్తూనే భయపడ్డాను.

"ఎందుకని?"

"అతగాడు నీ తండ్రి అని తెలియగానే నీ మనసు మళ్ళుతుందనుకున్నాను"

లత చటుక్కున లేచి తండ్రికళ్ళలోకి చూస్తుంటే కన్నీళ్ళు నిండాయి. "అలా అని ఎలా అనుకుంటావు నాన్నా. నేను నీ లతను కదా" అని మళ్ళీ తండ్రి ఎదమీద తల ఆన్చింది.

"ఔనమ్మా, నువ్వు నా లత పాపవే...ఇది చాలమ్మా. నేను గెలిచాను... గెలుపు నాదే...నా కెంత సంతోషంగా ఉంది!"

ఆ దృశ్యాన్ని చూస్తున్న మాలతి-రవిల హృదయాలు ఆర్ద్రాలయ్యాయి. ఒకరి నొకరు చూచుకున్నారు.

మాలతి అంది, "నేనుగెలిచాను - గెలుపు నాదేనండీ"

"ఉహు, నేనే గెలిచావమ్మా" అంది లత తల లేపకుండానే.

"ఉహు! నాగెలుపుతో సాటి ఎవరిదీలేదు," అంటూ మాలతి చేతిని తన చేతి ల్లోకి తీసుకున్నాడు. ముఖం నిండా ఆనందపు వెలుగే. చిరునవ్వు నవ్వుతూ కళ్ళు మూసుకున్నాడు.

గదిలో అంతా నిశ్శబ్దం. కొన్ని క్షణాలకు లత చటుక్కున తలెత్తి అంది "రవీ ...నాన్నగుండె ... నాన్నగుండె ... ఆగిపోయింది"

మాలతి గాభరాగా "ఏమండీ" అని అరుస్తూ ఏడుస్తోంటే రవి గబగబావచ్చి గుండె పరీక్ష చేశాడు. ముక్కుపుటాల దగ్గర అద్దం ఉంచాడు. అద్దం మీద ఊపిరున్న చిహ్నంగా మసకగా లేదు. అద్దం స్వచ్ఛంగా ఉంది!

"ఆ హృదయం ఈ ఆనందానికి తట్టుకోలేకపోయింది" అన్నాడు రవి బిగ్గరగా.

వారి దుఃఖం కట్టలు త్రెంచుకుంది.

హృదయం పగిలిపోతుంటే వెక్కిళ్ళ మధ్య అంది "అతడొచ్చి నాన్నను మనకు దూరంచేశాడు. అతడిదే గెలుపు. మనం ఓడిపోయాం."

---

# కరుణించిన కానిస్టేబులు



## గుత్తుల భాస్కరరావు

మా ఊళ్ళో పోలీసులు డబుల్ రైడింగ్ కేసునంతగా పట్టించుకోరు. ఎక్కిన వాడూ తొక్కేవాడూ సకాలంలో దిగిపోతే క్షమించి వదిలేస్తారు. నిర్లక్ష్యంగా తొక్కుకుపోయేవాళ్ళని మాత్రం నిలేసి మర్డర్ కేసు బనాయించినంత పని చేస్తారు.

కానిస్టేబుల్ రెండువందల నలభై కి, ఆ రోజు అటువంటి కేసే తగిలింది. పక్కనుంచి యిద్దరు యువకులు సైకిల్ మీద రయ్‌మని దూసుకుపోతున్నారు. విజిల్ కొట్టి ఉక్కిరిబిక్కిరిచేసి వాళ్ళని ఆపేశాడు. ఎక్కినవాడు బార్ మీద అలానే కూర్చుంటే తొక్కేవాడు సైకిల్ పుచ్చుకొని జాలిగా నిలబడ్డాడు. 'క్షమించండి! పొరపాటయింది' అని బతిమాలాడు. కానిస్టేబులు ససేమిరా వినలేదు. 'పోలీసంటే అంత లోకువా. రండి స్టేషన్‌కి' అని హుంకరించేడు. ఇంత జరిగినా బార్ మీద కూర్చున్న వ్యక్తి దిగలేదని మండిపడి జబ్బపుచ్చుకొని దిగలాగాడు.

అంతే!

అతను కుప్పలా కింద కూలిపోయాడు. ఆ దృశ్యంచూసి జనం బిలబిల మంటూ గుమికూడారు. కానిస్టేబులు కంగారుపడిపోయి తొక్కే వ్యక్తివంక చూశాడు. అతను కళ్ళనీళ్లు పెట్టుకొని 'మామూలు మనిషనుకొని జబర్దస్తీచేశారు. కానీ యితని కాళ్ళు చిన్నతనంలోనే పడిపోయాయి. నడవలేడు. కనీసం నిలబడలేడు. ఇతనికి నేనూ, నా సైకిలే ఆధారం' అని వాపోయాడు.

కానిస్టేబులువంక జనం కోపంగాచూసి అతన్ని సాయంపట్టి సైకిల్ బార్ మీద కూర్చోబెట్టారు. కానిస్టేబిలు కూడా జాలిపడి తొక్కేవ్యక్తి భుజంతట్టి 'చూడ బ్బాయ్, డబుల్ రైడింగ్ నేరమేకాదు. ప్రమాదంకూడా. అత న్నెక్కించుకొని తొక్కవద్దు. సైకిల్ నడిపించుకెళ్ళు' అని హితవు చెప్పాడు.

జనం సర్దుకున్నారు. అతను సైకిలు నడిపించుకొని వెళ్తుంటే బాధగా చూస్తుండిపోయారు. రెండువందల నలభై బాగా దూరమయ్యాడు. ఉన్నట్టుండి బార్ మీద కూర్చున్నవాడు కిందికి ఉరికి బట్టలు దులుపుకొని నడిపించేవాణ్ణి ఎక్కించుకొని తుర్రుమన్నాడు.

---



# నలుగురు ఫకీర్లు

(గతసంచిక తరువాయి)

సూర్యాస్తమానమయింది (సూర్యాస్తమానంతో రోజుముగిసినట్టు వారి లెక్క). చీకటిపడగానే ఒక కొజ్జావచ్చి, నన్ను అంతఃపురానికి తీసుకుపోయాడు. లోపల అనేకమంది ప్రముఖులున్నారు. నేను కూడా వారితో చేరి కూర్చున్నాను. విందు భోజనానికి వడ్డన జరిగింది. అందరితోబాటు నేను కూడా భోజనం చేశాను.

భోజనాలు పూర్తికాగానే అంతఃపురం లోపలినుంచి ఒక దాసీవచ్చి, "భైరోస్ ఎక్కడః పిలవండి," అని కేకపెట్టింది. పరిచారకులు వెంటనే ఆతన్ని తెచ్చారు. అతను చూడటానికి గొప్ప మర్యాదస్తుడు లాగున్నాడు. అతని రొండిన చాలా బంగారు, వెండి తాళపుచెవులు వేళ్ళాడుతున్నాయి. అతను నాకు సలాముచేసి నా పక్కనే కూర్చున్నాడు.

దాసీ అతనితో, "భైరోస్, నువు చూసిన విషయాలు ఈ ఫకీరుకు చెప్పు," అన్నది. భైరోస్ నాకేసి తిరిగి ఇలా చెప్పనారంభించాడు:

"మిత్రమా, రాణీగారికి అనేక వేల మంది బానిసలున్నారు. వాళ్ళు వర్తక వ్యాపారం చేస్తుంటారు. వారిలోని చాలా అల్పులలో నేనొకణ్ణి. ఆమె వారికందరికీ సరుకులు పెద్ద మొత్తాలలో ఇచ్చి, వివిధ దేశాలకు పంపుతుంది. వాళ్ళు వ్యాపారం ముగించి తిరిగి వచ్చినాక,

ఎవరు ఏ యే దేశాలలో ఏ యే అనుభవాలు పొందినదీ చెప్పించుకుని వింటుంది.

''ఒకసారి నేను వర్తకంమీద నీమ్ రోజ్ నగరానికి వెళ్ళటం తటస్థించింది. పౌరులందరూ నల్లదుస్తులు ధరించి ఉండటమూ, నిట్టూర్పులు విడుస్తూ ఉండటమూ గమనించాను. వారికేదో ఘోరవిపత్తు వాటిల్లిందనిపించింది. దాని కంతకూ కారణం ఏమిటని ఎందరినో అడిగాను కాని ఒక్కడూ నా ప్రశ్నకు సమాధానం చెప్పలేదు. ఈ వింత పరిస్థితి చాలారోజులు కొనసాగింది.

"ఒకనాడు ఉదయం అవుతూనే నగరంలోని వాళ్ళందరూ — కొద్దీ, గొప్పా, చిన్నా, పెద్దా, ధనికులూ, దరిద్రులూ- నగరం విడిచివెళ్ళి ఒక మైదానంమీద కూడారు. నగరాన్ని ఏలేరాజు కూడా అక్కడికి వచ్చాడు. ఆయన గుర్రంమీద ఉన్నాడు. ప్రముఖులందరూ ఆయనను పరివేష్ఠించి ఉన్నారు. అందరూ ఒక బారుగా నిలబడ్డారు. వారంతా ఎవడి రాకకోసమో ఎదురుచూస్తున్నట్లు గ్రహించి, నేను కూడా ఆ బారులో నిలబడ్డాను.

"ఒక గంటసేపటికి ఒక అందమైన కుర్రాడు దూరంనుంచి జనంఉన్నచోటికి వచ్చాడు. చూడముచ్చటగా ఉన్నాడు. అతని వయసు సుమారు పదహారేళ్లుండవచ్చు. అతను భయంకరంగా అరుస్తూ నోటనురుగులు కక్కుతున్నాడు. అతను కపిలవర్ణంగల ఎద్దును ఎక్కిఉన్నాడు అతని చేతిలో ఏదో వింత వస్తువు ఉన్నది. అతను ఎద్దుమీదినుంచి దిగి, దాని పలుపుతాడునూ, ఒక ఖడ్గాన్నీ పట్టుకుని నేలమీద కూర్చున్నాడు.

"ఆ కుర్రవాడివెంట ఒక అందమైన పరిచారకుడున్నాడు. ఆ కుర్రవాడు తన పరిచారకుడికి తన చేతిలో ఉన్న వస్తువునిచ్చాడు. పరిచారకుడు దాన్ని బారులో నిలబడి ఉన్నవారందరికీ దాన్ని చూపాడు. అదేం చిత్రమోగాని ఆ వస్తువునుచూసి ప్రతి ఒక్కరూ బావురుమని ఏడ్చారు. ఇలా బారు ఈ చివరనుంచి ఆ చివరకు ఆ వస్తువును అందరికీచూపి ఆ పరిచారకుడు తన యజమానివద్దకు తిరిగి వెళ్ళాడు. వాడు దగ్గరికి రాగానే కుర్రవాడు ఆగ్రహావేశంతో లేచినిలబడి, ఒక్క వేటున ఆ పరిచారకుడి తల తెగనరికి, ఎద్దునెక్కి అమితవేగంగా తాను వచ్చినవేపే తిరిగి వెళ్ళాడు. అందరూ భయశోకాలతో స్తంభించి నిలబడిపోయారు. ఆ కుర్రవాడు కనపడకుండా పోయాక అందరూ నింపాదిగా, మౌనంగా నగరానికి తిరిగి వెళ్ళారు.

"నేను చూసిన ఈ ఆశ్చర్యకరమైన వింత దృశ్యానికి అర్థమేమిటని ఎంతమందినో అడిగాను. డబ్బు కూడా ఆశపెట్టాను, బతిమాలాను, పొగిడాను. ఆ కుర్రవాడెవరు? వాడు అంత క్రూర

కర్మ ఎందుకు చేశాడు ? ఎక్కడినుంచి వచ్చాడు ? ఎక్కడికి వెళ్ళాడు ? ఇదంతా నాకు అర్థంకాలేదు, సరికదా, దాని అర్థం నాకు ఒక్కరూ చెప్పలేదు. నేను తిరిగి వచ్చాక నేనుచూసిన వింతను రాజకుమార్తెకు చెప్పాను. అటి మొదలు రాజకుమార్తెకు ఆ సంఘటనల అంత రార్థం తెలుసుకోవాలని ఆరాటంగా ఉన్నది. అందుచేత ఆ రహస్యాలు తెలుసుకువచ్చినవాడినే పెళ్ళాడతానని ఆమె నియమం పెట్టింది. అది తెలుసుకు వచ్చినవాడు ఆమె సంపదకూ, దేశానికీ, ఆమెకు అధిపతి అవుతాడు.

"సంగతంతా విన్నావు. సీమ్‌రోజ్ దేశానికి వెళ్ళి ఆ కుర్రవాడి రహస్యం తెలుసుకురాగలవేమో ఆలోచించు. వెళ్ళ గలిగితే వెంటనే బయలుదేరు. లేక ఈ ఆలోచన కట్టిపెట్టి, మీ దేశానికి తిరిగి వెళ్ళు."

భైరోస్ ఇలా ముగించేసరికి నేను ఈ విధంగా జవాబు చెప్పాను :

"దేవుడి దయవల్ల నేను ఈ వింత సంఘటన రహస్యాలు తెలుసుకుని, రాజ కుమార్తెవద్దకు తిరిగివచ్చి, నా హృదయ వాంఛ తీర్చుకుంటాను. ఈ ప్రయ త్నంలో నేను నాశనమైతే చేసేదేమీలేదు. కాని రాజకుమార్తె నాకు ముందుగా మాట ఇయ్యాలి. నేను నా ప్రయత్నంలో నెగ్గితే ఆమె తనమాట నిలబెట్టుకోవాలి. నాకు మరొక సంకోచం కూడా ఉన్నది. ఆమె నన్ను తన సన్నిధికి రానిచ్చి, నా నోట నావిజ్ఞాపన విని, తానే స్వయంగా జవాబిస్తుందా ? అలా చేస్తే నాకు ధైర్యమూ, ఉత్సాహమూ కలుగుతాయి. పూర్తిసంతృప్తితో ఆమె కోరిన పనికి పూనిక తెచ్చుకుంటాను."

ఆడపరిచారిక నా కోరికను రాజ కుమారికి అందించింది. ఆమె నన్ను తన సన్నిధికి పిలిపించింది. నేను ఆమె ఉన్నచోటికి పరిచారిక వెంట వెళ్ళాను. నాకు దృగ్గోచరమైన అందం ఏమని చెప్పను ? అందమైన ఆడబానిసలు, వెలలేని ఆభరణాలు ధరించి, చేతులు కట్టుకుని రెండు బారులలో నిలబడి ఉన్నారు. వాళ్ళు మనుషులా, దేవతలా అనిపించింది. ఆ అందమైన పరిసరాలు చూసి అప్రయత్నంగా ఒక దీర్ఘమైన నిట్టూర్పు విడిచాను. నా బలాన్ని కూడ గట్టుకుని ముందుకు నడిచాను. నా గుండె దడదడలాడుతున్నది. పాదాలు బరువుగా ఉన్నాయి. ఏస్త్రీకేసిచూసినా దృష్టి ఆమెనుంచి మరల్చటానికి సాధ్యం కాకుండా ఉన్నది

గది అవతలి చివర ఒక పరదా ఉన్నది. దానికి ఇవతల ఒక రత్న ఖచితమైన ఎత్తుపీట ఉన్నది. ఆ పీట మీద కూర్చోమని నన్ను తెచ్చిన పరిచారిక సైగచేసింది. నేను కూర్చు న్నాక, ఆమె నా పక్కనే ఉన్న చందనం పీటమీద తాను కూర్చున్నది.

"నువ్వు ఏం చెప్పదలిచావో దాచకుండా అంతా చెప్పు," అన్నదామె.

నేను రాజకుమార్తె ఘనతనూ, ఈవినీ, న్యాయాన్నీ ముందు కొనియాడి, నేను వాళ్ళదేశంలో అడుగుపెట్టినది మొదలు ప్రతిచోటా ప్రయాణీకులకు చేసిఉన్న సదుపాయాలూ, అమరిన సౌకర్యాలూ వివరించాను. నేను ప్రతిచోటా మూడేసి రోజులున్నాను. నాలుగో నాడు వెళతానంటే, సంతోషంగా వెళ్ళిరమ్మన్నవారు లేరు. నేను మజిలీచేసిన చోట నేను వాడుకున్న వస్తువులన్నీ నావేనన్నారు. ఎప్పుడువచ్చినా నేను వాటిని తీసుకోవచ్చుననీ, లేదా అమ్ముకోవచ్చుననీ అన్నారు. చిత్రమేమంటే నాలాంటి యాత్రికుడికే ఇలా జరిగితే, ఈ దేశానికి వేలాది యాత్రికులువస్తారు-ఇదివరకే వచ్చిఉండాలి. వారందరికీ నాకు జరిగినట్టే జరిగితే అందుకయే ఖర్చు అంచనాకు అందదు. ఇంత ఖర్చుకు ఎలా వస్తున్నది, ఎక్కడినుంచి వస్తున్నది? నీకీ నిధులు చాలవు గదా! ఈ రాజకుమార్తెకున్న రాజ్యం చూడబోతే, దానిమీదవచ్చే ఆదాయం, ఇతర ఖర్చులమాట అటుంచి, అతిధులకు తిండి పెట్టటానికి కూడా చాలకపోవచ్చు. రాజకుమార్తె అనుగ్రహించి ఈ వింత వివరించినట్టయితే నేను తేలికపడిన మనస్సుతో సీమ్రోజ్ నగరానికి వెళ్ళి, అక్కడికి ఏదోవిధంగా చేర్చుకుని, అక్కడి పరిస్థితులన్నీ ఆరాతీసి, రహస్యాన్ని తెలుసుకుని తిరిగివచ్చి, నా కాలమంతా రాజకుమారి సేవలో గడిపేస్తాను. ఇదే నా హృదయవాంఛ.

ఈ మాటలు విని రాజకుమారి ఇలా అన్నది :

"యువకుడా! నా సంపదకు మూలం ఏమిటో తెలుసుకోవాలంటే ఇక్కడ మరొక రోజు ఉండు. సాయంకాలం నిన్ను పిలిపించి, నాకున్న నిధులు నీకు దాచకుండా సొంతం చూపుతాను."

ఈ మాట ధైర్యంతో నేను నా బసకు తిరిగివెళ్ళి, ఎప్పుడు సాయంకాలమవుతుందా, ఎప్పుడు రాజకుమారి రహస్యం తెలుసుకుంటానా అని ఎదురుచూడసాగాను. ఈ లోపల ఒక కొజ్జావాడు బానిసల నెత్తిన పళ్లాలు మోయించుకొని తెచ్చి నా ముందుపెట్టి, "రాజకుమారి తాను తినే భోజనాన్ని నీకు పంపింది. తీసుకో," అన్నాడు.

వాడు పళ్ళాల మీది ఆచ్ఛాదనలు తొలగించేసరికి రుచికరమైన ఆహార పదార్థాల వాసన గుప్పునకొట్టి, ఎక్కడలేని ఆకలి పుట్టుకొచ్చింది. భోజనం చెయ్యగలిగినంత భోజనంచేసి మిగిలినవి తిప్పి పంపుతూ, రాజకుమారికి నా ధన్యవాదాలు అందజేయమన్నాను.

రోజుల్లా ప్రయాణంచేసి బడలిన ప్రయాణీకుడిలాగా సూర్యుడు గూడు చేరుకుని, చంద్రుడు తారకలను వెంట



బాగా త్రాగుడు అలవాటున్న వాళ్ళకి
కాలేయం చెడిపోతుంది! మీ
కాలేయం చెడిపోయిందా!! అంటే
మీరూ బాగా

బెట్టుకుని ఇల్లువదలి వచ్చేసమయానికి ఒక చేటికవచ్చి, "రాజకుమారి నిన్ను రమ్మన్నది, పద," అన్నది.

నేను ఆమె వెంట ఒక అభ్యంతర గృహానికి వెళ్లాను. ఆ గది అందం ముందు పౌర్ణమిరాత్రి చాలదు. రత్న కంబలాలమీద ఒక పెద్ద పరుపు పరిచి ఉన్నది. దానిమీద రత్నాలు కుట్టిన బాలీసు ఉన్నది. రత్నాలు పొదిగిన వెండి స్తంభాలమీద జరీబట్టతో చాందినీ ఉన్నది. దాని అంచుల ముత్యాలజాలర్లు వేలాడుతున్నాయి. పరుపుకు ఎదురుగా రంగురంగుల రత్నాలతో తయారుచేసిన మొక్కలున్నాయి. వాటికి బంగారుదిమ్మలున్నాయి. వాటి ఆకులూ, కాయలూ ప్రకృతిని అనుసరిస్తున్నాయి. కుడి ఎడమల అందమైన బానిసలూ, సేవికలూ చేతులుకట్టుకుని, తలలువంచి, మౌనంగా నిలబడి ఉన్నారు. నాట్యగత్తెలూ, పాటగత్తెలూ జంత్రవాద్యాలను శ్రుతిచేసుకుని, ప్రారంభించడానికి సిద్ధంగా ఉన్నారు. అలాంటి దృశ్యం చూడగానే నా తల తిరిగిపోయి, మతి తప్పింది.

నేను నా వెంటవచ్చిన పరిచారికతో, "ప్రపంచాన్నంతటినీ పాలించే రాజు కూడా ఇంతకన్న హెచ్చువైభవం ప్రదర్శించలేడు. రాజకుమారి దివాణం ఎప్పుడూ ఇలాగే ఉంటుందా?" అన్నాను.

"అవును. ఇది ఎప్పుడూ ఇప్పుడున్నట్టే ఉంటుంది. ఒక్కొక్కప్పుడు ఇంకాస్త వైభవంగా ఉండటం కూడా కద్దు. కాని దీనికి తక్కువగా మాత్రం ఎప్పుడూ ఉండదు. నువు ఇక్కడ కూర్చో. రాజకుమారి మరొక గదిలో ఉన్నది. ఆమెకు నువు వచ్చిన సంగతి చెబుతాను," అన్నదామనిషి.

ఆమె వెళ్ళి, వెంటనే తిరిగివచ్చి, నన్ను రాజకుమార్తె వద్దకు రమ్మన్నది. ఆమె గది ప్రవేశించగానే నా కళ్లుచెదిరి, దిగ్భ్రమ కలిగింది ఆ గదికి వాకిళ్లు ఎక్కడో, గోడలు ఎక్కడో తెలియ రాలేదు. ఎందుకంటే వాటికి పెద్ద అద్దాలు అమర్చి ఉన్నాయి. ఆ అద్దాల చట్రా లకు మణులు పొదిగి ఉన్నాయి. ఒక మణినుంచి వచ్చే కిరణాలు మరొక మణి నుంచి ప్రతిఫలించటంచేత గది అంతా మణులతో కూర్చినట్టు అనిపించింది. ఒక చివర పరదా కట్టి ఉన్నది. దాని వెనక రాజకుమారి కూర్చుని ఉన్నది. పరిచారిక పరదాకు సమీపంగా కూర్చుని, నన్నుకూడా కూర్చోమన్నది. తరవాత ఆమె, రాజకుమార్తె ఆజ్ఞాపించిన మీదట ఇలా చెప్పసాగింది:

## 7

ఈ దేశపు సుల్తాను చాలా సంపన్ను డైన రాజు. ఆయనకు ఏడుగురు కుమా ర్తెలు. ఒకనాడు ఆయన ఒక ఉత్సవం ఏర్పాటుచేశాడు. ఈ ఏడుగురు కుమా ర్తెలూ దివ్యంగా అలంకరించుకుని ఆయనముందు నిలబడ్డారు. అప్పుడాయ నకు ఏదో ఆలోచన వచ్చి, తన కుమార్తె లతో, "మీతండ్రి రాజుకావటానికి బదులు ఏ పేదవాడో అయి ఉన్నట్టయితే మిమ్మలను ఎవరు రాజకుమార్తెలని పిలిచేవారు? ఇలా పిలిపించుకుంటున్నం దుకు సంతోషించండి. మీ అదృష్టమంతా నా జీవితంమీద ఆధారపడి ఉన్నది," అన్నాడు.

ఆరుగురు రాజకుమార్తెలు ఏక కంఠంగా, "మహారాజుగారన్నది నిజం. మా సుఖం మీ సౌభాగ్యంమీద ఆధారపడి ఉన్నది," అన్నారు.

కాని ఇప్పుడు పాలించే రాజకుమార్తె అందరిలోకి చిన్నదైనప్పటికీ అందరి కన్నా వివేకం గలది. ఆమె మిగిలిన వారితో కలవక, మౌనంగా నిలబడిఉండి పోయింది. ఎందుకంటే అలా మాట్లా డటం పాపం.

రాజు ఆమెకేసి కోపంగాచూసి, "ఏం దొరసానీ? నువెందుకు మాట్లాడవు? నీ మౌనానికి కారణం ఏమిటి?" అన్నాడు.

రాజకుమార్తె తన రెండు చేతులూ రుమాలుతో బంధించుకుని, ''ప్రభువులు మన్నించేటట్టుంటే ఈ బానిస తన అంత రాత్మ విప్పి చెబుతుంది,'' అన్నది.

"ఏం చెప్పదలిచావో చెప్పు' అన్నాడు రాజు.

రాజకుమార్తె ఇలా అన్నది:

''మహారాజా, సత్యాన్ని మించినది లేదని మీకు తెలుసు. అందుచేత నేను, ఈ క్షణంలో నా ప్రాణాన్ని కూడా లక్ష్యపెట్టకుండా, మీతో ఈ మాట చెప్ప సాహసిస్తున్నాను. ఈశ్వరుడు లిఖించిన దాన్ని ఎవరూ చెరపలేరు. దానినుంచి ఎవరూ తప్పుకోనూలేరు. రాజులకు రాజైన ఈశ్వరుడు నిన్ను రాజును చేసి



నట్లే నన్ను రాజుకుమార్తెను చేశాడు. ఆయన నిర్ణయాన్ని మార్చే అధికారం ఎవరికీ లేదు. నువు నాకు రాజువు, పోష కుడివి. నీ పాదధూళి శిరస్సున ధరిం చుట నా ధర్మం. కాని ఎవరి విధి లిఖితం వారిదే."

ఈ మాటలు విని రాజుకు చాలా ఆగ్రహం కలిగింది. ఆమె చెప్పిన సమా ధానంతో తృప్తిపడక ఆయన, "ఇంత చిన్న నోటితో ఎంత పెద్ద మాటలు మాట్లాడావు! నీదుస్సాహసానికి శిక్ష ఇస్తున్నాను. నీ వంటిమీద ఉన్న నగ లన్నీ తీయించి, కుళ్ళుగుడ్డలు తొడిగించి, నిర్జనమైన ఎడారిలోకి నిన్ను పంపేస్తాను నీకు విధి ఏమిరాసిపెట్టి ఉన్నదీ అప్పుడ చూస్తాం!" అన్నాడు.

రాజుగారి ఆజ్ఞప్రకారం, చీకటి రా( చాలా పొద్దుపోయి, ఎంతో నాజూకు( రాజసౌధం గోడలమధ్య పెరిగిన రా( కుమార్తెను బోయీలు పల్లకీలో ఎక్కిం( కుని, ఎలాంటి మృగాలుగాని మనుష( గాని సంచరించని మైదానంలో వద( పెట్టారు. వాళ్ళు వెళ్ళిపోయాక, రా( కుమారి మనస్థితి వర్ణనాతీతం. ఒక్క( క్షణంలో ఆమె దశ అంత ఉన్నతినుం( ఇంత హీనస్థితికి దిగజారిపోయింది.

ఆమె భగవానుడితో ఇలా చెప్పు( కున్నది.

"ఈశ్వరా, నువు చెయ్యదలచినది ...వు, అలాగే చేయనున్నది చేసేస్తావు. ...ని నాలో శ్వాసఆడుతున్నంతకాలమూ ... రక్షణ గురించి నిరాశచెందను."

ఈ విధంగా అనుకుని ఆమె నిద్ర ...యింది. ఉదయంకాగానే ఆమె నిద్ర ...చి, ముఖం కడుక్కోవటానికి నీరు ...మ్మని కేకపెట్టింది. అంతలో ఆమెకు ...తరాత్రిఘటనలు జ్ఞాపకంవచ్చి, "నువు ...క్కడ ఉన్నావు? ఎవరిని పిలుస్తు ...న్నావు?" అని తనను తాను హెచ్చ ...ంచుకుని, లేచి కాలకృత్యాలు నిర్వ ...ర్తించకుండానే దైవప్రార్థన చేసింది.

ఆసమయంలో రాజకుమారి మనస్థితి ...లచుకుంటే గుండె తరుక్కుపోయింది. ...స్సహాయ స్థితిలో భగవంతుడే దిక్కని ...స్తాడనేది నిజమే కద. ఆమె మూడు ...రోజులు కటిక ఉపవాసాలు చేసింది. ...మె శక్తి పూర్తిగా ఉడిగిపోయింది. ...ముఖం పాలిపోయింది. దాహంతో ...నాలుక పిడచకట్టుకుపోయింది. కళ్ళు ...గుంటలు పడిపోయాయి. దుర్బల శరీ ...రంలో కొనప్రాణం నిలిచి ఉన్నది. కాని ...ప్రాణం ఉన్నంతకాలమూ ఆశ ఉంటుంది ...కద. నాలుగోరోజు ఉదయం ఒక ముని ...కనిపించాడు. ఆయన రాజకుమారిని ...ఆ స్థితిలో చూసి, "అమ్మా! నీ తండ్రి ...రాజైనా కూడా నీకీ కష్టాలు రాసిపెట్టి ...ఉన్నాయి. నన్ను నీ పరిచారకుడిగా ...ఎంచుకో. అహోరాత్రాలు దేవుణ్ణి తలు చుకో. దేవుడెప్పుడూ సక్రమంగానే చేస్తాడు," అన్నాడు.

ఆ ముని తన సంచీలో ఉన్న ఆహారము తీసి రాకుమార్తెముందు పెట్టి, నీటి కోసం వెతుకుతూ వెళ్లాడు. ఆయన కొక బావి కనిపించింది గాని, నీరు చేదటానికి తాడుగాని, బొక్కెనగాని లేదు. ఆయన చెట్టుఆకులుకోసి వాటితో దొప్ప తయారుచేసి, తన నడుముకు కట్టుకుని ఉన్న తాడుతో నీరు చేది రాజకుమార్తెకు ఇచ్చాడు. చిట్ట చివరకు రాజకుమార్తెకు కాస్త శక్తివచ్చింది.అపుణ్యాత్ముడు ఒంటరి గానూ, నిస్సహాయురాలుగానూ ఉన్న రాజకుమార్తెకు ధైర్యంచెప్పి అనున యించి, తాను కంటతడిపెట్టుకున్నాడు. ఆ మాటలు విని, సానుభూతి తెలుసు కున్నమీదట రాజకుమార్తె మనస్సు కొంత తేలికపడింది.

ఆ రోజు మొదలుకొని ఆ వృద్ధుడు ప్రతి ఉదయమూ నగరానికి వెళ్ళి భిక్షా టనచేసి, తనకు దొరికిన ఆహారం రాజ కుమార్తెకు పెడుతూ వచ్చాడు. ఇలా కొద్దిరోజులు గడిచాయి.

ఒకనాడు రాజకుమార్తె తలకు నూనె రాసి దువ్వుకుందామని జడ విప్పేసరికి అందులోనుంచి మేలైన ముత్యం బయట పడింది. రాజకుమార్తె దాన్ని మునికిచ్చి, అమ్మి డబ్బు తెచ్చిపెట్టమన్నది. ఆయన ఆ ముత్యాన్ని అమ్మగావచ్చిన డబ్బు తెచ్చి ఆమెకిచ్చాడు. అప్పుడు రాజ



కుమార్తె తాను నివసించడానికి ఒక కుటీరం కావాలన్నది.

"అమ్మాయీ, నువ్వు పునాదులు తవ్వి మట్టి సేకరించు. నేను ఎప్పుడో ఒకప్పుడు నీరూ, బద్దలూ తెచ్చి నీ కొక గది కట్టిపెట్టుతానన్నాడు ముని.

రాజకుమార్తె ఆయన చెప్పినప్రకారం పని ప్రారంభించి, ఒక గజంలోతు తవ్వే సరికి ఒక ద్వారం తగిలింది. ఆ ద్వారానికి అడ్డంగా ఉన్న మట్టి తొలగించి, ద్వారం తెరిచేసరికి ఒక పెద్ద గది కనిపించింది. దాని నిండా బంగారమూ, రత్నాలూ ఉన్నాయి. ఆమె నాలుగైదు పిడికెళ్ళ బంగారం తీసుకుని, ద్వారం మూసి దానికి అడ్డంగా మట్టి తోసేసింది.

ఇంతలో ముని తిరిగి వచ్చాడు. రాజకుమార్తె ఆయనతో, ఆ ప్రదేశంలో గొప్ప రాజభవనం నిర్మించడానికి తాపీ వాళ్ళనూ, వడ్రంగులనూ, కూలీలను తెమ్మన్నది. అంతేగాక దానిచుట్టూ ఒక మహానగరం నిర్మించి, అందులో ఒక బలమైనకోటా, చక్కని ఉద్యానవనమూ, విశాలమైన పాఠశాలా సాధ్యమైనంత త్వరలో నిర్మాణం కావాలని ఆమె అన్నది. ముని వెళ్ళి ముందుగా వాస్తు ప్రవీణులను తెచ్చాడు. రాజకుమార్తె ఇష్టానుసారం వేరువేరు భవనాలకు పథకాలు తయారుచేశారు. సమర్థులైన సహాయకులు దొరికారు. పని ప్రారంభమయింది.

బ్రహ్మాండమైన భవనాల నిర్మాణం
 ౹గుతున్న వార్త రాజుకు, అంటే రాజ
మార్తె తండ్రికి తెలియవచ్చింది.
యన అమాంతంగా ఆశ్చర్యపడి,
ంతింత భవనాలు కట్టిస్తున్న స్త్రీ ఎవ
ని ప్రతి ఒక్కరినీ అడిగాడు. కాని
వరూ చెప్పలేకపోయారు; మాకు
లియదంటే మాకు తెలియదన్నారు.

అప్పుడు రాజు తన కొలువులో ఉన్న
క గొప్పవాణ్ణి పంపి, తానువచ్చి భవ
ాలు చూడగోరుతున్నట్టూ, ఆమె ఏ
శపు రాజకుమార్తో, ఏ వంశమో తాను
లుసుకో గోరుతున్నట్టూ కబురుచేశాడు.

ఈ సందేశం అందుకుని రాజ
మార్తె సంతోషించి ఈ విధంగా లేఖ
ాసింది:

"విశ్వసంరక్షకులకు, అభ్యుదయం!
లినవారు నా పేదగృహాన్ని పావనం
య వస్తున్నారని విని పరమానందం
ందాను. తమరిలా అనుగ్రహించటం
ల్ల నా గౌరవమర్యాదలు పెంపొంద
లవు. ఏలినవారు పాదాలు మోపిన
ప్రదేశంయొక్క అదృష్టమూ, తమ
ండ పడిన ప్రజల అదృష్టమూ ఎంత
సుఖమైనది! ఈ రెంటిమీదా తమ అను
గ్రహం ప్రసరించుగాక! రేపు గురువారం
ాలా మంచిరోజు గనక, ఏలినవారు
రేపు దయచేసి, మేమిచ్చే అల్పమైన ఆతి
థ్యాన్ని స్వీకరిస్తారని ఈ బానిస నమ్ము
కున్నది. ఇలా చెయ్యటంవల్ల ఏలినవారు
పేదలపట్లా, అపరిచితులపట్లా చూపే
ఆదరణ పరిపూర్ణ మవుతుంది. ఇంత
కన్న అతిశయించి చెప్పటం భావ్యం
కాదు."

రాజకుమార్తె దూతగా వచ్చినవాడికి
కొన్ని బహుమానాలతోపాటు ఈ ఉత్తరం
ఇచ్చి పంపేసింది.

రాజు ఉత్తరం చదువుకుని, ఆహ్వా
నాన్ని అందుకుని తాను తప్పక వస్తు
న్నట్టు వార్తపంపాడు. రాజకుమార్తె
తన నౌకర్లచేత సముచితమైన ఏర్పా
ట్లన్నీ చక్కగా చేయించింది. రాజు
వాటిని చూసి సంతోషించాలనీ, ఆయన
వెంట వచ్చే అధికులూ, అల్పులూ తృప్తి
పడి మరీ వెళ్ళాలనీ ఆమె ఉద్దేశం.
విందులో భోజనపదార్థాలు అద్భుతంగా
ఉండగలందులకు ఆమె ప్రత్యేక శ్రద్ధ
వహించింది.

సాయంకాలం కాగానే రాజు రాజ
కుమార్తె భవనానికి వచ్చాడు. రాజ
కుమార్తె తన పరిచారికలతోసహా ఆయ
నకు ఎదురువచ్చి నమస్కరించి, ఆయన
కోసం సిద్ధంగా ఉంచిన సింహాసనం
వద్దకు సగౌరవంగా తీసుకుపోయింది.

రాజకుమార్తె తన తండ్రికి కానుకగా
125,000 వెండి అచ్చులూ, నూటఒక్క
పళ్లెం నిండా మణులూ, బంగారమూ,
శాలువలూ, మేలివస్త్రాలూ, పట్టు
వస్త్రాలూ, జరీవస్త్రాలూ, రెండు ఏను
గులూ, పది అరబ్బీ గుర్రాలూ సిద్ధం




చేసింది. ఆమె వాటిని ఆయనకు సమర్పించి, ఆయనకు ఎదురుగా చేతులు కట్టుకు నిలబడింది.

రాజు ఆమెను సౌజన్యంతో, "నువు ఏ దేశపు రాజకుమారివి? ఏ కారణం చేత ఇక్కడికివచ్చావు?" అనిఅడిగాడు.

రాజకుమారి తలవంచి నమస్కరించి "ఈ దాసిస తమ ఆగ్రహానికి గురి అయి ప్రవాస శిక్ష పొందినది. మీరు చూసేదంతా ఈశ్వరుడి అద్భుత కటాక్షం," అన్నది.

ఈ మాట వినగానే రాజులో పైతృక ప్రేమ పొంగింది. ఆయన లేచి తన కుమార్తెను కౌగలించుకుని, ఆమెను సింహాసనంమీద తనచెంత కూర్చోబెట్టుకున్నాడు. అయినా ఆయనకు తాను చూస్తున్న దృశ్యాలపట్ల ఆశ్చర్యం తరగలేదు. వెంటనే తన రాణినీ, రాకుమార్తెలను తీసుకురమ్మని ఆయన మనుషులను పంపాడు.

వారు వచ్చి రాజకుమార్తెను గుర్తించి కౌగలించుకుని, ఆనందబాష్పాలురాల్చి, భగవంతుణ్ణి స్తుతించారు. రాజకుమార్తె తన తల్లికీ, అక్కలకూ ఇచ్చిన సువర్ణ, రత్న కానుకలు ప్రపంచంలో మరెక్కడా ఉండవు తరవాత రాజు అందరినీ తన చుట్టూ కూర్చోబెట్టుకుని విందు భోజనం చేశాడు.

రాజుగారి జీవితాంతంవరకూ కాలం ఇలాగే గడిచింది. ఒక్కొక్కప్పుడు రాజు రాజకుమార్తె భవనానికి వచ్చేవాడు. ఒక్కొక్కప్పుడు ఆమెను తన భవనానికి పిలిపించుకునేవాడు. రాజుగారి అనంతరం రాజ్యం రాజకుమార్తెకు సంక్రమించింది. ఆమె తప్ప ఆమె కుటుంబంలో రాజ్యార్హతగలవారు మరెవరూ లేరు.

రాజకుమార్తె బస్సోరా జీవితకథను ముగించి పరిచారిక నాతో, "నువు ఇంకా సీమ్‌రోజ్ దేశానికి వెళ్ళి అక్కడ జరిగిన వింత ఘటనలను గురించి ఆరాతీయ గోరుతున్నట్టయితే వెంటనే బయలుదేరు" అన్నది.

"ఈ క్షణమే బయలుదేరి, దేవుడు

అనుగ్రహిస్తే త్వరలోనే తిరిగివస్తాను," అన్నాను.

నేను రాజకుమార్తెవద్ద సెలవు పుచ్చుకుని దేవుడిపైన భారమంతా వేసి ప్రయాణమయ్యాను. ఒక ఏడాదిపాటు ప్రయాణంలో అనేక కష్టాలు ఎదుర్కొని సీమ్రోజ్ నగరం చేరాను. అక్కడి పౌరులందరూ ధనికులూ దరిద్రులూ అన్న విచక్షణ లేకుండా, నల్లదుస్తులు ధరించి ఉన్నారు. నేను ముందు విన్నదంతా ఇప్పుడు ప్రత్యక్షంగా చూశాను.

కొద్దిరోజుల అనంతరం అమావాస్య వెళ్ళి కొత్తమాసం వచ్చింది. ఆ నాడు రాజుగారు మొదలుకొని నగరవాసులందరూ పెద్ద మైదానంమీద చేరారు. వాళ్ళతోపాటు నేనూ వెళ్ళాను. జరగబోయే వింత చూడటానికి అందరితో కలిసి నేనూ నిలబడ్డాను.

ఇంతలో అడవులనుంచి ఒక యువకుడు నురుగులు కక్కుతున్న ఎద్దుమీద వచ్చాడు. ఎద్దు భయంకరంగా రంకెలు పెడుతున్నది. ఈ వింత సంఘటనకు అర్థం ఏమిటో తెలుసుకుందామని నేను ఎంతో శ్రమపడి, ఎన్నో అపాయాలను ఎదుర్కొని అక్కడికి చేరానేగాని, ఆ యువకుణ్ణి చూడగానే నాకు మతిపోయినట్టయి, ఆశ్చర్యంతో మౌనంగా ఉండిపోయాను. ఆ యువకుడు తాను ఆనవాయితీగా చేసేదంతా చేసి, అడవులకు తిరిగి వెళ్ళాడు. ప్రజలు నగరానికి తిరిగి వచ్చారు. నా బుర్ర తిరిగి పనిచెయ్యటం మొదలుపెట్టేసరికి పశ్చాత్తాపం కలిగింది. నేను రహస్యం తెలుసుకోవాలంటే మరొక నెలదాకా ఆగాలి. చేసేదిలేక నేను కూడా జనంతోపాటు నగరానికి తిరిగి వచ్చాను.

ఆ నెలంతా నాకు రోజు కొక యుగంగా గడిచిపోయింది. చిట్టచివరకు నెల ముగిసి, కొత్త నెల ఆరంభమయినది. ఆ రోజున రాజూ, ప్రజలూ తిరిగి మైదానంమీద సమావేశమయారు. ఏమయినాసరే, ఈసారి ఈ సంఘటన రహస్యం ఛేదించితీరాలని దృఢనిశ్చయం చేసుకున్నాను. అకస్మాత్తుగా ఆ యువకుడు అలవాటుప్రకారం పచ్చని ఎద్దు మీద వచ్చి, మైదానంలో చతికిలబడ్డాడు. అతని ఒక చేతిలో దూసినకత్తి ఉన్నది. రెండో చేతిలో ఎద్దు పలుపు ఉన్నది. అతను ఎప్పటిలాగే పాత్రను తన పరిచారకుడికి ఇచ్చాడు. వాడు దాన్ని ప్రజలకు చూపుతూ ఉంటే దాన్ని చూసి ప్రజలు ఏడ్చారు. చివరకు ఆ యువకుడు ఆ పాత్రను నేలకేసికొట్టి పగులగొట్టి, ఒక కత్తివేటుతో తనవెంట ఉన్నవాడి తల తెగనరికి, ఎద్దునెక్కి అడవులకేసి వెళ్ళిపోయాడు.

నేను ఆ యువకుడివెంట పరిగెత్తబోయాను. కాని ప్రజలు నన్ను పట్టుకుని ఆపి, "ఏం చేద్దామనుకుంటున్నావు? నిష్కారణంగా ఎందుకు ప్రాణం



పోగొట్టుకుంటావు? నీకు జీవితంమీద రోతపుట్టితే ప్రాణాలు తీసుకొనేటందుకు ఇంతకన్న మంచి మార్గాలు చాలా ఉన్నాయి," అన్నారు.

నేను వారిని ఎంతో వేడుకున్నాను. పెనుగులాడాను. కాని వారిపట్టు నుంచి బయటపడలేకపోయాను. ముగ్గురు నలుగురు మనుషులు నన్ను పట్టుకుని నగరానికి తీసుకుపోయారు.

ఇంకొక నెల కూడా గడపవలసి వచ్చేసరికి నేను ఎంతగా ఆరాటపడ్డానో మీరు సులువుగా గ్రహించవచ్చు. ఆ నెల గడిచి మరొక నెల ఆరంభమైననాడు పురజనులందరూ తిరిగి మైదానం మీద కూడారు. ఆ రోజు నేను పెందలాడే లేచి, అందరికన్న ముందుగా అడవికి వెళ్ళి, ఆ యువకుడు వచ్చేదారిలో దాక్కొన్నాను. అక్కడ నన్ను నిగ్రహించే వారుండరు గదా.

(సశేషం)




మూడు సంవత్సరాల పిల్లవాడు అడుగులు వేసుకుంటూ పరుగెత్తుకొని వస్తుంటే, ఎంత అందంగా వుంటుంది? వొచ్చీ రావటంతోనే తన చిట్టిచేతుల్తో వాటేసుకొని పెనవేసుకుంటే ఎంత బాగుంటుంది!

అందులో అతడు పిల్లల్నీ స్త్రీలనీ చూచి చాలారోజులైంది. జీవితం అంటే అసహ్యం పుట్టి, ఆ గదిలో వొక్కడే కూర్చుని గీతాపారాయణం చేసుకుంటూ కాలం గడుపుతున్నాడు.

ఆ పిల్లవాడెవ్వడో అతనికి తెలియదు. అతను గీత చదువుకుంటూవుంటే హఠాత్తుగా తలుపు నెట్టుకొని వచ్చి, వొచ్చీ రావటంతోనే ఈపని చేశాడు. మొదట్లో అతను పిల్లవాని చేతుల్లోనించి విడిపించుకుందామని అనుకున్నాడు. కాని ఆ బుల్లినోరు అతన్ని ఆకర్షించింది. పైగా అమ్మే—అమ్మ అన్నాడు.

గీతకి అందకుండా ఏ పొరలో దాక్కునివుందో ప్రేమ, అతని కా పిల్లవాణ్ణిచూస్తే ప్రేమ కలిగింది. ఎత్తుకుందామని చేతులుజాపే తలికి ఆ పిల్లవాడు అతని కాళ్ళ సందున నక్కి "అమ్మే—అమ్మా" అన్నాడు.

ఇంతలో గడపలో అలికిడైంది. అతని హృదయం దడదడ కొట్టుకుంది. బల్లమీద తెరచివుంచిన భగవద్గీత కాగితాలు రెపరెప కొట్టుకున్నాయ్ కిటికీ తలుపు టపటప కొట్టుకుంది.

పద్దెనిమిది సంవత్సరాల అమ్మాయి. అతని గదిలో అడుగుపెట్టింది. అతన్ని చూసి, అడుగుతీసి, శరీరాన్ని తలుపు చాటుకు లాక్కుంది.

పిల్లవాడు అతని కాళ్ళుపట్టుకొని, పైకి ఎగబాకడానికి ప్రయత్నించాడు. అతడు వొక్కసారి బల్లమీద రెపరెప కొట్టుకునే భగవద్గీతను చూసుకొని అలాగే నిలబడిపోయాడు.

"రా బాబు వెళ్దాంరా!" అంది పిల్ల.

పిల్లవాడు అతని చొక్కాపట్టుకొని వేలాడాడు.

ఆ పిల్ల తలుపుచాటునుంచి తొంగి చూచి, "బిస్కట్లు పెడ్తారా... మా బాబుకదూ" అంది. అతనికి చొక్కా చిరిగి పోతుందేమోనని భయంవేసింది. "రావూ? నాన్నతో చెప్పనా?" అని అడిగింది, పిల్ల.

ఈ మాటలకు పిల్లవాడు భయపడి పోయాడు. బిత్తర చూపులు చూశాడు. అతనికాళ్ళు వొదలి, తల్లి దగ్గరకు పరి గెత్తాడు. ఆమె గదిలోకి ఎదురుగా వొచ్చి పిల్లవాణ్ణి ఎత్తుకొని తీసుకు వెళ్ళింది.

ఆమె బయటకు నడుస్తుంటే ఒక్కొక్క అడుగూ అతని హృదయాన్ని మీటింది. అడుగుతీసి అడుగుపెట్టేటలికి అతని ప్రాణం జివ్వున లాగింది. ఆమె భూమి మీద అడుగు పెట్టగానే అతనికి హాయిగా వుండేది. అడుగు తియ్యగానే నరాలు జివ్వున లాగేవి. ఆ ముడీ, ఆ మెడా, ఆ వీపూ, ఆ పిరుదులూ అతనికి దూర మవుతున్నకొద్దీ అతని హృదయానికి దగ్గరయినయ్.

నిట్టూర్చి అతడు భగవద్గీత ముం వేసుక్కూచున్నాడు. అయిదు సంవత్స రాల క్రితం ప్రేమించిన యువతి జ్ఞాపకానికి వొచ్చింది. తాను ప్రేమిం చటం — ఆ పిల్ల ప్రేమించటం, సిద్ధ పడటం—ఆ పిల్ల తల్లిదండ్రులు బలా త్కారంగా మరొకడికిచ్చి పెళ్ళి చెయ్యటం, తన హృదయం ముక్కల వడం—గీత సహాయంతో మళ్ళీ ముక్కలు అతుక్కోవటం అన్నీ జ్ఞాపక మొచ్చాయ్.

మర్నాడు అదే టైముకి మళ్లీ ఆ పిల్ల వాడు ఒచ్చాడు అదే విధంగా పిల్లవాడి తల్లి కూడా వొచ్చింది. ఈసారి అతడు ధైర్యం చేశాడు— "పోనీ కొంచెంసేపు వుండనివ్వండి,ఆడుకుంటాడు" అన్నాడు.

ఆ పిల్ల —ఆ పిల్లవాని తల్లి — చిరునవ్వు నవ్వుతూ "వొట్టి కోణం గండీ, వున్నచోట ఉండడు" అంది.

అతను అనుమానిస్తూ పిల్లవాణ్ణి ఎత్తుకొని ముద్దుపెట్టుకున్నాడు. పిల్ల వాడు అతని మీసాలు పట్టుకుని లాగాడు. అతడు సిగ్గుతో చచ్చిపోతూ ఆమె వంకకు చూడలేకపోయాడు. ఆమె చిరునవ్వు నవ్వుతుంది. అతడు మీసం వొదిలించుకొని. 'కూర్చోండి' అన్నాడు.

"వొట్టి కోణంగి అండీ!"

"కూర్చోరూ?" — పిల్లవాడి తల నిమురుతూ అడిగాడు.

"వెళ్ళాలి" అంది. ఆమెకు నిజంగా

వెళ్లాలనేవుంది. కాని ఈసారి తన మెడా, వీపూ...అతనికి చూపడానికి సిగ్గువేసింది. కూర్చుంది.

ఇక మాటల్లేవు. పిల్లవాడు తల్లిదగ్గరకు పరుగెత్తాడు. అతన్ని చూపిస్తూ "తాత" అన్నాడు.

ఆమె వొయ్యారంగా "ఛీ" అని మందలించింది. అతనికి సిగ్గువేసింది "రా—రా" అని పిలచాడు పిల్లవాణ్ణి.

"జాగర్త అండీ!" అంది పిల్ల అతనికి మీసాల సంగతి జ్ఞాపకంవచ్చి మళ్లీ సిగ్గు వేసింది. ఆ పిల్ల చిరునవ్వు నవ్వుతూ లేచి 'వెళ్తాను' అని చెప్పి పిల్లవాణ్ణి ఎత్తుకొని సుతారంగా వీపుచూపకుండానే వెళ్లిపోయింది.

అప్పటి నుంచి ఆపిల్లవాడు రోజూ వచ్చేవాడు. ఒకరోజు 'భగవద్గీత' ముక్కలు ముక్కలుగా చించివేశాడు. రోజూ అతని మీసాలతో ఆడుకొనేవాడు. అతనికి కోపంవచ్చేదికాదు గాని బాధగా వుండేది. మీసాలు తీసివేద్దా మనుకున్నాడు. తీయించివేస్తే ఆ పిల్లవాడు దేంతో ఆడుకుంటాడు! రావటం మానివేస్తాడేమో! అలాగే వుంచుకున్నాడు. కత్తిరించుకోవటం మానేసి చాలారోజులైంది.

ఒక రోజు పిల్లవాడు రాలేదు. సెలవలకు యింటికివస్తే కనబడనిభార్య కలిగిన విద్యార్థిలాగు అయిపోయాడు. ఆ పిల్ల యింటి ఎదురుగావున్న కిళ్లీకొట్టు దగ్గరకు వెళ్లాడు. "ఆ ఇంట్లో ఎవరున్నారు?" అనిదుకాణదారుని ప్రశ్నించాడు.

"ఒక అమ్మాయి వుంది బాబూ" అని కొట్టువాడి జవాబు.

"భర్తలేడూ!" అని ప్రశ్న.

"ఎక్కడోవుంటాడు. రెండు మూడు నెలలకి వొకరోజువచ్చిపోతూంటాడు–" అని జవాబు.

"అన్యోన్యంగా వుంటారా?" అని ప్రశ్న.

"అయన్నీ మన కెట్లా తెలుస్తాయి, బాబూ! అయినా మొగుడూ పెళ్లాం అన్న తరవాత తన్నుకోకుండా వుంటారా? వచ్చినప్పుడల్లా వడ్డించిపోతుంటారు.'

అతనికి అకస్మాత్తుగా జాలివేసింది పిల్లవాణ్ణి యెత్తుకొని "ఊఁ, ఊఁ, ఊఁ" లాలించ బుద్ధిపుట్టింది—గబగబవెళ్ళి ఆ యింటి తలుపుకొట్టాడు. పిల్లే తలుపు తీసింది. అతని గుండెలు కొట్టుకున్నై. పిల్లకళ్లు ఎఱ్ఱబడివున్నై. జుట్టురేగి వుంది. పైగా అతన్ని చూచి బెదిరింది. భయపడింది.

"అబ్బాయి యేడీ?" అని అతని ప్రశ్న.

పిల్ల జవాబు చెప్పకముందే "తాత" అంటూ పిల్లవాడొచ్చాడు.

"తప్పు, తాత అనగూడదు" అని చెప్పుతూ పిల్లవాణ్ణి యెత్తుకొని ఆమె లోపలకు నడిచింది. అతను నెమ్మదిగా అనుసరించాడు.

"కూర్చోండి!"




అత డాపట్నే నుంచుని ఆమెని జాలిగా చూస్తున్నాడు. ఆ చూపులు ఆమె భరించలేకపోయింది. పిల్లవాడి జుట్టు నవకిస్తూ 'మా బాబే' అంది. పిల్లవాడు ఆమెభుజంమీదకు ఎక్కటానికి ప్రయత్నిస్తున్నాడు.

ఆమె పమిట సర్దుకుంటూ "కూర్చోరూ," అంది. అతడు ఎక్కడో కూర్చోబోయాడు.

''కుర్చీలో."

కూర్చున్న అతని వొళ్లోకి వెళ్లాలని పిల్లవాడిమారాం ఆ పిల్ల కుర్చీదగ్గరకు వచ్చి అతనికి పిల్లవాణ్ణి అందించటానికి వంగింది. స్తనభారంతో అనుకున్నదాని కంటె దగ్గరకు వంగింది. అతని చూపులుపడ్డయి. చిలిపిపిల్లాడు-మీసాలు పట్టుకులాగాడు. ఇద్దరూ నవ్వుకున్నారు. అతడు పిల్లవాణ్ణి వొళ్లోకి తీసుకొని- "రావటంలేదేం, బాబూ?" అని బుజ్జగిస్తూ అడిగాడు.

''నాన్నొద్దన్నాలు''

''తప్పు, ఏం మాటలవి," అని తల్లి మందలించింది. కాని పిల్లాడు ఆగలేదు. చెప్పేశాడు— "నాన్నొద్దాలు, అమ్మని కొత్తాలు."

అతను జాలిగా పిల్లని చూశాడు. ఆమె చేత్తో మొహం కప్పుకొని కన్నీరు కారుస్తూ వుంది.

''క్షమించండి'' అన్నాడు.

"మీ తప్పేముంది నాకర్మ."

అతడు అక్కడ వుండలేక పోయాడు.

తలుపు తీసుకొని వెళ్ళిపోయాడు.

పిల్లవాడు "తాతా" టాటా అని పిలుస్తూనే వున్నాడు. తల్లి వాణ్ణి హృదయానికి హత్తుకుంటూ ముద్దుపెట్టుకుంటూ ఏడ్చింది.

ఆ రాత్రి అతనికి నిద్రపట్టలేదు. తాను అయిదు సంవత్సరాల క్రితం ప్రేమించిన పిల్ల ఇప్పుడు ఏంచేస్తుం

ఉంది? భర్తతో కాపరమేగా? కోపం వచ్చింది. తా నిలాచస్తుంటే! చేతిలో వున్న భగవద్గీత నేలకు విసరికొట్టాడు.

ఎవ్వరో తలుపు కొట్టారు. నెమ్మదిగా వెళ్ళి తలుపు తీశాడు. ఆ పిల్ల వచ్చింది. అతన్ని చూచి బోరునఏడ్చింది. అతనికేమీ తోచలేదు — "నే కాపరం చెయ్యలేను. పిల్లవాడికోసం ఇన్నాళ్ళూ ఓర్చుకున్నాను. ఇక సహించలేను" అని ఏడ్చింది అతని హృదయం కరిగి నీరయింది ఆమె పెదవి వొణికిపోతుంటే అతడు గిజగిజలాడాడు ఆమెని ఓదార్చాడు ఆమె ఏడుపు మరీ ఎక్కువయింది. "సహించాలి- మనస్త్రీలు అందుకు ప్రసిద్ధి. కష్టాలు కాపురం వుండవు" అని ఓదార్చాడు.

"నేనేం చేశాను? ఆయననన్నెందుకిలా హింసించాలి!" అని అతని వక్షంమీద తలఆన్చి యేడ్చింది. అతనిక్కూడా కళ్ళవెంట నీళ్లుకారినై. ఆమెను దగ్గరకు తీసుకొని "ఏడవకు నామాట వినవ్!" అని గడ్డం పట్టుకుని మొహం పైకెత్తి అడిగాడు. ఆమె శోకాన్ని దిగమింగటానికి ప్రయత్నించింది. కాని ఆపుకోలేకపోయింది. మళ్ళీ అతని వక్షంమీద తలఆన్చి ఏడ్చింది. అతిని చొక్కా కొంతవరకు తడిసింది

"ఇదిగో కొంచెం విశ్రాంతి తీసుకో." అని నెమ్మదిగా పక్కమీద కూర్చోబెట్టాడు. ఆమె పడుకుని దిండులోకి తలదూర్చి యేడ్చింది— "నేని సహించలేను. పిల్లాడు పిల్లాడు."

అతడు నెమ్మదిగా పక్కనకూర్చొని ముగురులుసవరిస్తూఓదార్చాడు బాధతో, యేడ్పుతో, ఆమె శరీరం వేడెక్కింది అతడు తలకింద చెయ్యిదూర్చి కన్నీరు తుడిచాడు. ఆమె కన్నీరు ఆగలేదు. అతని చెయ్యి నొప్పిపుడుతూవుంది. నెమ్మదిగా చెయ్యి తీసుకొనేటప్పటికి "పిల్లాడు పిల్లాడు" అని ఆ పిల్ల యేడ్చింది. అతని నడుం నొప్పిపెట్టింది పక్కనే పడుకున్నాడు. "పిల్లాడు— పిల్లాడు"అని యేడుస్తూ ఆమె కావలించుకుంది. అతడు ముద్దుపెట్టుకొన్నాడు. ఆమె కన్నీళ్లు అతని పెదవుల్ని కాల్చినై. ఆమె శరీరం అతని శరీరానికి దూదిపింజలా తగిలింది. వేడ నిట్టూర్పులు అతన్ని వుద్రేకపరిచాయి. ఆమె కళ్ళని ముద్దుపెట్టుకొన్నాడు, పెదమల్ని ముద్దుపెట్టుకొన్నాడు. మెడని ముద్దుపెట్టుకొన్నాడు

"పిల్లాడు—పిల్లాడు" అని యేడుస్తూ అతన్ని గట్టిగా కావలించుకుంది. ఆమె స్థనాలు అతని చేతికి తగిలినై. అంతకుముందు అవి అంతపెద్దవి అనిగానీ, ఆమె లోపలిబాడీ వేసుకోలేదని గానీ అతనికి తెలియదు.

"పిల్లాడు-పిల్లాడు" అని యేడుస్తూ ఆమె అతని చేతిని కదలనివ్వకుండా తన చేత్తో అదుముకుంది.



అతని తల గిర్రున తిరిగింది. ఇంటి కప్పు కనబడటం లేదు. ఏ మోతా విన పట్టంలేదు. మంచంవేడి యెక్కువైంది. ఏదో లోకంలోకి ఒరిగిపోతున్నట్లు అని పించింది.

నెమ్మదిగా లేచి తలుపు గడియ వేసి వచ్చి పడుకున్నాడు.

"పిల్లాడే!"

"నేనున్నానుగా?"

తెల్లవారిలేచి చూచేటప్పటికి ఆ పిల్ల వెళ్ళిపోయింది. నలిగిపోయిన పక్క కనిపించేటప్పటికి కలవరం పుట్టింది. ఇంతకు పూర్వం తాను ప్రేమించిన స్త్రీ మొహాన తుపుక్కున ఉమ్మేసినట్లు బాధపడ్డాడు. మంచం పక్కనే ఉన్న భగవద్గీత వెక్కిరించింది. బర్రునవెళ్ళి తలుపుతీసి ప్రాయశ్చిత్తం చేసు కున్నాడు. మర్నాడే మకాం యెత్తి వేశాడు మళ్ళీ గీతాపారాయణం మొదలుపెట్టాడు. ఆ యింటి ఛాయలకు వెళ్ళలేదు. గీతా మహత్యం-ఆత్మని లోబరుచుకున్నాడు. ఒకనాడు అతను తన గదిలోవుండి గీతాపారాయణంచేస్తూ కిటికీలోంచి బయటకు చూట్టం తటస్థించింది. దూరాన్నుంచి ఒక స్త్రీ వస్తూంది. అతని వొళ్ళు ఝల్లుమంది. అయిదు సంవత్సరాల క్రింద తాను ప్రేమించిన స్త్రీ ఆ ఇసుకలో కాళ్ళీడ్చు కుంటూ వొస్తూవుంది. పెట్టెలు ఎక్కువైన గూడ్సుబండిలా వొస్తూవుంది.

అతనికేమీ తోచలేదు. ఊః అయిదు సంవత్సరాల క్రితం తాను ప్రేమించిన స్త్రీ యిప్పుడిక్కడకు యెందుకు వొస్తూ వుంది? రెండోపిల్ల జ్ఞాపకం వచ్చింది. భగవద్గీత చేతిలోనుంచి జారిపడింది.

ఇక తనేం కావాలి? అయిదు సంవ

త్సరాల క్రితం ప్రేమించిన ఈ అమ్మాయిని మరచిపోటానికి ఎంత ప్రయత్నించాడు! అది అట్లా వుండగానే రెండో అమ్మాయి తన జీవితంలోకి ఎట్లా ప్రవేశించింది? మళ్ళీ ఇప్పుడీ మొదటి అమ్మాయి ఎందుకు వొస్తూవుంది? ఇక తన జీవితం ఏఁకావాలి!

మొదటి అమ్మాయి, యిసుకలో కాళ్ళీడ్చుకుంటూ వొస్తూన్న అమ్మాయి గది ప్రవేశించింది. ఆమెను చూచేటప్పటికి అతని హృదయం బ్రద్దలైంది ఇదేమి అవతారం! బుగ్గలు పీక్కుపోయినై. కళ్లు గుంటలుపడ్డయ్; డొక్కయిపోయింది.

ఆమె అతని మనస్సులోని భావాలు గ్రహించి భోరున ఏడ్చింది. అతడు ఆమెని అలాగే ఏడవనిచ్చాడు. ఓదార్చటానికి ప్రయత్నించలేదు.

"నేను చాలా ప్రయత్నించాను. నా ఆత్మని చంపుకొని శరీరాన్ని ఆయనకి అప్పగించాను. లాభంలేకపోయింది. ఆయన్తో నేనిక కాపరం చెయ్యలేను. ఇక్కడే వుండిపోతాను. మీ దగ్గర వుండనివ్వండి. మీ పాదాలవద్ద పడి వుంటాను" అని ప్రార్థించింది.

"నేకేమన్నా పిచ్చా!" అన్నాడు.

"పిచ్చే! నేనెంత బాధపడ్డానో, మీకేం తెలుసు? మొదటిలో ఆయన్ని మిమ్మల్నిగానే వూహించుకుని తృప్తి పడ్డాను. ఆయన్తో మాట్లాడుతుంటే మీతో మాట్లాడుతున్నట్టే వుండేది. ఆయన పక్కనవుంటే మీతో వున్నట్టే వుండేది. కానియిప్పుడు...ఇప్పుడు...నాటకంలో తృప్తిపోయింది. నేనిక ఇక్కడే వుంటాను."

"ఏం మాటలు? ఎవరన్నా వింటే-చూస్తే!" అన్నాడతడు.

"నాకేఁ! వీళ్ళని నేనెందుకు లెక్క చెయ్యాలి? ఈ సంఘం నన్ను ఉద్ధరించిందా? నేనిక్కడే వుండిపోతాను. ఆ నరకానికి పంపరుకదూ?" అని పాదాలు పట్టుకొని ఏడ్చింది.

అతడు వెనక్కి జరిగి చెప్పాడు—"అతడు నీ భర్త, నువ్వు ఆయన్తోనే వుండాలి. ఈ తనువులు శాశ్వతంకాదు. ఇవ్వాళ ఇక్కడున్నాం. రేపు యేమవుతామో చెప్పలేం!" అన్నాడు. ఈ ధోరణిలో గంటసేపు ఉపన్యాసం యిచ్చాడు. ఎన్నెన్నో చెప్పాడు.

అతని మాటలకు ఆమెకు కోపము వచ్చింది. లేచి నిలబడింది. తీక్షణంగా అతని కనులలోకి చూచింది. "ఈ తనువులు శాశ్వతంకాదూ?" అన్నది

"అవును."

"ఏది శాశ్వతం?"

"ఏదీ కాదు."

"ఏదీ శాశ్వతంకాదు. త్వరపడాలి, త్వరపడాలి" అనుకుంటూ తలుపు దగ్గరకువెళ్ళి వెనక్కుతిరిగి, "మీ ఉపదేశాన్ని మరచిపోను. తనువులుశాశ్వతం కాదు. త్వరపడాలి'' అని చెప్పి రివ్వున వెళ్ళిపోయింది. అతనికి ఆశ్చర్యం వేసింది. తనహితోపదేశం యింత త్వరలో పనిచేసినందుకు సంతోషించాడు. ఆ రాత్రి హాయిగా నిద్ర పోయాడు. ఒక కుటుంబాన్ని నిల

బెట్టానని గర్వపడ్డాడు. తెల్లవారి ఒక స్నేహితుడు కనిపించి యిలా అన్నాడు :

"విన్నావా ?''

"ఏమిటి ?"

"నువ్వు చాలా అదృష్టవంతుడివి. నువ్వు ఐదు సంవత్సరాల క్రితం ప్రేమించిన పిల్ల వంటవానితో లేచి పోయింది."

"శ్రీహరీ !"

అతనికి మండిపోయింది. తన ఉపదేశమంతా వ్యర్థమయింది. ఇంకా నయం తానే పెళ్ళి చేసుకోలేదు. ఆమె వెళ్ళబోయేముందు తమ మాటలు అప్పుడతనకి జ్ఞాపకం వచ్చినై. "తనువులు శాశ్వతంకాదు. త్వరపడాలి''

''అవును"

"ఏది శాశ్వతం ?''

''ఏదీ కాదు "

"అయితే త్వరపడాలి "

అతని శరీరం వేగంతో వొణికి పోయింది. ముచ్చెమటలు పోసినై. ఆమె లేచిపోవటానికి తానే కారణమా ? తన గీతోపదేశమే కారణమా ? ఆమె కసలు ఉపదేశం చెయ్యడానికి తనకేమి హక్కు వుంది ? తన్ను ప్రేమించి తన దగ్గరకు వస్తే, సంఘానికి జడిసి, తిరస్కరించి, పైగా గీతోపదేశమా ? ఇంతకీ ఆమె యేమి బాగుపడింది ? తను తిరస్కరించబట్టేగా వంటవాడితో లేచిపోయింది. వేదాంతబోధ చెయ్యకుండా తనే అంగీకరిస్తే ! అతని హృదయం ఆవేశంతో తికమకలాడింది. "దీనికి నేనే కారణం, దీనికి నేనే కారణం" అనుకుంటూ కూర్చున్నాడు. హఠాత్తుగా అతనికి రెండోపిల్ల జ్ఞాపకమొచ్చింది. ఆమె భర్త చేతుల్లో యెంత బాధపడి తన దగ్గరకు వొచ్చిందో అర్థమైంది. హృదయం ఆమెకోసం ఆక్రోశించింది.

వెంటనే తలుపు గభాలున తెరచుకొని ఆమె యింటికి పరుగెత్తాడు. తలుపులు నెట్టుకుని లోపలికి ప్రవేశించాడు. ఆమె పడుకొని నిద్రపోతూ వుంది. పిల్లవాడు పక్కనేపడి ఏడుస్తున్నాడు. ఆమెని చూసేటప్పటికి నిద్రిస్తున్న అతని శక్తులన్నీ ఒక్కసారి రేగాయి. శరీరం జాలితో, ప్రేమతో, ఉద్రేకంతో ఉడికిపోయింది. గప్పున మంచం దగ్గరకు ఉరికాడు కోర్కెలతో ఉప్పొంగిపోతున్న హృదయంతో ముద్దుపెట్టుకోటానికి మంచం మీదికి వంగాడు. మంచంమీద అజాగర్తగా విస్తరించి పడుకున్న పిల్లదు అటొకకాలూ ఇటొకకాలూ వేసి చేతులు వేలాడవేసి పడుకున్న పిల్లని, తియ్యని కలల బరువుతో వాలిన రెప్పలుగలిగిన పిల్లని నిద్దరలో పమిట తొలగిన పిల్లని, అస్తారబతంగానో, అమాంతంగానో చేతుల్లోకి తీసుకుని ముద్దుపెట్టుకొని కావలించుకుంచే ఎంత బాగుంటుంది ? కానీ—

అతని హృదయం టప్న ఆగిపోయింది. వంగినవాడు వంగినట్లుగానే కొయ్యబారిపోయాడు. ఆమె మంచం మీద అలాగే పడుకొనివుంది—చలనము లేదు. ఆమె ఆత్మహత్య చేసుకుంది.

"తాతా_తాతా'' అని పిల్లవాడు యేడుస్తున్నాడు. అతనికి 'గీతా, గీతా' అన్నట్లు వినబడింది.

———

# లయ తప్పిన హృదయాలు

— శార్వరి

## 20

కొత్త ఉత్సాహంతో తిరిగి మద్రాసు చేరుకున్నది కోమలి. ఈ సారి చదువు అంతా కొత్త. అసలు జీవితానికి తొలి మెట్టు అది. మెడిసిన్ చదవడంలో ఆసక్తి, ఉత్సాహం వుంది. ఇందిర, కోమలి ఒకే గదిని ఎంచుకున్నారు. హాస్టల్‌లో ఇద్దరూ మెడిసిన్ విద్యార్థినులే. ఇందిరకు వైద్యం ఆదర్శం. ఆమెకు డాక్టరై ప్రజాసేవచేసి, ఆదర్శ మహిళ కావాలని కోరిక. రాజకీయాలు కన్న ప్రజాసేవకు వైద్యం చక్కని మార్గం. కోమలికి ఆదర్శాల ముసుగు లేదు. ఆశయాలు వల్లించదు. అది ఆకర్షణ. సమాజంలో గౌరవప్రతిష్ఠలు తెచ్చిపెట్టే వృత్తి.

లెక్చర్లు, ప్రాక్టికల్స్, ఊపిరాడటం లేదు. అనాటమి, ఫిజియాలజీలు వారిని కొత్త ప్రపంచానికి తీసుకువెళ్ళాయి. మానవ శరీరంలోని ప్రతి అవయవాన్ని స్టడీచేయడంలో అనేక బాధలున్నాయి. మృతదేహాన్ని ముట్టుకోవాలంటే శరీరం గగుర్పొడిచేది. చీదరగా వుండేది. నగ్నదేహం చూడగానే షాకింగ్‌గా జుగుప్స కలిగేది. మెడిసిన్ చదివేవారికి రహస్యాలుండవు. సిగ్గుపడవలసిన పని లేదు అంతా సహజం. ఫీలింగ్సుకి, సెంటిమెంట్సుకి స్థానం లేదు. ఆ శవాలను చూడగాచూడగా, చావంటే భయం పోతుంది. అది చావుకాదు. మెడిసిన్‌లో, సైన్స్‌లో ఎప్పటికప్పుడు కొత్త విలువలు ఏర్పడుతుంటాయి. పరిశోధనకు ఎప్పుడూఅవకాశం ఉంటుంది. నిర్లిప్తంగా యోగిగా ఉండగలిగితేనే డాక్టర్‌గా రాణింపు సాధ్యం. ఉద్రేకాలు, కోర్కెలు, కామనలు కంట్రోల్ చేసుకునేవారే డాక్టర్లవగలరు.

రోజులు గడుస్తున్నకొద్దీ అందం, ఆకర్షణ, ప్రేమ విలువలేని పదాలైనాయి. ఒక అందమైన వ్యక్తిని చూచినా, అతని చర్మం వొలిచి, ముక్కలుచేసి చూసే దృష్టి ఏర్పడుతున్నది. అప్పుడు అందం లేదు. ఆకర్షణ లేదు. అలాటి శరీరంపైన ప్రేమ ఏమిటి? అంటే ఒక విధమైన నిర్లిప్తభావన; వేదాంతతత్వం, వైరాగ్యం అలవడుతున్నా యన్నమాట

ఇక్కడ ప్రేమ శూన్యం. ఉన్న దాన్ని ఇంట్లో వదలి రావలసిందే.

వృత్తిలో ప్రేమకు తావులేదు. కోమలికి బ్రతుకుపట్ల, మనుషులపట్ల ఒక విధమైన సినిసిజం అలవాటైంది. పవిత్రత లేదు. రహస్యం లేదు. సెక్సు అనేది కేవలం జంతుప్రవృత్తి....శారీరక అవసరం. దానికి ప్రేమ అని పేరుపెట్టి ముద్దుగా పిలవటం ఫూలిష్‌నెస్.

ఇందిరకు రాజకీయాలపై మోజు తగ్గ లేదు. ఆమెకు సోషల్ గాదరింగ్స్ కావాలి. అక్కడ ఆంధ్ర మహాసభలో, ఇతర సంఘాలలో సభ్యురాలైంది. అక్కడి నుండి క్రమంగా పరిచయాలు, స్నేహాలు పెంచుకోవచ్చు.

ఒకనాడు ఇందిర అన్నది, "కోమలీ, ఇవాళ ఆంధ్ర అసోసియేషన్ వారు హరనాథ్ ఉపన్యాసం ఏర్పాటుచేశారు. ఆయన చాలా తెలివైనవాడు. సినిమా నటుడు."

"పర్సనల్‌గా నా కిష్టంలేదు ఇందూ! రమ్మంటే నీకోసం వస్తాను" అన్నది కోమలి. స్నేహితురాళ్ళను తీసుకువెళ్ళా లని, వారి ముందు తన ప్రత్యేకతను ప్రదర్శించుకోవాలని ఆమె ఆరాటం.

"ప్లీజ్ ...నా కోసం."

"అబ్బ, పాలిటిక్స్ బోర్ బాబూ. నాకు నచ్చకపోతే, ఆయనగారిమొహాన్నే అనేస్తాను. సినిమా నటుడు అయ్యేది, ఆయనగారి బాబు అయ్యేది, ఐ డోంట్ కేర్."

"హరనాథ్ చాలా బాగా మాట్లాడ తారు. యు విల్ లైక్ హిం. నేను హామీ యిస్తున్నాను."

ఆ రోజు మీటింగ్‌కు, మద్రాసు నగ రంలోని తెలుగు పెద్దలు, విద్యావేత్తలు చాలామంది వచ్చారు. అయితే ఆడవారు అంతగా రాలేదు.

ముందు వరసలో ఇద్దరు యువకులు కూర్చుని ఉన్నారు

"వాళ్లెవరూ?" ప్రశ్నించింది మీనాక్షి.

"ఒకతను నారాయణ, ఆంధ్ర స్టూడెంట్సు అసోసియేషన్ సెక్రటరీ. రెండవఅతను రామారావు. మంచి కోటీ శ్వరుని కొడుకు. అతని తండ్రి పెద్ద కంట్రాక్టరట. రాజకీయాలలో పెద్ద చెయ్యి." వారిద్దరూ మీనాక్షికి నచ్చారు.

హరనాథ్ రాగానే నారాయణ వెళ్ళి స్వాగతం చెప్పి, తమ ప్రక్కనే కుర్చీ పెట్టుకున్నాడు. వెంటనే నారాయణ లేచి సభను ప్రారంభించాడు. వక్తను పరి చయం చేశాడు. నారాయణ మాటలు కోమలికి నచ్చాయి. హరనాథ్ కేవలం సినిమా కళను గురించి ప్రసంగించాడు. అతను పొడవుగా, బలంగా వున్నాడు.

మీటింగు అయిన తర్వాత నారాయణ వీరి దగ్గరకు వచ్చాడు. "ఇవాళ ఇందిర గారు కొత్త మెంబర్సును తెచ్చారు. థాంక్స్. ముగ్గురికీ సుస్వాగతం" అన్నాడు. ఇందిర కోమలిని, మీనాక్షిని పరిచయం చేస్తుండగా రామారావు,

హరనాథ్ మాట్లాడుకుంటూ అటుగా వచ్చారు.

"మీ ఉపన్యాసం చాలా బావుంది.'' ముగ్గురూ అతన్ని అభినందించారు. ఆడ వాళ్ళు పొగిడితే అతను పొంగిపోతాడు.

మరుసటి వారం రామారావు ఇందిరకు ఉత్తరం వ్రాసి ఆదివారం సమావేశానికి తప్పక రమ్మనీ, మీనాక్షిని, కోమలిని కూడా తన పక్షాన ఆహ్వానించి తీసుకు రావలసిందని తాజాకలం. ఇందిర ఉత్తరం వారిద్దరికీ చూపించింది

"రామారావుగారు కోటీశ్వరుడన్నావు గదా. అబ్బా, అంత డబ్బు ఎలా సంపాదించారో!'' మీనాక్షి అతన్ని గురించి అనుక్షణం ఆశ్చర్యపోతూనే వుంది.

"సిల్లీ గాల్! అతన్ని చూస్తే అలా అనిపిస్తుందా. వెరీ సింపుల్" కోమలి అన్నది.

ముందుగానే ముగ్గురూ పర్మిషన్ తీసుకున్నారు. మీనాక్షి తనకున్న వాటిలో కల్లా ఖరీదైన చీర కట్టుకుంది. బాగా ముస్తాబైంది.

"మనం సాదా చీరలే కట్టుకుందాం ఇందూ! లేకపోతే వికారంగా వుంటాం. మనం మనంగా కనిపిస్తే చాలు" కోమలి సున్నితమైన విమర్శ మీనాక్షి తలకెక్కలేదు.

''నేను కాబొయ్యే సినిమాస్టార్నాయే. ఈ మాత్రం ముస్తాబు లేకపోతే గ్లామర్ ఉండదు" అన్నది మీనాక్షి! తన అందాన్ని అద్దంలో వివిధ కోణాలలో పరీక్షించుకుంటూ.

వాళ్ళు వెళ్ళేసరికి హాల్ బయట చాలా కార్లు నిలిచి వున్నాయి. పెద్దపెద్ద వారే వచ్చినట్లున్నారు. రామారావు ముగ్గురు యువతుల్నీ చిరునవ్వుతో ఆహ్వానించాడు.

"వెరి గ్లాడ్! మీరు వచ్చారు."

మీనాక్షి అతనికి చెయ్యి అందించింది. షేక్‌హాండ్ కోసం. పురుషస్పర్శకోసం తపించిపోయే జీవి మీనాక్షి. ఏదో విధంగా అతన్ని స్పృశించాలని కోరిక. అతన్ని రాసుకుంటూ నడిచింది. లోపల పెద్ద టీ పార్టీకి ఏర్పాట్లు జరిగాయి.

"హరిగారు రాలేదా!" ఇందిర ప్రశ్నించింది, నాలుగు వైపులా చూస్తూ "అంటే హరనాథ్."

"వచ్చారు, ఆ గదిలో ఉన్నారు. రండి పోదాం "

రామారావు వారి ముగ్గుర్నీ ఆ గదిలోకి తీసుకువెళ్లాడు. అక్కడ అలవాటున్న వారు మద్యం సేవిస్తున్నారు. వారిని చూడగానే కోమలి గతుక్కుమన్నది.

హరనాథ్, నారాయణ ఒకచోట నిలబడి, నవ్వుతూ కబుర్లు చెప్పుకుంటూ, మధ్య మధ్య సిప్‌చేస్తున్నారు.

"భాగ్యవంతుల విందు " హరనాథ్ వ్యంగంగా నారాయణవేపు చూచి, మీనాక్షిని కళ్లతో తాగుతునట్లు అన్నాడు.

"ఐ లైక్ ఇట్" అన్నది, మీనాక్షి పెదాల చప్పరిస్తో

'ఇది డబ్బుకలవారి మరో ప్రపంచం' అనుకున్నది కోమలి.

''రామారావుగారి నాన్నగారు లక్షలు సంపాదిస్తారు. ఫరవాలేదు, 'తాగేయండి.' హరనాథ్‌కు కాస్త 'కిక్' యిస్తోంది.

కోమలికి చిరాకుగా, అసహ్యంగా వుంది. మీనాక్షి ఓ గ్లాసు అందుకుంది, బేరర్ అటు రాగానే

"ఇదని తెలిస్తే వచ్చేదాన్ని కాదు ఇందిరా" అన్నది, ఎంతో బాధగా.

"కోమలిగారు ఓ పాట పాడాలి" మైకంలో అన్నాడు హరనాథ్.

"క్షమించాలి, నాకు పాటలు రావు"

"నే పాడనా" అంటూ మీనాక్షి రెండు పాటలు పాడింది. ఆమె పాటలు, అసలే మత్తులో ఉన్నవారికి మరి కాస్త మైకం కలిగించాయి.

మందు మీనాక్షిమీద బాగా పని చేసింది. పైగా హుషారు ఎక్కువైంది. హాస్టల్‌కు తిరిగిరాగానే కోమలి అన్నది, "ఇలాంటి పార్టీలకు, మీటింగులకు నన్ను పిలవద్దు, ఇందూ! నేను రాలేను. నాకు అలాటివి పడవు."

మర్నాడు అనేకసార్లు ఇందిర నారాయణ ప్రస్తావన తెచ్చింది. అతని గుణగణాలను పొగడటం ప్రారభించింది.

'ఇందిర గానీ నారాయణను ప్రేమించటం లేదుగదా' అనే అనుమానం కలిగింది కోమలికి. వారిద్దరూ చాలా క్లోజ్‌గా ఉంటారు. మన సమాజంలో ప్రేమించుకోవటం కష్టం. పరిచయాలు స్నేహంగా, స్నేహం ప్రేమగా మారాలంటే మాటలా!

ఆరాత్రి శోభ కలలోకి వచ్చింది తెల్లవారి లేచిందే ఇంటికి ఉత్తరం రాసింది. తమ్ముడు రాజుగురించి, చెల్లెళ్ల గురించి వ్రాసింది. శోభకు పెళ్లి సంబంధాలు చూస్తున్నారేమో! పెళ్లి ఆలోచన రాగానే నవ్వువచ్చింది. శోభకు పెళ్లయితే తనకేమిటి? "శోభకు త్వరగా పెళ్లి చెయ్యండి" అని వ్రాసింది కారణం, మీనాక్షి ప్రవర్తన, ఇందిర మనస్సు,...తనను ప్రేరేపించాయా! తన హృదయంలో ప్రేమ బీజాలు నాటుకున్నాయా! ఎప్పుడు లేనిది తాను ఈ విషయాలు ఆలోచిస్తున్నది. అది సహజమా!

ఇందిర నారాయణ గురించి వ్రాద్దామనుకుంది. కాని అమ్మకేం తెలుసు, ఇందిర ఎవరో, నారాయణ ఎవరో! స్త్రీ పురుషుల సంబంధాలవేపు తన మనస్సు పోతున్నదేమిటి, కొత్తగా!

తర్వాత ఒకసారి ఇందిర తమని తోడురమ్మని కోరింది కానీ, కోమలి కిష్టం కాలేదు. ఇందిర నారాయణను ప్రేమిస్తునట్లు అనుమానం మనసులో. వారి మధ్య తనగానీ మీనాక్షి గానీ, ఉండడం సభ్యత కాదు.

నారాయణ యువకుడు. అతనికీ సోషల్ గాదరింగ్స్ అంటే ఇష్టం పైగా అసోసియేషన్ సెక్రటరీ. అలాగ సంఘాలు, సమావేశాలు ఏర్పాటుచేసే వారందరూ పైకి సమాజసేవ అనీ, సాహిత్య సేవ అనీ చెబుతారు గానీ వాటికి స్వప్రయోజనాలే మూలకారణాలు. వాటి ద్వారా పెద్దవారి స్నేహాలు, పరిచయాలు సంపాదిస్తారు. తమ స్వంత పనులు చేయించుకుంటారు. చివరకు ఆ సంఘాలు, సంస్థలు రూపురేఖలులేకుండా మాయమైపోతాయి. నారాయణ కూడా అంతేనేమో? ఇందిరకూడా అంతేకావచ్చు. వీరిద్దరి ప్రేమనౌక ఒక దరికి చేరితే తీరి పోతుంది.

అలాగ ఆలోచిస్తున్న కోమలి ఒక రోజున అడగనే అడిగింది, "నువ్వు నారాయణను ప్రేమిస్తున్నావు కదూ ఇందిరా?" అని. ఆమెకు మీనాక్షి ప్రేమను గురించి తెలుసు. ఆ అను భవాలు ఇంకా పచ్చిగానేవున్నాయి. తన సన్నిహిత మిత్రులు ఎవరు ప్రేమలో పడ్డా, కోమలి తల్లడిల్లిపోతుంది.

"ప్రేమా? నాకా ఆలోచనే రాలేదు కోమలీ, ఇంతకాలం. అసలు మనకు ప్రేమించే తీరిక ఎక్కడోయ్. అయినా అతనికి నేనంటే లైకింగ్ ఉందని అను కోనా" అన్నది, తాపీగా ఇందిర.

"క్వాయ్య్ కోయ్ కోతలు. నువ్వంటే ఇష్టమే. పార్టీకి ఆహ్వానించింది తనేగదా. మీరిద్దరూ ఏకాంతంగా కలుసు కుంటుంటారు అప్పుడప్పుడు. అవునా, కాదా?" నిగ్గతీసి అడిగింది కోమలి.

"కలిస్తే? అంత మాత్రాన ప్రేమించు కోవాలని వు.దా?"

"పోనీ ప్రారంభం."

"నారాయణ అలా ఎన్నడూ ప్రవ ర్తించలేదు. నాకే అలాటి అనుమానం రాలేదు."

"బహుశా అవకాశం యిచ్చివుండవు. లేదా ఇంకా నిన్ను స్టడీ చేస్తున్నాడేమో? లేదంటావా సిగ్గో, భయమో అయివుం డాలి"

"చాలా థాంక్స్ కోమలీ. నేను కని పెట్టలేని విషయం నువ్వు కనిపెట్టావు. నిజంగానే అతనంటే నాకిష్టం, కాని నా ఇష్టానికి ప్రేమకోటింగ్ యివ్వలేదు. నువ్వు చెప్పాక ఇప్పుడు నిజమేనేమో ననిపిస్తోంది. ఆలోచిస్తాను కానీ ఒక్క సలహా చెప్పు. మేం ప్రేమించుకోవటం సాధ్యమేనంటావా?"

కోమలి పకపకనవ్వింది. "ఏం నంగ నాచివమ్మా మరీ."

* * *

ఒక రోజున మీనాక్షి కోమలి గదికి వస్తూనే షేక్‌హాండ్ ఇచ్చింది ఇందిరకు. "థాంక్యూ సోమచ్ ఇందూ... నా కృత జ్ఞతలు ఎలాచెప్పుకోవాలో అర్థంకావటం లేదు."

''ఏమొచ్చింది మీనా, ఏదొచ్చినా నిన్ను పట్టడం కష్టం."

"ఇవాళ రామారావుతో కలిసి, అలా అలా గాలిలో తిరిగేసి వచ్చాను"

''మైగాడ్... నిజమా!"

ఇద్దరికీ చెప్పలేనంత ఆశ్చర్యం వేసింది

మగవాళ్లను వలలో వేసుకోవడంలో మీనాక్షికి ఏదో ప్రత్యేకమైన నేర్పు న్నది. అదొక కళ, టెక్నిక్. ఎలాంటి వారినైనా ఇట్టే అయస్కాంతంలా లాగే స్తుంది. అసలు మీనాక్షిని చూచి ఈ మగాళ్లు ఎలా మోహిస్తారో అర్థం కాదు - అనుకుంది కోమలి.

"నమ్మమంటావ్?" కోమలి అన్నది.

''నువ్వు ఏది నమ్మావు గనక, ఇది నమ్మడానికి. నీకు తెలీదు. రామారావుకు హోటల్ అశోకలో ఒక గదివుంది. అక్కడికే తీసుకువెళ్లాడు. ఐ లవ్ హిం" అన్నది.

"చచ్చాం. హోటల్ గదికి వెళ్లావా, సిగ్గులేకుండా...ఊ, తర్వాత?"

"తర్వాత ఏమిటి! మామూలే. వెళ్లింది ఎందుకు! మా ఇద్దరికీ ఇష్ట మైంది. మధ్య నీ చప్పనాతి తనం ఎందుకు. దిష్టి తగిలేను" నవ్వుతూనే అన్నది మీనాక్షి.

కోమలి నవ్వింది: "నిజమే మీనా. నాకు, ఇందిరకు జీవితం అనుభవిం చడం చాతగాదు. నిన్ను అభినంది స్తున్నాం."

"అలారండి శ్రోతకి. అమ్మాయిలూ, మీరు మెడిసిన్ పాఠాలు నేర్చుకుంటు న్నారుగానీ, జీవితానికి అవసరమైన ప్రేమపాఠాలు నేర్చుకోవటం లేదోయ్. ఐ పిటీ యూ బోత్. మిమ్మల్ని చూస్తే ఏడవాలనిపిస్తోంది. ఏడ్చినా, నా కళ్లలో నీళ్లురావు గనక, ఏడ్పుమానేసి, మీ అమాయకత్వానికి నవ్వేస్తాను."

మీనాక్షి వెళ్లాక ఇందిర దిగులుగా కూర్చున్నది.

కోమలి పక్కనే కూర్చుని. "ఆ రామారావును నమ్మడం ప్రమాదం. అతనికన్న నారాయణే మేలు. కేవలం డబ్బుచూసి మనుషుల్ని ప్రేమించ కూడదు ఇందూ! నారాయణ ప్రేమను తిరస్కరిస్తావా?" కోమలి లాలనగా అడిగింది

''అసలు ఆయనగారు ప్రేమిస్తేగద!"

తర్వాత వారంలో హరనాథ్, వారి ద్దరికీ రెండు ఉత్తరాలు వ్రాశాడు. రెంటిటి సారాంశం ఒక్కటే... తన ఇంట్లో చిన్న 'గెట్ టుగెదర్' ఏర్పాటు చేస్తున్నాడట. నారాయణ, రామారావు కూడా వస్తున్నారట. తమని కూడా వీలుచేసుకుని తప్పక రమ్మని ప్రార్థన

''వెడదాం కోమలీ. ఆ రామారావు మొహం చూడాలి. మీనాక్షి ప్రేమలో పడ్డ మగాడు ఎలావుంటాడో చూడాలి" అన్నది ఇందిర.

హరనాథ్ ఇల్లు చిన్న బంగళా. అందంగా, సౌకర్యంగా వుంది. ఒక గది నిండా పుస్తకాలు, గోడలకు సినిమా తారల ఫొటోలున్నాయి. నేలంతా మొజాయిక్ చేసి, ఆపైన కార్పెట్ పరచివుంది. ఖరీదైన సామగ్రి చాలా వుంది. మొత్తంమీద ఇల్లంతా ఆర్టిస్టిక్‌గా వుంది.

ఇంట్లోకి వెళ్లగానే కోమలిదృష్టి పుస్తకాలపై పడ్డది. "మీ లైబ్రరీ చూడ వచ్చా ?"

"విత్ ప్లెజర్."

"హోటల్‌నుంచి భోజనం వచ్చే లోపున, కాఫీ" అంటూ తనే స్వయంగా అందరికీ కాఫీలు సర్వ్ చేశాడు హరనాథ్.

"మీ పుస్తకాలనుబట్టి మిమ్మల్ని చదువుతున్నాను. కానీ మీరు అర్థం కావటంలేదు. అభ్యుదయ చిత్రకళా ఖండంలా వుంది మీ వ్యక్తిత్వం – మన స్తత్వం." కోమలి హరనాథ్‌ను చూచి కామెంట్ చేసింది.

"ప్రయత్నించండి. అర్థంచేసుకో గలరేమో ! పుస్తకాలు చూచి, మనుషుల తత్వాన్ని చదవదలిస్తే, మీరు ఫెయిల్ అవుతారు. నేను నటుడిని. బాగా నటించ గలను. అవసరం ఉన్నా, లేకున్నా, అవన్నీ కొంటాను. షోకోసం. పై మెరుగులు చూచి లోపలి సరుకు విలువ కట్టడం కష్టం.

షెల్ఫ్‌లో చాలా నవలలు-శృంగార నవలలు ఉన్నాయి. ఆర్ట్‌కు, నటనకు సంబంధించిన విలువైన ఖరీదైన గ్రంథాలు చాలా వున్నాయి.

"అవునండీ, మిమల్ని అర్థంచేసు కోవటం కష్టం."

"కానీ స్టడీచేయడం తేలిక. కారణం చెప్పమంటారా ! పిరికితనం. నేను పిరికివాణ్ని. ఆడవాళ్లంటే నాకుభయం."

"నేనూ ఆడదాన్నేగా."

అంతలో రామారావు, నారాయణ వచ్చారు. సంభాషణ మరొక వేపు తిరిగింది. నారాయణ, ఇందిర అవతలి గదిలోకి వెళ్లారు. చాలా దీర్ఘంగా చర్చిం చుకుంటున్నారు వారిద్దరికీ లోలోపల ఒకరంటే ఒకరికి ఇష్టం. బయట పడరు. విచిత్ర మనస్తత్వాలు. ఇద్దరూ భయస్థులే. మీనాక్షి వేరు. తనకు కావల సిన దాన్ని, కోరి సంపాదించగలదు.

హాస్టల్‌కు తిరిగి వస్తూ కోమలి అడి గింది.

"ఏమంటున్నాడు, మీ హీరోగారు?"

"అతనొక మిస్టరీ"

"పోనీ నువ్వు కదిలించకపొయ్యావా?"

"నేనా?"

"ఎం, తప్పా ? ఇద్దిరిలో ఎవరు ముందు అనే ప్రశ్నలేదు."

"ఇంకేం నిర్ణయించుకోలేదు కోమలీ. నాకు అతన్ని నిజంగా ప్రేమిం చాలనిపిస్తే, అలాగే చేస్తాను" అన్నది ఇందిర.

కోమలి నిట్టూర్చి ఊరుకుంది.

(సశేషం)

——

## 5

పదిరోజుల తర్వాత గోదావరి వచ్చింది.

"'అసలుకథ' ప్రారంభించండి..."

"అసలు కథా ?..." ఎటోచూస్తున్న సాగరం చూశాడు, గోదావరి ముఖం నిండుకడవలాగుంది.

అసలు కథ యిప్పడే చెప్పలేను. ఈ వాళ చెప్పలేను, కాదు, అసలుకథ ఎలా పూర్తవుతుందో నాకే తట్టడంలేదు. ఎప్పుడు పూర్తిఅవుతుందో ఇప్పుడు చెప్పలేను. యీవాళ శింకేం చెప్పను..." అంటూ తనలో తాననుకుంటున్నట్లుగా అన్నాడు.

"ఐతే...... మీరు చెప్పని కథ ఒకటి రాసుకొచ్చాను. ఇవాళ దాన్ని చదుకోవడం మీవంతు."

"మీరే! - కథ రాసుకొచ్చారా? చూశారా చూశారా! నేన్చెప్పలేదూ, మీరు రాస్తారని. అప్పడే మీరు కథకు రాలు అవుతూన్నారన్నమాట......," ఉత్సాహంగా అతనంటున్నది వినక్కటే గోదావరి కాగితాలు బల్లమీద పెట్టింది.

"ఉహూ నేను చదవను. మీ ఆడ వాళ్లు రాసినవి నాకు మాత్రం విసుగు అందరికీ ఎంతో బాగుంటున్నాయి నిజం. మాటకు పదిమాటలు పెంచి ఎంతో వయ్యారంగా నాజూగ్గా-చప్పున విషయం పూర్తికానీకుండా ముస్తాబు చేసుకుంటూన్నట్లుంటాయి. పది పేజీల్లో చెప్పేది అరపేజీలో ఉంటేనే తప్ప నేను చదవలేను. అందరూ నాలాంటి పాఠకులే ఉంటే ఇప్పుడు నడుస్తూన్న పత్రికలు, వారపత్రికలు........."

"క్షమించండి. అంతతో ఆగండి... నేనేం విసుగుపుట్టిద్దామని రాసుకురాలే దనుకుంటున్నాను-దయచేసి చదవండి."

"మీరే చదవండి! వింటాను, వినడం యీవాళ నావంతు."

"తర్వాత తాపీగా చదువుకోవచ్చు గదా..."

"ఇప్పడే వినాలి!..."

"చదవక తప్పదా?"

"వినిపించటం మీకు యిష్టంలేక పోతే మానెయ్యండి..."

గోదావరి చదవడం మొదలెట్టింది.

'నాయనమ్మపేరు పెట్టారు గోదావరమ్మ అని. తర్వాత గోదావరి అనే పిల్చారు. తన పేరు తనకెంతో ముచ్చట గోదావరికి. తెలుగుపిల్లకు తెలుగునేల పులకరించే నది పేరు ఇదొక్కటే చెప్పకోదగ్గ అదృష్టం తనకి.

అమ్మని నాన్న లేవదీసుకొచ్చాడని విన్నది. లేచివచ్చిందనీ విన్నది అమ్మా నాన్నా పెళ్ళిచేసుకున్నారో లేదో, చేసుకుంటే ఎలాంటి పెళ్ళిచేసుకొన్నారో తెలీదు. ఇద్దరూ చాలా మంచివారు. కాబట్టే వాళ్ళు లేరు. మీలాంటి వాళ్ళకిక్కడ జాగాలేదు పోండి అని యీ లోకం అంది

అమ్మ చివరి దశలో మేనమామ వచ్చాడు. అమ్మ తమ్ముడట. తీసుకొచ్చాడు. మేనమామ ఇంట్లోనే వయసు వచ్చింది. మంచీ చెడ్డా తెలుసుకోవడమూ వచ్చింది.

అత్తమెడలోఉన్న గొలుసూ నెక్లెసూ అమ్మ మెడలో ఉండడం తనకు బాగా తెలుసు. నాన్న పెట్టినవే. అత్తను అక్కా అని పిలవమంటూండేవాడు మేనమామ. అత్త అలా పిలవనివ్వలేదు.

అత్త బుజ్జిగాణ్ని ప్రసవించినప్పట్నించీ గోదావరి చేతుల్లోనే పెరిగాడు వాడంటే గోదావరికి పంచప్రాణాలు.

* * *

తనేదైనా పనిచేసి సంపాదించాలనే పరిస్థితులు కనిపించాయి. పెద్ద చదువు లేదు. చేతిపనులు రావు. పాటరాదు. పెదాలమీద చిరునవ్వు కనిపించే పాపాన పోదు. ఏడుపూ నవ్వూరాని ముఖం. తెల్లటిదనిపించుకోదు. అందకత్తె కాదు. బలంగా ఎదిగే శరీరతత్వం కావడం వల్లనో, ఇంటిచాకిరీ వల్లనో మోటుపల్లెటూరు గొడ్డు అనేస్తారు కూడ. ఇహ తనేంచేసి సంపాదించగలదు? ఎలాగ సంపాదించగ దు? తల తిరుగుతున్నట్లుండేది...

బుజ్జికేదో నయంకాని జబ్బు పట్టుకుంది. నయంకావాలంటే వందలు కావాలి. గోదావరి మనసు గిలగిల తన్నుకుంది. తల్లి అవాలంటే నవమాసాలు మోసి ప్రసవించనక్కర్లేదు. ఇది గోదావరికి తెలిసింది అప్పుడే.

మేనమామ పిల్లాడికి ఖర్చు పెట్టలేడు. పెట్టడు. ఋణానుబంధం రూపేణ పశుం పత్నీ సుత...అనేరకం. అత్తకు ముడుపులు కట్టడం, "అంతా వాడిదే భారం కదమ్మా? ఎక్కణ్ణించొస్తాయి? వందలు వేలూ పోస్తేమాత్రం వాడి యిది లేంది ఏం ప్రయోజనం?" అంటూ, ఆమెతో ఈమెతో అనడం మాత్రమే తెలుసు. "కాదూ మరీ..." అనడమే ఆ ఈమెకూ ఆమెకూ తెలిసింది గూడా.

ఎలాగైనా సంపాదించాలి. ఏంచేసైనా సంపాదించాలి బుజ్జిగాడికోసం అని అనుకుంటున్న సమయంలోనే గోదావరి కంటబడింది, తమాషాగా, కనీ వినీ ఎరగని ప్రకటన...

ఇవీ అవీ తెచ్చుకొనే దుకాణం కెళ్ళింది. నయాపైసాకి రెండు అగ్గిపుల్లలు విడిగాకూడా దొరుకుతాయి ఆ కొట్లో. రోజూలాగే వికారంగా నవ్వుతూ ఆ దుకాణంవాడు, "అమ్మలూ! చూశావా



మన దుకాణం పేరూ మనపేరూ అచ్చు కెక్కేసింది! పేపర్లో ఏయించేశా..." అంటూ ఆంధ్రపత్రికంతముఖం చేసుకొని ఎక్స్‌ట్రా సైజు సైజు పత్రికొకటి మడత కాగితంలాంటిది 'మహద్వాణి' యిచ్చాడు.

గోదావరి దాంట్లో చూసింది మరో ప్రకటన. అదే కనీవినీ ఎరగని ప్రకటన.

* * *

తనంటే అమిత వాత్సల్యం గల తెలుగుటీచరు బదిలీఅయి అనకాపల్లిలో ఉంది. ఆవిడ ఇంట్లోనే దిగింది. అసలు సంగతేం చెప్పలేదు. పక్కగ్రామంలో చుట్టాల్తో పనిఉందని చెప్పింది. పట్నంతో పోలిస్తే మూడుమైళ్ళకి రిక్షావాడడిగింది కారుచవకనిపించింది. పాపం! కడుపు మంట ఏంవొచ్చినా కొంతలో కొంత అన్నట్టుంది వాళ్ళకి. కాళ్ళున్నంతవరకు తొక్కడమేగద అన్నట్టూను. ఇద్దరూ ముగ్గురూ నలుగురూ అయితే మరీ చవక. ఇరవైపైసలే...

* * *

"ఇంత డబ్బు దానికెక్కడిదీ అంటూ

అసలెలాగొచ్చింది అని? ఇదెం చేసి సంపాదించి తెచ్చిందో మరి?" - ఇవీ గోదావరికి చివరకు దక్కిన మాటా మాణిక్యమూనూ వెయ్యా వాళ్ళకే యిచ్చేయలేదని అత్తమంట ఐదువందలే యిచ్చింది.

డాక్టరుకి అయిదువందలు యిచ్చింది. బుజ్జిగాడిని తన పిల్లాడిలాగ చూసుకుంటా నన్నాడు. వయసుమళ్ళినవాడేమో ధర్మానికీ దేవుడికీ భయపడే రకం. బుజ్జికేం ఫర్వాలేదు. హాయిగా ఉండడమంటే ఎలా గుంటుందో అప్పుడుతెలిసింది గోదావరికి.

డాక్టరుకి డబ్బివ్వడం మేనమామకు ఎవరో జేబు కొట్టేసినట్లుండేదేమో... "నేనీకు పరాయివాడినా? అసలు నిన్నెందుకు తెచ్చానో తెలుసా? పరాయి దేంకాదు, అక్కాచెల్లెళ్ళాగుంటారు. పనికీ, 'దానికీ' సర్దుబాటుగా అని... అలాంటప్పుడు ఇదా నువ్వు చేసింది? మీ అమ్మకు తగ్గ కూతురనిపించుకున్నావు- అది రెండాకు లెక్కువ చదివితే నువు నాలుగు..." అంటూ ఎవరూలేంది చూసి దగ్గరగా రాబోయాడు. చెయ్యిచేసుకుంటా డనుకుంది - కాని నవ్వాడు... చదువుతూన్న గోదావరి గొంతు బొంగురు పోయింది. చదవలేకపోతోంది

సాగరం తెప్పరిల్లి ఆమెవంక ఆయోమయంగా చూశాడు. గోదావరి సంభాళించుకొని మళ్ళీ చదవసాగింది...

"...అక్కడ్నించి పారిపోయింది... గోదావరి దురదృష్టవంతురాలు-అంతే! ఇహ గోదావరి అక్కడకు వెళ్ళలేదు- వెళ్ళదు! బుజ్జిగాడికోసం ఎటువంటి దేవుళ్ళనైనా నమ్ముతుంది. వాడికోసం మొక్కుతుంది - డాక్టరుకూడా అన్నాడు 'వాడికేం ఫర్వాలేదని!' కథ వినిపించడం అయిపోయింది

* * *

## 6

సాగరం చెప్పిన ఇంట్లో గోదావరి ఉంటున్నది. రోజూ నందనంకి వస్తూంది. సాగరం ఏమీ చెప్పడంలేదు. నెల అవగానే అయిదు వందలూ బల్లమీద ఉన్నాయి. గోదావరి తీసుకోలేదు...

"బుజ్జికోసం-! బుజ్జికని డాక్టరుకి పంపొచ్చు!" అన్నాడు. తీసింది. "అసలు కథ చెప్తారా?" అన్నది

"అదే ఆలోచిస్తూన్నాను. యింతలో పూర్తికాదు."

"పోనీ మరేదేనా చెప్పొచ్చుగా..."

"అసలు కథ మధ్యలో మరో కథ రాదు... మీరేదేనా రాసుకొచ్చుంటే వింటాను, పోనీ చదువుకుంటానీసారి..."

గోదావరి అందుకోసమే ఎదురుచూస్తున్నట్లుగా కాగితాలు బల్లమీదుంచింది. సాగిరం తీసి చదవడం మొదలెట్టాడు.

"గోదావరికి ఎక్కడా ఉండడానికి చోటు ఉండదేమో, తన పేరులో తప్ప... చదివి సాగరం ఉలిక్కిపడ్డాడు, తేరుకుని చదవసాగాడు - "అతను యీ విజ్ఞ

అక్కడ ఉంచాడు — వాడు రాడు, యిదే అతని దగ్గిరికి పోతాఉంటుంది."

"కొరకరాని కొయ్యలాగుందిరోయ్ !"—

"నాల్రోజులు మజా తీరాక వాడొగ్గేసే వరకే, తర్వాత సంతలో జంతికే..."

ఇవి ఎవరో చదువూ సంస్కారం లేనివాళ్ళు వయస్సుముదిరినవాళ్లూ అన్న మాటలు కావు. పెద్ద పుస్తకాలు పట్టుకుని, మంచి బట్టలు వేసుకుని విద్యావంతుల మనీ, సంస్కారవంతమైన కొత్త రక్తం మాలో ప్రవహిస్తున్నదని అనుకుంటూన్న వాళ్ళు రోడ్డుమీదా, మదుంగట్లమీద చేరి పలికే సహజమైన పలుకులు.

చదువూ సంధ్యాలేని అనాగరికుల్లాగ కనిపించే ఆడవాళ్ళు గోదావరికి బాగా నచ్చారు. వీళ్ళు చాటుమాటుల నుండి మాటలు విసరరు. మొహంమీద మొహం పెట్టి అడిగేస్తారు. నొప్పించాలని ఏదీ అడగరు. సూటిగా అడుగుతారు—"ఆరు నీకేం పౌతాడమ్మా ? మంతరసానిగా వొచ్చేరాండీ ?"

"ఇద్దరు, నేకపోతే ముగ్గురు... సెప్ప డాన్కిక్కడూ గోర్నమెం టంపితే దిగి నారు కాదా తవఁరు...?" యిలాగడుగు తారు, యింకా, "ఆబాబు నిన్ను పెళ్లాడే స్తాడా?" అనికూడా.

గోదావరి ఇక్కడా ఉండలేదు... ఉండలేదు !— పూర్తయింది. తలెత్తి చూశాడు సాగరం. గోదావరి అక్కడ లేదు. అవతలకి పరుగెత్తాడు.

* * *

ముందుపోతున్న రిక్షాను వెనుకవస్తు న్నది కలుసుకుని కలిసిపోయినట్టు జోరు తగ్గించుకుంది.

"ఎక్కడికి ?"—"తెలీదు ; కాదు- స్టేషనుకి."

రెండురిక్షాలు మాట్లాడుకొంటున్నాయి శారదానది వంతెనమీద. అప్పుడే రైలు వంతెనమీద రాజమండ్రి వెళ్ళే బండి జోరుగా పోతోంది.

"కథానందసాగరాన్ని ఎందులో తోసేయమంటారు ? దాని గతేమిటి. దాన్నేం చేసిపోతున్నారు ?"

"తనకుమాలిన ధర్మం లేదు -నా దారి నేను చూసుకోవద్దా ?"

"ఆ దారేదో చెప్పండి."

"ఏదారీ లేకపోతే..."

"ఆగండి ! ఆ పేరు నాకిప్పుడు భయంకరంగా కనిపిస్తున్నది. తలుచు కుంటే దేవతారుతల్లిగా కనిపించే ఆ పేరు నోరు చాచుకుని చూస్తున్న రాక్షసిలా కనిపిస్తున్నది..."ఓయ్ రిక్షా !" అంటూ రిక్షా తొక్కుతున్న వాడిని చూశాడు—

రిక్షావాళ్లకళ్లు కూడబలుక్కున్నాయి. రెండూ వెనక్కి మళ్ళాయి.

ట్రంకురోడ్డుని ఆనుకుని ఉన్న గోదా వరి ఉంటున్న ఇంటిపద్ద దిగారు. ఇద్దర్నీ చూసి వంటచేసి తెచ్చి నిలబడిఉన్న తలుపులమ్మ నోరు తెరుచుకుని ఆశ్చ ర్యంగా చూస్తున్నది.

* * *

"మీరు వివాహం చేసుకొంటేనే మంచిది!"

"కావచ్చు!..."

"నా చేతనైనంత సహాయమూ చేస్తాను..."

"చేసుకుంటానే అనుకోండి. అప్పుడు కథానందసాగరం ఏమౌతుంది?"

"దెబ్బకుదెబ్బ తీర్చుకున్నారే! సరదా తీరింది గద..., ఏదో అవుతుంది... సాగరం... బంగాళాఖాత సాగరం... ఉందిగా!"

ఈసారి గోదావరి ఉలిక్కిపడింది; మళ్ళీ, "ఏం వివాహితురాలు నెలకు అయిదొందల విలువ చెయ్యదా?" అంది.

"అంతకంటే కావలసిం దేముంది? ధన్యుణ్ణి! బంగార్లా రాయండి. జీతమూ పెంచుకోండి..."

"అప్పుడు రాయలేకపోతానేమో, రాయనివ్వరేమో-"

"అలాగా?...ఏదో అప్పుడు చూసుకోవచ్చు. మీరేదేనా యిప్పటికీ నిర్ణయించుకొని ఉంటే, నేను, నా సహాయం సిద్ధంగా ఉంది. ఎవర్ని చేసుకోవాలనుకుంటున్నారో కాస్త చెబితే..."

"ఆయన చేసుకోడు-!"

"ఏం?"

"నే నతనికి బురదయేరులాగే కనిపిస్తానట..."

"నిరాశపడకండి, ప్రయత్నిద్దాం, నచ్చజెపుతా నతగాడికి..."

"ఎవరండీ అతగాడు? నేనే మిమ్మల్ని అడుగతున్నాను!"

"ఆ!! అటువంటి దేమీలేదా? ..."

"లేదు!"

"చూడమన్నారా?"

"ఏమిటి చూస్తారు?"

"మీకు నచ్చినవాణ్ణి చేసుకోవచ్చు-"

"నాకు ఎలాంటివాడు నచ్చుతాడో మీకు తెలుసన్నమాట?"

" ... ... ..."

"మాట్లాడరేం.. పోనీ ఇలాంటివాళ్లని చేసుకుంటే బాగుంటుందని మీరే అంచనా వేసుకొని వెతుకుతారన్నమాట."

"ఔను..."

"అవసరం లేదు!"

"వివాహం చేసుకోరా?"

"చేసుకోనని నేనెప్పుడూ అనలేదే... చేసుకుంటాను-చేస్తుకుంటాను - చేసుకుంటాను! సరా?"

"ఇంత అల్లరి పెట్టగలరని ఎవరూ అనుకోలేరు మిమ్మల్ని చూసి."

"ఇప్పుడు మీరు అనుకుంటున్నారు, చాలు. నే నెలాంటి అల్లరి చేసేదాన్నో, కొమ్ములు మొలిపించుకోవాలనుకుంటున్న అబ్బాయిల్ని కోరి కయ్యానికి పిలిచి నట్లుగా ఎంత తికమకపెట్టేదాన్నో మా టీచరు దగ్గిరలోనే ఉంది అడగండి చెబుతుంది..."

"అలాగా! శబరీనది పొంగి కలుస్తు



న్నప్పుడు ఉరకలు గోదావరి అలాగే ఉంటుందా..."

"అది పచ్చి ఒండుబురద కాలం. ఇప్పుడు వరద తీసిన తర్వాత కాలం."

"నిండు గోదావరి, నింపాది కాలం— ఏకాలమైనా గోదావరి చివరికి చేరేది బంగాళాఖాతమేగా .." అంటూ పూర్తి చేశాడు సాగరం. గోదావరి అతని ముఖం లోకి పరీక్షగా చూసింది. చివరిమాట ఏదో ఉద్దేశంపెట్టుకొని అనాలని అన్న కొంటెతనం కనిపించలేదు "బంగాళా ఖాతం కూడ సముద్రమే గదూ. సము

ద్రానికే సాగరం అనీ అంటారు గదూ?" అని అడిగింది గోదావరి ఏమీ తెలీనట్టు.

"సముద్రం, సాగరం, పయోధి, ఉదధి, జలధి యింకా యింకా చాలా చాలా" అంటున్న సాగరాన్ని చూసి గోదావరి ఫక్కున నవ్వింది. ఆకాశంలో మేఘంలేకుండా ఉరుముతో పెద్ద మెరుపు మెరిసినట్టనిపించింది సాగరానికి. ఆమె నవ్వడం చూడ్డం అదే తొలిసారి గోదావరి నవ్వి తక్కున సిగ్గుపడుతూ తల వాల్చేసుకుని తల ఎత్తకుండానే గాలితో మాట్లాడుతున్నట్లు మెల్లగా, "అప్పుడు 'సాగరం' అంటాను అని, ఆ పేరే ఎందుకంటున్నానో నాకు తెలీకుండా నే అన్నాను మీ ధోరణి సముద్రం కెరటాల్నే ఎందుకు స్ఫురింపజేసిందో అప్పుడు ఆలోచించలేదు అప్పటికింకా నా పేరు గోదావరి అని మీకు తెలీదని నాకు తెలుసు. నా పేరు గోదావరి అని నాకు తెలిసే మీకా పేరెందుకు పెట్టానో ఆలోచిస్తూంటే కొంచెం కొంచెం ముడి విడుతున్నది. తర్వాత నన్ను 'మీరు' అంటున్నప్పుడల్లా అదొకలా ఉండిన దెందుకోఅదీ తెలిసిపోతున్నట్లుందిప్పుడు. గోదావరి అని పిలిస్తే బాగుండుననిపించినదేమిటో. 'సాగరం' అని పేరెట్టించిందేమిటో ఆ దొంగ దొరికిపోయింది. ఇన్నాళ్ళుగా ఆ దొంగ ఎక్కడ దాగి ఉందో అదీ తెలిసిపోయింది. ఇక దాచినా దాగదు. పొరలన్నీ పోయి నిజం నాకు చిక్కింది. ."

"ఇంత చిత్రంగా మాట్లాడుతున్న మీరు అప్పుడు, 'కళింకోట' ఊళ్లోని మగువ అనే ఆమె...' అని దొంగెత్తుగా రాయాలనే రాశారు కదూ? నిజం చెప్పండి!" అన్నాడు సాగరం. 'ఔను' అన్నట్లు ఊరుకొంది గోదావరి.

"అంటే ఆరంభంలో నన్ను మీరే తికమకలో పెట్టేసి ఉంచారన్నమాట! ఎంత సాహసం మీది!"

"సాహసంకాదు-అవసరం. నేనేదో పెద్ద రచయిత్రిలాగో పండితురాల్లాగో మీ రభిప్రాయపడితే నాకు పనియివ్వరు. మీ ప్రకటనలో రచయిత్రి అయితే మరీ మంచిది అని లేదు - నాకు ఆ జీతం కావాలి మరి. అంచేత నాకట్టే పరిజ్ఞానం లేనట్లుగా మీ రనుకోడం మంచిదనిపించి అలా చేశాను. తెలుగు బాగా చదువుకున్నాను. రూపకాలంకారాలు ఉపమాలంకారాలు - ఉప్మా, కాఫీ అలంకారాలు కాచులెండి-లాంటివి తెలుసు. అందుకే తెలుగు టీచరమ్మగారికి నామీద చాల మక్కువ. తెలుగులో మాత్రం హైస్కూలంతటికీ బ్రహ్మాండమైన మార్కులు తెచ్చుకున్నాను. అంతే ఎందుకేనా మంచి తెలుగు బాగా చదువు అంటే మరికొంత చదివాను. యీ రోజుల్లో తెలుగు రావడం ఒక చదువులాగ పరిగణించరు నేను చదువుకొన్నదానిగానూ లెక్కలోకిరాను తెలుగువాళ్లకి. మీ ప్రకటనలో మరీ మంచిది అన్నారేగాని, విధిగా



యువ

నేర్చిఉండాలి అనలేదు. నేనేం రచనలు చేసేంతవరకూ రాలేదు. ఏదో కొద్దిగా చదివానేగాని కథలు నవలలు కొత్తగా వస్తున్న పుస్తకాలతో నాకట్టే పరిచయము లేదు. ఇంకా నయం! రచయిత్రి కావలెననో, రచన వచ్చితీరాలనో ప్రకటించి ఉంటే ఒక నమస్కారం పెట్టేసి ఉండేదాన్ని..." —సాగరం నాగసరం వింటున్నట్లు వింటున్నాడు—గోదావరి చెప్తూనే ఉంది, "ఎలాగైనా సంపాదించాలి, ఏం చేసి సంపాదించినా తప్పు లేదు అని గోదావరి అనుకుంటున్న సమయం అది. 'మహద్వాణి'లో వింత ప్రకటన చూస్తే చిర్రెత్తుకొచ్చింది కూడ. ఇలాంటి వెధవ్వేషాలు వేస్తున్న వాళ్లకి బుద్ధిచెప్పినట్లూ ఉంటుంది గూడ. ఎలాగో మభ్యపర్చి, నమ్మించి కనీసం ఆ అయిదొందలైనా అడ్వాన్సుగా యిచ్చేవరకూ వదలకుండా పీక్కురావాలనుకున్నాను. ......"

సాగరం ఛాతీ చరుచుకుంటూ, "నా అంచనా సరీగ్గా పనిచేసిందన్నమాట, శెబాష్ సాగరం!!" అన్నాడు.

"ఏం లాభం? నన్ను ఇప్పుడు మీరు సరిగ్గా అంచనా వేసుకోదల్చినా కూడ జరిగే దేమిటి?...నా గురించి చాలా ఖర్చుపెట్టారు...చేయించాను! అదే బాధగా ఉంది. ఏదారీ లేనిదాన్ని-ఏదారీ లేకపోతే గోదా......," అంటూన్న గోదావరి మాట పూర్తి కాకుండానే సాగరం చివాల్నలేచి బస్సాపినట్లుగా, "ఆపాలి! ఆపాలి!" అంటూ పెట్టిన కేకకి ట్రంకురోడ్డు మీద ఎలమంచిలి వెళ్తున్న బస్సు అమాంతంగా ఆగిపోయింది.

ఇటూ అటూ చూసి ఎవరూ కనిపించక పోతే, డ్రైవరూ కండక్టరూ ఒకరి మొఖాలొకరు చూసుకుని, "ఎవడో దొంగ నాయాల! వాడి..." అంటూ తిట్టుకుంటూ బస్సు మెల్లగా విసుక్కుంటూ కదిలింది.

"ఉండండుండండి! అంతా తేలిపోతూన్నది. అసలు కథ పూర్తికావస్తూంది. నాకంతా తేలిపోయింది..." అంటున్నాడు సాగరం...

"ఎలాగ?" అంది గోదావరి.

"సాగరాన్ని గోదావరి తప్పకుండా పెళ్లి చేసుకుంటుంది-యిష్టమే..."

"అతను చేసుకోడు!.. గోదావరి నిండు బురదేరులాగే కనిపిస్తుం దతనికి-అంతే... అంచేత..."

"అంచాత గోదావరి స్టేషన్లో దిగుతుందంటారు! అంత ముచ్చటగా ఉంటే మీ రలాగ వేరేకథ-హిందీలో తీయాలని ట్రాజడీగా మార్చబడ్డ సినిమాకథ లాగ-రాసుకోవచ్చు. అభ్యంతరం లేదు. నేను మాత్రం ఒఠ్ఠి తెలుగువాణ్ని. అసలు కథ ట్రాజడీ కానివ్వను! వీల్లేదు! అలా జరిగితే కథానందసాగరం సాగరం పనే ట్రాజడీ ఔతుంది. ఉందిగా

బంగాళాఖాత సాగరం... చెయ్యాలని చేసినట్లుగా ట్రాజడీ కథలు రాసే వాళ్లంటే నాకు చెడ్డ ఒళ్లుమంట! అలా పనికిరాదు..." అలిసిపోయినట్టుగా సాగరం కొంచెంసేపూరుకొని,... "ఇక లేవండి!" అన్నాడు.

ఇద్దరూ నందనానికి బయల్దేరారు.

*    *    *

ఇద్దరూ నడుస్తున్నారు. వెనకనించి మాటలు వినిపిస్తున్నాయి దూరంగా... స్పష్టంగా...

''ఆ బావూ మంచోడే!...''

"ఆ పిల్లదీ బుద్ధిమంతురాల్లాగే ఉంది. ఏఁవన్నా చెక్కుచెదరదు!"

"సోమ్మవ్వ మట్టుగు తక్కువా? అంత దొడ్డదాన్ని మరి సూడం..." క్రమంగా మాటలు వినపడ్డంలేదు.

''ఇక్కడ వాళ్లు మంచిచెడ్డల మేలు కలయిక. కరుగ్గా మాట్లాడతారేగాని మెత్తవాళ్లే. డబ్బుగలవాళ్లందర్నీ మంచోళ్లంటారు, బాబ్బాబంటారు. కాని డబ్బుందని దర్పం చెలాయిస్తే మట్టుగు కరుస్తారు,'' అన్నాడు సాగరం.

''కత్తికి తేనెపూసిమాటాడ్డం, నక్క వినయాలు, నాజూకు గొంతుకోతలు వీళ్లకింకా బాగా తెలిసినట్టు లేదు..." అంది గోదావరి.

మాటల్లోనే నందనం చేరుకున్నారు.

*    *    *

"అమ్మమ్మా!" అంటూ అడుగెడుతూనే కేకపెట్టి పిల్చాడు.

"ఏరా?" అంటూ సోమవ్వ వస్తూ ఇద్దర్నీ చూసి ఏదో తెలిసినట్లు నవ్వుకుంది. ముసలితనంతో బాటు పది మందికి చేసిపెట్టగల సత్తువా, డాబూ, దర్పంలేని నిండుదనం కనిపిస్తున్నాయి.

"నేను పెళ్లి చేసుకుంటానమ్మమ్మా!" తంతివార్తలాగ అన్నాడు సాగరం.

"ఔనా! ఇందాకే 'వాడు' చెప్పినట్టయిందిరా!" అంటూ సోమ్మవ్వ వేణుగోపాలస్వామి ఆలయంవేపు తిరిగి దణ్ణంపెట్టి, "అంతా వాడు చేస్తున్నదేరా! నా కొద్దు, వీడికే యివ్వు అంటూ రావు రావకున్న నిన్ను పంపించాడు; నా కోరిక విని నీ నోటనే మంచిమాట పలికించాడు!" అంది.

"పేరు గోదావరి—అంతకంటే నాకేం తెలీదు. కులంగిలంలాంటి ఊసెత్తితే వేణుగోపాలస్వామికే రాసేనుకో. నాకేం అక్కర్లేదు!" అంటూ సాగరం అవసరం లేని ఆవేశం తెచ్చుకుంటూంటే, "ఆగరా! తన క్కావలసిన వాళ్లనీ, కావలిసిన వాటినీ కాలమే తయారుచేసుకుంటుంది. ఆ కాలం పోకిళ్లు చూడ ముచ్చటగా ఉంటాయికాబట్టే 'సుదర్శనం' అన్నారు. ఆ కాలచక్రం తిరగడాన్ని, అంటే తిరగడానికి అవసరమైన దాన్నే 'వాడు' అన్నారు. ఆ చక్రపాణికీ వాడి చక్రానికి తేడా లేనేలేదు తిప్పుతున్నాడని అనుకుంటాం మేం, అంతే కీలకమల్లా! మీరు కాలాన్ని నమ్ముతారు



కాలాన్ని నమ్మేవాళ్లూ, ఆ చక్రపాణిని నమ్మిన వాళ్లూ ఒకటే. తేడా ఉందను కుంటారు. అంతే! అంతా మన చేతుల్లోనే ఉంది! అంటున్న మీచేతఅనిపిస్తుండంటాం మేం. నేనేం చదూకోలేదు. అంచేత మాలాంటి వాళ్లకి వాడిమీద నమ్మకం. అదొక తృప్తి. మనస్సుకి కుదురూ, శక్తి యిస్తుంది. మీరు చదువుకున్నవాళ్లు ఆ చదువే మీకు బలం యిస్తుంది, ఏం చెయ్యాలో చెబుతూంది......" అంటూ అవ్వ కొంచెం ఆగింది.

అక్షరం రాని ఈవిడకి ఇలాంటి చదు వెలా వచ్చింది?! అని తనలో అనుకుంది గోదావరి.

అవ్వ మళ్ళీ అందుకుంది, "ఇలాంటి వన్నీ మీ తాత విడమర్చి చెబుతూండే వాడు. నేనేదో చాదస్త్రాలకిపోతే ఇది ఇలాగ దిగజారిపోతున్నది, అది అలాగై

పోతూంది అంటూ గాభరాపడేవాళ్ళూ, ఇదిచెయ్యాలి దాన్ని ఆపాలి అని ఊరికే మాట్లాడే వాళ్ళు. ఒఠ్ఠి పిచ్చి మొక్కలు! ఇంతకూ నువ్వు చేసిందానికీ చేసుకుంటా నన్నదానికీ చెయ్యబోయేదానికీ కాదన డానికి నేనెవర్ని గనక?...నీకూ వాడికీ తేడా లేదు—నీకు పుట్టినబుద్ధి వాడిదే, ఆ బుద్ధి వాడే..."

"ఎంత సోదె చెప్పావే అమ్మమ్మా! ...మరి ఏలాంటి పెళ్ళి చేసుకో మంటావో చెప్పు!" అన్నాడు సాగరం

"నా సోదెవినిగాదే నీ గాదె ఏం పోదులే, నీయిష్టవొచ్చినట్టు చేసుకో... ఏమే గోదావరమ్మా! నే చెప్పింది బాగుందా?'' అంటూ వంటింట్లోకి దారి తీసిన అవ్వను గట్టిగా కావిలించుకో వాలనో, కాళ్ళు చుట్టేసుకోవాలనో అని పించింది గోదావరికి.

* * *

వెన్నెలపడుతోంది. నందనం బంతిపూలు పచ్చి పసుపురంగులో నిగ నిగలాడుతున్నాయి. సాగరం గోదావరి మాట్లాడుకొంటున్నారు.

"అదుగో, అకనిపిస్తున్న ఆలయంలో నిరాడంబరంగా జరగాలనుకుంటున్నాను ...యిష్టంలేకపోతే చెప్పొచ్చు...'' అన్నాడు.

"యిష్టమే యిప్పుడు! మీ అవ్వ మాటలు విన్నాక ఏదో తెర తొలగి నట్టుంది నాకు..."

"తెరలూ, కిలకాలతో నాకు పనిలేదు గాని, మనిషంటే నాకు చాలా యిష్టం. మనుష్యులు చేసిన దేవుళ్ళంటె యెప్పుడూ నాకు అయిష్టం లేదు! మను ష్యులు చెయ్యని దేముడంటూ ఉంటే వాడి అవసరం లేదు, యిష్టమూ లేదు. ఎప్పుడు చేసుకున్నా మనుషులు చేసిన శిల్పాలూ, కళలూ, కథలూ లాగే మంచి ఉద్దేశంతో చేసినవన్నీ నాకు మహా యిష్టం. రాను రాను వెర్రితలలు వేయడం, స్వార్థాలకు అనర్థాలకు దారితీయడం వేరే సంగతి. పరిణామంలో ప్రతిదాని గతీ అంతేనేమో.

వివాహం అంటే మేం ఇద్దరం సంసారం సాగిస్తాంఅని నలుగురికీ తెలియ జేసుకోవడమే-అంతకంటే మరేం లేదు ...నలుగుర్ని నమ్మకపోతే ముద్రగుద్దిన కాయితాన్ని నమ్ముకోవడం—... ఇలాంటి ఊళ్ళల్లో రకరకాల మనుష లందరూ చేరడానికి ఆలయం కంటే మంచి చోటు మరోటి ఉండదు. పిలిస్తే ఊరంతా వస్తుంది-యీ చుట్టు పక్కల వాళ్ళంతా మన బంధువులే, సాక్షులే...వాళ్ళకు యిష్టమైన తీరులోనే జరగనిద్దాం మనకు పోయేదేమీ లేదు. వాళ్ళనూ సంతోషపెడదాం...''

"అసలు కథ చెప్తారా యిక...?"

"ఔతూందౌతూంది..."

"మరొక్క టడుగుతాను..."

"ఏమిటి?"

''మరేంలేదు, లాటరీకథ నిజం కాదు గదా?''

"ఏం? నిజంగా జరిగింది కాకూడదను కుంటున్నారా మీరు "

''మీరు అనడం మానేసి గోదావరీ అనకూడదా?...అదేంటో లాటరీడబ్బు రావడం అదీ నాకదొకలాగ సమించ నట్టుగా ఉంది..." ఆ మాటకు సాగరం గోదావరిని కౌగలించుకోవాలని బుద్ధిపుట్టింది...

"కథని కథలాగ తీసుకోవాలి గాని, ఇది జరిగిందా, పుక్కిటి పురాణం, పచ్చి అబద్ధం, కాశీమజిలీకల్పన, సంభ వమా, అసంభవమా? అంటూ గింజు కోవడం వెర్రిపని. అది కథ ఔనా కాదా, దానివల్ల వినోదమో, నీతో, పులకరింపో కనువిప్పో కలిగిందా లేదా, అంతే కావ లసింది. అందుకే కథ కంచికి మనం ఇంటికి అన్నారు... ''

"ఇంతకూ నిజం చెప్పండి."

"నేనుకథలు చెప్తాననీ మొట్టమొదటే చెప్పేను..అవ్వకు చెప్పుకోదగ్గ ఆదాయం వచ్చే ఆస్తి ఉన్నమాట నిజం... ఐతే తర్వాత, అవసరమైన దానికంటే చాలా ఎక్కువ అనిపించింది. అది ఎవరికి చెందడం న్యాయమో అలాగే కానిద్దాం- ముఖ్యమైన విషయం! వివాహో విద్య నాశాయ అన్నట్లుగా కాకుండా సాగరం చెప్పేకథలు గోదావరి వినిరాయాల్సిందే. రాయను, వినను అంటే పనికిరాదు హామీ యిప్పుడే యివ్వాలి!"

"ఇస్తున్నాను! కథానందసాగరం నిరాటంకంగా సాగుతుంది నిస్సందే హంగా...ఇప్పుడుకూడా చెప్పొచ్చు!"

"ఇప్పుడు మాటకేంగాని, ఇకముందు వచ్చేవన్నీ-, సాగరం చెప్తున్నాననడం- గోదావరి వినడం అని వేరే చెప్పనవసరం లేదు."

"పోనీ అసలు కథ చెప్పండి"

"అసలు కథ ఆలయంలో అవుతుంది. అవుతుందేమిటి, ఐనట్లే, అసలు కథ పూర్తయింది..."

"అంకితం యివ్వరూ?"

"అలాంటివేవీ లేవు."

"అసలుకథ అంకితం యిచ్చితీరాలి!"

"ఎవరికి? గోదావరికా..."

"బురదేటిక్కాదు- 'చక్రపాణి'కి," అంటూ గోదావరి అటుచూపింది. వేణు గోపాలస్వామి గోపురం ఎత్తిపట్టిన చూపుడు వేలుబాగ నిలువుగా తెల్లగా వెన్నెట్లో మల్లెమొగ్గ అనిపిస్తున్నది.






లావుపాటి ఆసామీ పరిగెడుతూంటే నేల అదిరినట్టుగా రైలునడుస్తోంటే దడదడ లాడుతోంది. మంత్రిగారు వస్తూంటే లెక్కలేనంతమంది పోలీసులు వరసగా నిల్చుని చేతుల్చాపి ఒకరి లాటీ నొకరు పట్టుకుని గొలుసుకట్టుగా రక్షణ నిస్తున్నట్టున్నాయి టెలిగ్రాఫ్ స్తంభాలు.

కూతురి పెళ్ళిచేసి ఎన్నాళ్ళబరువో ఎన్నెన్ని బాధలో తీరిపోయి ఒంటరిగా వాలుకుర్చీలో విశ్రాంతి తీసుకుంటున్న గుమాస్తాలా, పక్కనేసుకున్న బాబిగాడిని కూడా మర్చిపోయి హాయిగా నిద్ర పోతోంది సులోచన. ఇంచుమించు అంత తేలిగ్గానూ వుంది చిట్టిరాజుకి. కాని సామాన్లు బోల్తున్నాయేమో వాటికి కాప లాగా బైఠాయించి కిటికీలోంచి వచ్చే చల్లగాలికి కునుకుపాట్లు పడుతున్నాడు.

అడవిజాతి మనుషులు సూర్యోదయం చూసినట్టుగా, తెల్లారేసరికి తాము విజయ నగరం చూసుకుంటాము అనుకుంటూంటే ఎంతో ఆనందంగా వుంది. తల్లి గుర్తొచ్చిన పసిపిల్లాడిలా చిట్టిరాజుకి మరి నిద్రపట్టింది కాదు.

విజయనగరంలో ఏవుందని ఎవరైనా అడిగితే ఏవీలేదని వెంటనే జవాబు రావొచ్చుగాని, నీ పుట్టినవూరిలో ఏవుం దని అంత ఆత్రుత...అని తెలుగుసీమకి దూరంగా అయిదేళ్ళాయి ఉద్యోగంచేసు కుంటూ వస్తూన్నవాణ్ణి ఎవరూ అడగనూ లేదు. దానికి జవాబూ లేదు.

మూడునాలుగు వేలిచ్చి జీవనాధార మైన మొగుణ్ణి కొనుక్కున్నట్టుగా సుమారు అంతే ఖర్చుపెడితేనేగాని బాంక్‌లో ఉద్యోగంరాదు. అందుకే తెలుగుసీమకు దూరమైనా, అక్కడెక్కడో రైల్వే ఉద్యోగం చేసుకుంటున్న బంధువులద్వారా అక్కడి నేటివిటీ సర్టిఫికేటుతో చవగ్గా అక్కడి స్టేట్‌బాంక్‌లో పాగావేసేడు చిట్టిరాజు. తల్లికీ తండ్రికీ దూరంగా వున్నాడన్నమాటేగాని, చాలా

హేపీగా వుండేదతనికి. రెండేళ్ళలో అక్కడి భాషా, వాతావరణమూ, ఆచారాలూ, అలవాట్లూ అన్నీ ఆకళింపుచేసుకున్నాడు

అక్కడ పడింది బ్రేకు.

రెండేళ్ళనుండీ ఉద్యోగంచేస్తున్నావు కదా. ఇకచేసుకో పెళ్లి అన్నాయి విజయనగరంనుండి వచ్చే ఉత్తరాలు.

విజయనగరం వెళ్ళడమూ, అక్కడే సులోచనని చూడ్డమూ, పెళ్ళి జరిగిపోవడమూ నెల్లాళ్ళలో జరిగిపోయాయి. ఇంకో పదిహేను రోజులు సెలవు పొడిగించి అత్తారింట్లో సేవలుపొంది బయల్దేరేడు చిట్టిన్రాజు. పెళ్ళాంతోపడ్డ బ్రహ్మముడి ఎలాగైతే విడదో ఉద్యోగంతోపడ్డ చిక్కుముడి కూడా విడదుకదా.

కొత్తకాపురం.

కొత్తకొత్తగా నడుస్తోంది.

ఉదయం పదిగంటలకి బాంక్‌కి బయల్దేరితే సాయంత్రం అయిదు గంటలకూ, ఓటీచేస్తే ఇంకాస్త ఆలస్యంగానూ బయటపడేవాడు. నెలక్కావల్సిన సామానులు జీతాలందగానే తెచ్చి పడేసేవాడు. కొంతడబ్బు ఇంటికి పంపేవాడు. రెండు మూడు రోజులకోసారి కూరగాయలు కొనిపడేసేవాడు. కొన్నాళ్ళు వంటరిగా ఉండటంమూలాన సంసారానిక్కావల్సిన ఎన్నోవిషయాలు తెలుసుకున్నాడేమో, సులోచనికి ఏమీ ఇబ్బంది వుండేదికాదు.

కాని ఓ సంవత్సరం గడిచేసరికి సులోచనకి మొగుడిదగ్గర కొత్తదనం పోయిందేమో గుబులు మొదలెట్టేది.

'పొద్దుటనగా మీరెళ్ళిపోయి సాయంత్రం దీపాలు పెట్టేదాకా రారు ఇరుగూ పొరుగూ ఏంలేదు. పైగా ఏం మాటాడదామన్నా కీసరబాసరమని భాషలో మాటాడతారు..." అనేది.

"పోనీ మెల్లిగా నువ్వూ నేర్చుకో" అన్నాడు చిట్టిన్రాజు అంతేకాదు. ఆవేళ్టి నుండి ఉల్లిపాయలు మొదలు ఊరగాయలవరకూ ఆ భాషలో ఏమంటారో ఒక్కొక్కటి మెల్లిమెల్లిగా చెప్పేవాడు. కొన్ని పట్టుబడ్డాయి సులోచనకి. కాని కొన్ని పట్టుబడలేదు. కారణం శ్రద్ధ లేకపోవడమూ, ఒట్టిమనిషి కాకపోవడమూను.

ఈ సంగతి తెలిసి అత్తగారూ, మావగారూ వచ్చి గల్లంతుచేసేవారు. పిల్లని పుట్టింటికి తీసుకుపోతామన్నారు. తొలి కాన్పన్నారు. ఇదన్నారు. అదన్నారు. చిట్టిన్రాజుమాత్రం టాట్ పీల్లేదన్నాడు.

అయితే సులోచన వాళ్ళతో ఏం చెప్పిందో మరి. "ఊరుగాని ఊరు. ఎన్నాళ్లిక్కడ దూరంగా వుంటారు. వాళ్ళతో వీళ్ళతో చెప్పి బదిలీ చేయించుకోరాదూ..." అని అత్తగారూ, అంతకన్న ఓమెట్టుపైన..."విజయనగరంలో సురేంద్రనాధ్ అని ఓ కుర్రాడు ఈ వూరివాడే వున్నాడు. నువ్వు ఒప్పుకుంటే మ్యూచువల్ ట్రాన్స్‌ఫర్ పెట్టుకుంటానికి

ఉత్సాహపడుతున్నాడు"... అని మామ గారు శతపోరుపెట్టేరు.

పనిమనిషి కివ్వాలిసిన జీతందగ్గర నుంచి ఇంటిఅద్దెవరకూ స్వంతఇంట్లో అయితే మిగుల్తాయికదా. తల్లీదండ్రీ పెద్దవాళ్ళయి పోయేరు. వాళ్ళకి అండగా వునట్టుంటుంది. తమకూ్కడా రేపో్పద్దున్న సులోచనకి డెలివరీ వచ్చేక పెద్ద దిక్కు అవసరం.

ఇన్నీ ఆలోచించి చిట్టిరాజు ఒప్పుకున్నాడు.

బాబిగాడు పుట్టకముందు చేసుకున్న విన్నపం వాడికి ఏడాది వయసొచ్చేక బేంకువారు ఆమోదించి అతన్ని విజయనగరం ట్రాన్స్‌ఫర్ చేసేరు.

ట్రైను మాంచి వేగం అందుకుంది. కిటికీలోని పిడికెడు ప్రకృతీ బొంగరంలా తిరుగుతోంది.

చిట్టిరాజు కాస్తవంగి సులోచనని తట్టి లేపుతూ, "విజయనగరం వచ్చేస్తోంది ...లే" అన్నాడు, సూర్యుడు పడమటకు వెళ్ళిపోతున్నాడన్నంత సహజంగా.

జాయినింగు రిపోర్టు ఇచ్చేసి ఏజంటు గదిలోనుండి ఇవతలికి రాగానే ఓ ఇరవై మందిలాగా కొలీగ్సంతాచుట్టుముట్టేసారు. అంతా కుర్రాళ్ళే. తన యీడువాళ్ళే "కంగ్రాచ్యులేషన్స్..." "అవునూరిటర్న్ టుది నేటివ్ ప్లేస్ కాబోలు. కాఫీ ఏదీ?" "కాఫీ...కాఫీ...", "వెంటయ్యా... కాఫీ..." అంటూ కేకలూ, వాడెవడో వెంటయ్య ముందుకొచ్చేసి.. "ఇలా టాటి కన్నిటికీ వెంటయ్యంటే కత్తి సాకండి..." అని డబ్బులు పట్టుకు పోయేడు. వీళ్ళకేగాకుండా ఏజెంటు దగ్గర్నుండి ప్యూన్సువరకూ అందరికీ ఉత్తకాఫీలు తెప్పించినా ఓ పదినోటు ఎగిరిపోయింది. చిట్టిరాజుకి ఇక్కడ సీటే మెంత పనేమీలేదు. ఓ గంటయ్యింది ఒహడెవడో కడుపులో గురగురమంది కాబోలు చుట్టూచూసి..."ఉర్రేయ్... కామేశం కొత్త బట్టలేసా్డోయ్... ఆయన జాయినింగులో చూడనేలేదు .. కాఫీ తెప్పించురోయ్," అంటూదొంగాడి పట్టుకున్నట్టు పట్టుకున్నాడు. మరో పమంది చుట్టేయడంతో అతనికి తప్పింది కాదు సాయంత్రం అయ్యేసరికి ఓ అర డజను కాఫీలయ్యాయి

బాగానేవుంది కాని ఇలా కొత్తబట్టలేసుకున్నందుకూ ...... కొత్త జోడు కొన్నందుకూ...గెడ్డం చేసుకున్నందుకూ కాఫీ ఓప్పించమంటే ఎవడితరం అవుతుందీ అనుకున్నాడు చిట్టిరాజు.

పగలంతా బాంక్‌లో పన్జేసి సాయంత్రము ఇంటికి వెళ్లేసరికి... "ఏవండీ మీ కామాక్షత్తయ్య మనవరాలు పెద్దమనిషయ్యిందండీ-పళ్ళూకాయలూ, జాకట్టు ఒట్టా తీసుకురండి" అనో, "అన్నట్టు... చెప్పేనా... మా నిర్మలకి కొడుకు పుట్టేడు...బారసాల చెప్పడానికొచ్చింది ...కాస్త అలా వెళ్ళి పిల్లాడికి చొక్కా



యి ప

గుడ్డా బిస్కెట్లూ తీసుకు రండిబాగోదు'' అనో డెయిలీరిపోర్టు లందించేది సులో చని. ఇవేవీ కాకపోతే... 'మందులయి పోయాయిరా' అంటూ వాళ్ళనాన్నగారో, 'తమలపాకులూ చెక్కలూ తీసుకురా నాయనా' అని వాళ్ళమ్మగారో, 'పుస్త కాలు, బలపాలూ అయిపోయాయని' అంటూ వాళ్ళ తమ్ముళ్లూ చెల్లెళ్ళో ఏదో రకంగా ఇండెంటులు పెట్టుకునేవారు. ఫ్రిజ్‌లో చల్లేస్తోందని ఐరన్ సేఫ్‌లోకి వెళ్ళిపోయిన మావిడిపండులా కవిలి పోయేవాడు చిట్టిరాజు.

ఇక సులోచనికి కొత్తరకం ఇబ్బం దులు తలెత్తేయి. పిల్లాడి సదుపాయాలు కాసి, మరదళ్ళనీ మరుదుల్నీ స్కూళ్ళకి పంపి వంటా పెంటాతో సతమతమై పోతూవుంటే..."నా చేతిలో ఏవు దీ... పెత్తనమంతా కోడలి చేతిలోనే కదా... నన్నడిగితే ఏం లాభం?'' అంటూ డబ్బు లడిగిన చాకలాడితో మావగారూ, పాత చీర అడిగిన పనిమనిషితో అత్తగారూ మూలుగుతూ చెప్పేవారు. ఇలాకాదని గదిలోకిపోయి తలుపేసుకుంటే ఆవిడే చేసుకుంటుంది అనుకుందా మంటే అట్లు వంటే ఆమెకు ఆరుగురు అమర్చా లన్నట్టు అన్నీ సిద్ధంచేస్తేగాని పోపుపెట్ట లేరు అత్తగారు. పైగా..."ఆవిడకేం మహారాణి. చేసేవా ళ్లున్నారుకదా." అంటారు.

ఇదికాక చుట్టాలు పక్కాలు, "మా వాడు బేంకిలో పనిచేస్తున్నాట్ట.. చూసి పోదామని..."వచ్చి పది పదిహేను రోజులు కేంపువేసెయ్యడం. వాళ్ళకి వంతగా అత్తమావలు .. "మా వంశం వాళ్ళకి మా చెడ్డ బంధుప్రీతిస్మండీ." అంటూ పొంగిపోవడం.

అంతా కలిసి తననూ, తన సంపాద ననూ, తన ఓపికనూ, తన మంచి తనాన్నీ తినేస్తున్న రాక్షసుల్లా కనిపించ సాగేరు చిట్టిరాజుకి.

అంతే.

మోజు తీరిపోయింది.

దూరప్రాంతాల్లో తనలాంటి వాడెవ డైనా తనలాగే స్టేట్ బాంక్‌లోఉద్యోగం సంపాయించి ఇటువంటి నరకం లోకి రావాలని చూస్తున్నాడేమో ఎంక్వైర్ చెయ్యడం మొదలెట్టి...రెండు నెల్లు తిర క్కుండానే అలాంటి వాణ్ణొకణ్ణి సంపా యించి ఇంతవరకూ అనుభవించిన ముళ్ల చక్రాన్ని వాడి నెత్తిమీదికి బదిలీచేసి... సులోచన, బాబిగాడితోపాటు దూర ప్రాంతానికి సిద్ధమయ్యేడు చిట్టిరాజు.






ఎస్సేసార్యే. శర్మ

ఆదివారంపూట తీరికగా ఈజీచైరులో కూర్చుని పేపరు చదువుకుంటు న్నాను. పక్కనే అయిదేళ్ల నానిగాడు తన బొమ్మలతో ఆటలాడుతూ, ఏవో కబుర్లు చెబుతున్నాడు. నేను మధ్యమధ్య పరధ్యాన్నంగా వింటూ, వూఁ కొడుతున్నాను. శ్రీమతి ఇంట్లో ఎక్కడో పనిలో వున్నట్టుంది.

నానిగాడు నాగడ్డం పట్టుకుని తన వైపు తిప్పుకుంటుంటే పేపర్లోంచి ఈ లోకంలోకి వచ్చిపడ్డాను.

“నాన్నా! మరీ......ఇంకో నాన్న ఏడీ?”

ఉలిక్కిపడ్డాను. ఎవరు ఈ ఇంకో నాన్న?

“ఎవరమ్మా అది? ఇంకో నాన్నంటే ఎవరూ? బుజ్జగించాను.”

“ఊఁ! ఇంకో నాన్న!” నిర్ధారణ చేశాడు చిరంజీవి

నా కర్థంకాలేదు. ఒకవేళ నేను ఆఫీసుకి వెళ్ళిన సమయంలో ఎవరైనా ఇంటికివస్తే తెలియక నేననుకున్నాడేమో పిచ్చివెధవ.

“ఎక్కడున్నాడురా నానీ, ఇంకో నాన్న?”

‘ఇంకోనాన్ననా? హాల్లోవున్నాడు.”

"ఎప్పుడురా."

''నిన్న."

మా నానిగాడు అన్నిటికీ నిన్న అనే అంటాడు కాని, ఇంకో నాన్నేమిటి? హాల్లో వుండటమేమిటి? వెధవ అనుమానం ఒకటి మొదలయింది.

"ఇంకో నాన్న హాల్లో ఏంచేశాడురా?''

''ఇంకో నాన్న...కుర్చీలో కూర్చున్నాడు."

సరి. బాగానే వుంది. అంటే నేను లేనప్పుడు ఎవడో ఇంటికి వచ్చాడన్నమాట. ఎవరైవుంటారు చెప్మా ?

''ఇంకా ఎవరు వున్నారమ్మా హాల్లో?" ఇంకా సహనంగానే ప్రశ్నించాను.

"ఊఁ! ఇంకోనాన్నా...అమ్మా... హాల్లో...కుర్చీలో...కూర్చున్నారు.''

ఇంక సహనం నశించిపోయింది. ఎంతయినా అయిదేళ్ళ పసివాడు అబద్ధం చెప్పడు గదా! ఈ సంగతేదో ఇంతటితో తేల్చకపోతే కష్టం.

శ్రీమతిని పిలిచాను.

"ఏమిటండీ అది! ఏం మునిగిపోయిందని అంత బిగ్గరగా కేకలు వేస్తున్నారు? ఏం జరిగిందేమిటి అసలు?"

"ఇంకా జరిగేదేమిటి? నీ బొంద? నేను ఆఫీసు కెళ్ళినప్పుడు నువ్వు ఏం చేశావు? నిన్న ఎవరొచ్చారు ఈ ఇంటికి, నేను లేనిసమయంలో?"

"రామ రామ! ఏంచేయటమేమిటండీ. వంటచేస్తున్నాను. బాబిగాడికి నీళ్ళు పోశాను. బట్టలుతికాను...

"చాల్లే. పసివాడు అబద్ధాలాడతాడనా? నిజం చెప్పేయ్ అసలు ఎవరొచ్చారు ఈ ఇంటికి?'' అని శ్రీమతిని గద్దించాను.

నా అరుపులకు భయపడి బాబిగాడు ఏడుపు లంకించుకున్నాడు పెద్దగా.

"చెప్పరా నానీ! నిన్న ఎవర్రా ఇంటికి వచ్చింది?" అని వాళ్ళ అమ్మ వాణ్ణి హాల్లోకి తీసుకుపోయింది. నేనూ హాల్లోకిపోయి, "ఊఁ! ఇప్పుడుచెప్పరా! ఇంకో నాన్న ఎక్కడ కూచున్నాడు?" నిజం రాబట్టాలని కాస్త నిదానంగానే అడిగాను.

"అదిగో ...అక్కడ...!" ఏడుస్తూనే చూపుడు వేలితో చూపించాడు

అవును, అక్కడ వాడి అమ్మానాన్నా కుర్చీలో కూర్చుని తీయించుకున్న పెద్ద ఫోటో గోడకి తగిలించి వుంది.






పినిశెట్టి శ్రీరామమూర్తి

ఈమాట కొందరికి ఆశ్చర్యంగా తోచవచ్చు. మరికొందరికి హాస్యంగా స్ఫురించవచ్చు కాని, "నోరుండి మాట్లాడలేని వాళ్ళు, చెవులుండి వినలేనివాళ్ళు, కళ్ళుండి చూడలేని వాళ్ళు – మన మనుషుల్లో వుండగా – వెధవది మాటామంతీ లేని కుక్క తోకవుండి ఆడించలేక పోయిందంటే ఆశ్చర్యపోవడం ఎందుకూ."

సుబ్బారావుకు మొదటినుంచీ కుక్కలంటే పరమ అసహ్యం. అంతే కాదు ప్రబల విరోధంకూడా. తను బ్రహ్మచారిగావుంటూ, కాలేజీలో చదివేరోజుల్లో ఒకనాడు తీయటి కలలకోసం ఎదురుచూస్తూ, అర్ధరాత్రి నిద్రకోసం తపస్సు చేసే సమయంలో నిద్రపట్టబోతూ వుండగా వీధి మొగలో ఒక కుక్క కొంప. మునిగినట్టు మొరిగి మొరిగి ఎవరూ తనను ఖాతరుచేయడంలేదని బాధతో కుయ్యోమంటూ శోకండాలు ప్రారంభించింది. దాని అరుపులకు సానుభూతి చూపిస్తున్నట్టుగా మరో నాలుగు కుక్కలు కంఠాలు కలిపినై. సుబ్బారావుకు ఈ హృదయవిదారక ధ్వనితో తీయటి కలలమాట అటుంచి నిద్రకూడా పాడై కోపంతోలేచి, కర్రతీసుకొని వీధిలోకి పరుగెత్తేడు – తీరా అతను వెళ్ళేసరికి ఒక్క కుక్కకూడా కనిపించలేదు.

ఇది దినసరి కార్యక్రమమైపోయి,

ప్రాణం విసిగి, కుక్కలబాధ భరించ లేక మరో వీధిలోకి మకాం మార్చాడు. కాలేజీకి కొంచెం దూరమని మొదట్లో బాధపడ్డా, ఆగదిలో చేరిన్నాడు రాత్రి కుక్కల మొరుగుడు ఎక్కడా విని పించకపోవడంతో "హ మ్మ య్యా" అంటూ పెద్దగండం గ డి చి న ట్టు ఫీలయ్యాడు. ఆరాత్రి తీయటి కలలు రాలేదుగాని చల్లటిగాలికి చక్కటి నిద్ర పట్టింది. ప్రొద్దుట వాతావరణంచూసి రాత్రి వర్షం కురిసినట్టు తెలుసుకున్నాడు రెండురోజులు ఇలా గడవడంతో-కుక్క లను తమ వీధి దరిదాపులకు రానీయని ఆ ఇళ్ళ యజమానుల నందరినీ మన స్సులో అభినందించుకున్నాడు.

బి. కాం. పరీక్షలు దగ్గర పడ్డంవల్ల రాత్రుళ్ళు చదవడం మొదలు పెట్టాడు. చదువు అనడంతోనే నిద్ర ముంచుకరావ డంతో ఇప్పుడు కుక్కలు మొరిగితే ఎంత బావుండు ననిపించింది సుబ్బా రావుకు.

ఏదో విధంగా పరీక్షలు పూర్త య్యాయి. ఫరవాలేదు పాసవగలనని గుండె ఓటవుపర్చుకున్నతర్వాత గుండెల మీద చేయివేసుకొని గత వారంరోజుల నిద్ర బాకీని ఈ ఒక్కరాత్రి హాయిగా తీర్చేయాలని నిర్ణయించుకొని కళ్ళు మూశాడు. ఇంకా సరిగ్గా నిద్రపట్టలేదు. ఇంతలో ఒక వంద ఫిరంగులు పేలి నట్లుగా, కొన్ని వందల-వురుములు వురిమి నట్లుగా, కొన్ని వేల జలపాతాలహోరులా రకరకాల ధ్వ ను లు వినవచ్చాయి. ఉలిక్కిపడి నిద్రలేచాడు సుబ్బారావు. కొత్తగా వచ్చాయో లేక తమ ధాటికి తప్పుకున్నాడని తనమీద కక్ష తీర్చు కోవడానికి వచ్చాయో తెలీదుగాని అర డజనుకు మించిన కుక్కలు భయంక రంగా మొరగడం ప్రారంభించాయి. అరగంట ఓపిక పట్టాడు. కాని వాటి అరుపులకు అంతం లేనట్లనిపించింది. అవేశంగాలేచి మంచంమీదకూర్చున్నాడు. ఏదో మంత్రం వేసినట్లు అరుపులు ఒకే సారి ఆగిపోయాయి. తనంటే భయం కాబోలు, తను లేచినట్లు ఎలాతెలిసిందో! అని తనలో నవ్వుకోని తిరిగి ఆవీధిలోకి వెళ్ళిపోయి వుంటాయని నిర్ణయించుకొని ఈసారి గట్టిగా నిద్రపోవాలని మెల్లగా కళ్ళు మూశాడు. అవి మళ్ళీవచ్చి యుద్ధం ప్రకటిస్తాయని అతని మనస్సు శంకిం చక పోలేదు - కాని పాపం మరోగంట వరకు వాటి అలికిడి లేదు.

ఈసారి వాటిసంఖ్య పదికి మించింది. ఇందాకటికి రెట్టింపు ధ్వనితో రకరకా లుగా మొరగటం ప్రారంభించాయి. ఆ అరుపులు సుబ్బారావుకు తనను ఛాలెంజి చేస్తూ మ్రోగిస్తున్న యుద్ధభేరీల్లా అని పించాయి. లేచాడు నిద్రకళ్ళు ఒక్క సారి నలుపుకున్నాడు, ఆత్మ రక్షణార్థం మంచం క్రింద వుంచిన దుడ్డుకర్రను చేబూని, అలజడయితే శత్రువులు పారి

పోతారని నిశ్శబ్దంగా, అడుగులేసు కుంటూ వీధిన పడ్డాడు. నాలుగురోడ్ల కూడలిలో కుక్కలు సమావేశమై సమూహంగా సన్నాయి మ్రోగిస్తున్నాయి. అది వేసవికాలం కావడంవల్ల కొందరు అరుగులమీద పడుకొని, ఆ అరుపులకూ తమకూ అసలు సంబంధం లేనట్టు గుర్రు పెట్టి మరీ నిద్రపోతున్నారు. కుంభకర్ణుడిని మరిపించే వాళ్ళనిద్రలకు, వీధి వాళ్ళను దూషించకూడదనుకున్నా తెగ తిట్టిపారేసుకున్నాడు మనసులో. కుక్కల సైన్యానికి దగ్గరపడ్డాడు. గురి చూసి ఆ దుడ్డుకర్రను బలంకొద్దీ వాటి మీదకు విసిరాడు. అంతే! ఆ కర్ర గురి తప్పింది. అది పెంటపోసే డబ్బాకు తగిలి "ధనాల్" మని పెద్దధ్వనిచేసింది. కుక్కలు పారిపోయినా మరో అపాయం ఎదురైంది. ఆ డబ్బాతాలూకు ఇంటి వాళ్ళు అరుగుమీద పడుకున్నారేమో ఆ ఇల్లాలు "అమ్మో దొంగ" అని పొలికేక వేసి మరో మంచంమీద మంచి నిద్దర్లో వున్న వాళ్ళాయన్ని వాటేసుకుంది లేచీ లేవడంతోనే అతనూ "దొంగ దొంగ!" అని అరవడం మొదలుపెట్టాడు.

సుబ్బారావుకు కాళ్ళు వణకటం ప్రారంభించాయి. వణికే కాళ్ళను చూసే సరికి తన ఆకారం గుర్తుకొచ్చింది. కట్ బనీను, ఎరుపుమీద నల్లపువ్వుల సింగపూర్ లుంగీ.. ఆ స్థితిలో ఎవరుచూసినా ఆ చీకట్లో దొంగను గురించి శ్రమపడకుండానే తన్నుపట్టుకుని తంతారని అర్థం చేసుకున్నాడు. పులిని చూసిన లేడిలా పరుగు లంకించుకున్నాడు. సుబ్బారావు తిరోగమనాన్ని గమనించిన కుక్కలు ఇదే సమయమనుకుని మొరుగుతూ వెంటపడ్డాయి. ఇంతలో వీధిలోని వారంతా లేచి కర్రలూ, కతారులతో బయలు దేరారు. కుక్కల ధాటిని తప్పుకొని, ఊడిపోయే లుంగీపట్టుకొని గదిలో పడి తలుపువేసుకొని లుంగీ మార్చుకొని వణుకుతూ మంచంమీద కూర్చున్నాడు. కుక్కలు మాత్రం తన గుమ్మం ముందు నిలబడి మొరుగుతూనే వున్నాయి. అనుకున్నంతా అయింది. తలుపులు దబదబమన్నాయి. సుబ్బారావు గుండె కొంచెంసేపు ఆగి మళ్ళా పనిచేయడం ప్రారంభించింది. ఇంటి యజమాని లేచాడు. తలుపుతీసి "ఏమిటయ్యా! ఏమైంది" అని వాళ్ళను అడిగాడు. ఒక దొంగ పారిపోయివస్తూ ఈ గదిలో దూరాడండి'' అన్నాడొకడు "అర్జునా, పార్థవా, ఫల్గుణా" పిడుగు పడబోతున్నట్లు భావించి సుబ్బారావు గబగబా మంత్రాలు చదువుతున్నాడు. "సుబ్బారావ్!" అన్న ఇంటి యజమాని గంభీరమైన పిలుపు సుబ్బారావు చెవిలో పిడుగులా పడింది. ఇక లాభం లేదనుకొనిలేచి వణికేచేతుల్తో భయంగా తలుపు తీశాడు. ఎదురుగా ఒక ఏభైమంది వీరాధివీరులు కర్రలతో నిలబడ్డారు. వాళ్ళకుతోడు సుబ్బారావు

తలుపు తీయగానే మరోసారి "భౌయ్" మన్నాయి ఆ కుక్కల సపోర్టు ఆవీధి వీరులకు అసహ్యమనిపించి, తమ ఆయుధాలు వాటిమీద ప్రయోగించడంతో కుయ్యోమంటూ తోకముడుచుకొని పారిపోయాయి. "నీ గదిలోకి ఎవరన్నా వచ్చారా?" ఇంటి యజమాని ప్రశ్న. "అబ్బే! తలుపు గొళ్లెంపెట్టి వుండే ఎలా వస్తారండి" అని ఎదురుప్రశ్న వేసి తన సమయస్ఫూర్తికి తనే ఆశ్చర్యపోయాడు కాస్త తూలి తలుపు పట్టుకున్నాడు. "అది నిజమే వీళ్ళంతా దొంగ దొంగ అని ఇంటిమీదపడితే అనవసరంగా లేవగొట్టా. మంచి నిద్దట్లో వున్నట్టున్నావ్ వెళ్ళి పడుకో" అన్నాడు సానుభూతిగా లోనికెళ్ళిన సుబ్బారావు మంచంమీద పడుకొని "భగవంతుడా! ఈరోజు పెద్ద ఆపదనుంచి కాపాడావ్!" అనుకున్నాడు మనసులో.

ఆ సంఘటన జరిగినప్పటి నుంచి సుబ్బారావుకు కుక్కను చూస్తే కోపం, ఒళ్ళు కి పరం వగైరా వగైరా ఒకేసారి పుట్టుకొస్తాయి.

ఆ తర్వాత పరీక్ష పాస్‌కావడమూ బేంక్‌లో వుద్యోగం రావడమూ, తదనంతరం కాస్త కట్నంతీసుకొని చక్కని చుక్కలాంటి సీతను భార్యగా స్వీకరించడము, మొదలైనవి రెండు సంవత్సరాల్లోనే పూర్తయ్యాయి.

ఆ ఇల్లాలి అదృష్టమా అన్నట్టు పెళ్ళికాగానే అతన్ని పట్నంలో పోస్టు చేశారు. పల్లెటూరి పిల్లయినా సీత, ఛాందస్సురాలు మాత్రం కాదు. ఇట్టే పట్టణవాసంలో కలిసిపోయే చనువు—చకచకలు ఆమెలో వున్నాయి. అందుకే ఆదిలో కట్నంకోసం చదువుతక్కువైనా పల్లెటూరి పిల్లను చేసుకున్నానే అని ఫీలయిన ఫీలింగ్ కొద్దిరోజులు ఆమెతో కాపరం చేయగానే మాయమైంది సుబ్బారావులో.

తీసుకున్నది తక్కువ అద్దెలోవున్న బంగళా పెంకుల కొంపైనా చుట్టూ చిన్న కాంపౌండు, దానికో కర్రలగేటు ఉండటంతో ఆఫీసరు వుండే ఇల్లులావుందని కొంతలో కొంత సంతృప్తి పడ్డాడు.

ఆ ఇంటికి వచ్చిన వారం రోజులకే

తన ఇంటిముందు చెత్తకుండీలో ఎంగి లాకు విసురుతూ సీత ఒక కుక్కను చూసింది. ఊరకుక్క అయినా దానిలో ప్రత్యేకత వుందనిపించింది. ఆకు వేయ గానే కృతజ్ఞతతో సీతనొకసారి చూసి గంభీరమైన నడకతో ఆకుదగ్గరకు వెళ్ళి ఏమీలేని విస్తరిని నాకటం మొదలు పెట్టింది. సీత మనస్సు చివుక్కుమంది. వెంటనే లోనికివెళ్ళి కూరకలిపిన అన్నం కాస్త తీసుకవచ్చి ఆ కుక్కకు వేసింది. ఈసారి " ఎంత మంచిదానవమ్మా " అన్నట్టు సీతనుచూసి ఆ కుక్క ఆమె ఆతిథ్యాన్ని గౌరవ పురస్సరంగా స్వీక రించింది.

సీతకుకూడా కుక్కలంటే పెద్ద అభి మానం లేదుగాని, ఆ కుక్కంటే ఎందుకో సానుభూతి ఏర్పడింది. ఇక ఆరోజు నుంచి కర్రలగేటు దగ్గర జీతం లేని గూర్ఖాలా కాపలా కాయడం, ప్రారంభించింది ఆ శునకరాజం సుబ్బా రావు వెళ్ళేటప్పుడూ వచ్చేటప్పుడూ ఈ కుక్క తన గేటు దగ్గరేతిష్టవేయడం చూసి కోపం ముంచుకొచ్చింది. అందులో తన విరోధి జాతికి చెందిం దాయె "సీతా ఈ కుక్కేమిటిక్కడ?" ఉండబట్టలేక ఒక రోజున అడిగేశాడు. " ఇంట్లో కాదుగదండి ... వున్నది బైటేగా? పైగారాత్రిళ్ళు ఎవరినీ రానీయ కుండా కాపలా కాస్తుందాయె" అంటూ తన పల్లెటూరి ధోరణిలోనే రాగంతీస్తూ సమాధానం చెప్పింది. "వెధవ కుక్క లంటే నా కసహ్యం" అన్నాడు. "ఈ కుక్క మంచిదేనండీ" అంది సీత. కోపంగా చూశాడు. సీత పకపకా నవ్వింది.

మరో రోజు సీత వంటగదిలో వుండగా ''భౌవ్" మంటూ కుక్కల అరుపులు వినిపించాయి. అనకోకుండా అభిమాన మేర్పడిన ఆ కుక్కను వేరే కుక్కలు కరుస్తున్నాయేమోనని వంట గది విడిచి పరుగున బైటికొచ్చింది సీత. ఇంకేముంది ... పది కుక్కలు తన కుక్కను చక్రబంధం చేశాయి. మధ్యన నిలచిన తన కుక్క వీరోచితంగా పది కుక్కలకూ సమాధానం చెబుతూ తన హక్కుభుక్తంగా భావించుకుంటున్న ఆ చెత్తకుండీని కాపాడుకోవడంకోసం ఘోరంగా యుద్ధం చేస్తోంది. ఆశ్చర్య మేమంటే ఆ పదికుక్కలు దీని ధాటికి తట్టుకోలేక తికమకపడిపోతున్నాయి.

తనకుక్కమీద వాటి వెధవదౌర్జన్యం చూసి సీతకు మహా కోపం వచ్చింది. దగ్గరున్న రాయితీసుకొని "ఛీ! ఛీ!!" అంటూ గట్టిగా వాటిమీదకు విసిరింది కాని, సుబ్బారావు చేతికర్రలా ఆ రాయి గురితప్పి తన కుక్కకే తగి లింది. కుక్క "కుయ్యో" మని "నన్ను కొట్టావేంటమ్మా" అన్నట్టు చూసింది పాపం. సీత విసిరినరాయి తమ మీద పడకపోయినా, ఈకుక్కకు మానవాంగన

మద్దతువుందని గ్రహించి, ఆ బలగ మంతా పిక్కబలం చూపించాయి. సీత మాత్రం కుక్కను కాపాడపోయి దాన్నే కొట్టినందుకు చాలా బాధపడింది. వెంటనే లోనికి వెళ్ళి తాను తినడానికి వుంచుకున్న అన్నాన్ని ఆకులో పెట్టి తీసుకొచ్చి గేటుతెరిచి ఆ కుక్క ఎదురుగా పెట్టింది. ఈ అయాచిత ఆదరణకూ, ఆహ్వానానికి ఆ అమాయకజీవి, ఆశ్చర్యంగా తల పక్కకు వంచి చూసింది "తనకా? కాదా?" అన్నట్టు. 'నీకే ... రామ్మా" అంటూ ఆప్యాయంగా పిలిచింది సీత అర్థం చేసుకున్న కుక్క ఆత్రంగా రాలేదు. తన హుందాతనం తగ్గిపోకుండా మెల్లగా వచ్చి మరోసారి ఆమెను చూసింది. "తినూ" అంది సీత. ఇంక డౌటు లేదనుకుందేమో వంచిన తల ఎత్తకుండా సుష్టిగా ఆరగించి. మరోసారి చూపుల్తో సీతకు "థాంక్స్" చెప్పి గేటువైపుకు వెళ్ళబోయింది. "అభీ' అని సీత పిలిచింది. ఇదేమిటి? తనకు కొత్త పేరన్నట్టు తల పక్కకువంచి వెనక్కి తిరక్కుండానే చూసింది. "నువ్వు బైటికి వెళ్ళొద్దు. ఆ వెధవ కుక్కలు కరవవచ్చు గేటులో పడివుండు" మానవ భాషను కొన్ని కుక్కలు అర్థం చెసుకుంటాయేమో... "జీ హుజూర్" అన్నట్లుగా ఆమె దగ్గరగావచ్చి నిలబడింది. దాని వినయం చూసి సీతకు ఎందుకో జాలికలిగింది. మెరుపులేని బంగారు రంగుతో నున్నగా వున్న ఆ కుక్కవీపుపైన చేయివేసి "నువ్వు నిజంగా అభిమన్యుడివి," అని అభినందించింది. అందుకే కాబోలు "అభీ" అని పిలిచింది అని కుక్క అనుకోలేదు కాని, ఆమె అమృతహస్తం తనమీద పడగానే అంతవరకూ ఎవరి నుండీ ఇంతటి ఆప్యాయతను పొందని ఆ కుక్క మనస్సు కృతజ్ఞతతో నిండిపోయింది. తల పైకెత్తి చూసింది. రెండు ఆనందాశ్రువులు కుక్క కళ్ళల్లో నుంచి జారిపడడం చూసిన సీత పకపకా నవ్వింది.

ఈ సంగతంతా ఆ రాత్రికి రాత్రే సుబ్బారావుతో పూసగుచ్చినట్లు చెప్పింది సీత. పైగా తను దానికి పెట్టిన ముద్దు పేరుగురించి కూడా వివరించింది. సుబ్బారావు మొదట తన శత్రువును సీత చేరదీస్తున్నందుకు కంగారుపడ్డా చివరికి సర్దుకున్నాడు. దానికి కారణం తను ఆఫీసుకు వెళ్ళి తిరిగివచ్చేంతవరకూ సీత ఒక్కర్తేవుంటుందన్న బెంగ కొంత తీరింది. ఈ సంఘటనతో తన విరోధి జాతిగా చిత్రీకరించుకున్న కుక్కల పైన సుబ్బారావుకు కొంత మంచి భావం ఏర్పడింది

రోజులు గడిచేకొద్దీ, రోడ్డుమీద నుంచి కాంపౌండులోకి చేరిన 'అభి' సీతకు అభిమాన పాత్రమై హాల్లో మకాం పెట్టడం దగ్గరనుంచి సీత ఎక్కడుంటే

అక్కడ బాడీ గార్డులా అటెంన్షన్‌లో నిలవడం మొదలుపెట్టింది. ఒకటి రెండుసార్లు వెధవ కుక్కకు మరీ అంత చనువివ్వడం మంచిది కాదందామను కున్నా సీత మనసు ఎక్కడ బాధపడు తుందో అని అనలేకపోయాడు సుబ్బా రావు.

ఆసలు ఈ జన్మలో కుక్కను పిల వడంగాని దానికేసి చూడ్డంగాని జరగ కూడదని ఒకప్పుడు శపథంచేసిన సుబ్బారావు ఒకరోజు హాల్లో కూర్చొని భార్య ఇస్తున్న తాంబూల చిలకలు సేవిస్తూ-- తమ ఎదురగా కూర్చున్న అభిని చూసేసరికి - దాన్ని కాస్త పలక రించాలనిపించింది. 'అభీ' అనిపిలిచాడు. ఇలా అతని పిలుపుకు నోచుకుంటానని భావించని ఆ కుక్క తక్కున సుబ్బా రావు దగ్గరకొచ్చి నిలిచింది. "వెధవ ముండవి...ఎక్కడ పుట్టావో ఇక్క డకు చేరావ్." ఈమాటలు తనని అనటం లేదు కదా అన్నట్టు అనుమానంగా చూసింది సీత. "మా సీత అభిమానానికి పాత్రమయ్యావు" అంటూ దానిమీద అంటీ అంటనట్టు చెయ్యివేశాడు. ఈ మాటతో "హమ్మయ్య" తనను కాదనుకుంది సీత. పులకించి ఆ కుక్క చెవులు కిందకు వాల్చింది. ఇప్పుడు సుబ్బారావు ఆ కుక్కను నిసితంగా చూడ్డం మొదలుపెట్టాడు. "అభీ" అని మళ్ళీ పిలిచాడు. ఇప్పుడు చెవులు నిటా రుగా నిలిపి "ఎందుకు" అన్నట్లు మెడ ప్రక్కకు వంచి చూసింది. దాని నుదురు మీద ముడతలుపడ్డాయి. "అబ్బే... పూరికేలే, దూరంగా పో" అన్నాడు. సీత పకపకా నవ్వింది. ఆ నవ్వే సుబ్బారావుకి సీత ఇచ్చే పెద్ద రిలీఫ్. ఎంతకోపంలో వున్నా సుబ్బారావు ఆ నవ్వుకు ఐస్ కాలేడు గాని చల్లబడిపోతాడు. "ఏమిటి కుక్కతో మాట్లాడుతున్నారు?" నవ్వాపు కొని అడిగింది. "సీతా నువ్వెప్పుడన్నా కుక్కను క్లీన్‌గా అబ్జర్వ్ చేశావ్?" "అబ్జర్వా! అబ్బే దానికి అలాంటి గజ్జీ గిజ్జీ లేదండీ-" సీతకు ఇంగ్లీషు తెలీదు "చచ్చాం" అనుకున్నాడు మనసులో "కుక్కసబ్బు తెప్పించి రెండు రోజుల కొకసారి స్నానం కూడా చేయిస్తున్నా నాయె" అంటూ ఇంకా ఏదో చెప్ప బోయింది సుబ్బారావు ఇంక లాభం లేదనుకొని "అబ్బ! అదికాదు" అని విసుక్కున్నాడు. ఆ విసుగుదలతో సీత ధోరణికి బ్రేక్ పడింది. 'ఈ కుక్క ఎప్పుడైనా తోకాడించడం నువ్వు చూశావా?" నిజమే... సీత ఇప్పుడు ఆలోచనలో పడింది. అవును, ఏ నాడూ అభి తోకాడించడం తను చూడలేదు. అదే సుబ్బారావుకి చెప్పింది. "తోకాడిం చని కుక్క ఎక్కడైనా వుంటుందా?" "అదేంపిచ్చి ప్రశ్నండీ! ఇక్కడుందిగా" అంది సీత

ఆ సమాధానానికి సుబ్బారావుకి



కోపం వచ్చింది. ఆ కోపంచూస్తే సీతకు నవ్వురావడం తప్పదు. వెంటనే చల్లారడం సుబ్బారావుకీ తప్పదు ఆమెకు సుబ్బారావు చిరుకోపం అందమైతే సీత నవ్వు అతనికి ఆనందం

ఈ కుక్కతోక విషయాన్ని బేంక్ ఇంట్రవెల్ టైంలో టీ సేవిస్తూ సుబ్బారావు స్నేహితులతో చెప్పాడు. "తోకాడించని కుక్క వుంటుందా?" మిత్రులంతా ఒకేసారి ఆశ్చర్యాన్ని ప్రకటించారు.

"ఒకవేళ పేరాలైసిస్ అనేది కుక్కతోక కొస్తుందేమో" అన్నాడు తీవ్రంగా ఆలోచించి ఇంట్లో హోమియో కొత్తగా ప్రాక్టీసుచేస్తున్న చిన్నారావు "నోనో! నంథింగు రాంగ్! ఏవరమో ఏక్షన్‌తప్పి వుంటుందంతే," అన్నాడు రంగారావ్.

రెండింటి భావం ఒకటేకావడంవల్ల హెడ్ క్లర్కు వెంకట్రావు బిగ్గరగా నవ్వాడు. అంతా అతని కేసి చూచారు. "చెవులుండి వినలేనివాళ్ళూ కళ్ళుండి చూడలేనివాళ్ళూ, నోరుండి మాట్లాడనివాళ్ళూ మనుషుల్లో వుండగా —వెధవది మాటామంతీ లేని కుక్క తోకుండి ఆడించలేదంటే పెద్ద ఆశ్చర్యమేమిటి."నిజంగా అది జోకేకాని ఎవ్వరూ నవ్వలేదు. తన శ్రమ వృధా అయినందుకు వెంకట్రావ్ వెంటనే లేచివెళ్ళిపోయాడు.

ఏ ఇల్లయినాసరే చూడగానే వాస్తు చెప్పి ఆ ఇంటి యజమాని గుండెల్లో రాయిపడవేసే వాస్తురోగ పీడితుడు సుబ్రమణ్యం "అలాంటి కుక్క ఇంట్లోనే

కాదు... ఇంటి గుమ్మం ముందున్నా ఆ యింటి యజమానుఌకు అరిష్టం, అంతేకాదు ప్రాణాపాయం కూడా" అన్నాడు. ఆ మాటలతో సుబ్బారావుకి మతిబోయినంత పనైంది. ఇంతలో టైమైంది. తిరిగి ఎవరూ తోకాడించని కుక్కగురించి చర్చించే అవకాశం లేక పోయింది ఎవరిపనిలో వాళ్ళు పడ్డారు సుబ్బారావుకు మాత్రం ఎకౌంట్ బుక్స్ లోని రెండంకెలన్నీ తోకాడించనికుక్కల్లా కనిపించసాగాయి. పుస్తకాన్ని మూసి వుసూరుమంటూ నిట్టూర్చి కుర్చీకి జారగిలపడ్డాడు పనిచేసుకుంటూనే ఇతర్లను అందులో ముఖ్యంగా లేడీ ఎకౌంటెంట్లను ఓరకంటితో జాగ్రత్తగా కనిపెట్టే వెంకట్రావుకు ఈ దృశ్యం కళబడింది.

''కుక్కను గురించేనా ఆలోచన?''

''వెధవ కుక్కని విడిచిపెట్టి పారేయ కూడదూ?"

"విడిచిపెట్టినా పోదయ్యా బాబూ! అది పోయినా అవి ఊరుకోదు ''

"కుక్కలంటే మీ ఆవిడికి అంత ఇష్టమా?" సుబ్బారావుఅదోలా చూశాడు.

"డోన్ట్ మిస్టేక్ మి ... కొంతమందికి కొన్ని అభిరుచలుంటాయి. చూడు ...పైగా బిడ్డాపాపా లేరనుకుంటా ...ఓ పని చేస్తావ్?" ఏమిటన్నట్టు చూశాడు సుబ్బారావు. "మా యింటి పక్కన రెండు ఆల్షేషన్ డాగ్స్‌వున్నయి. రెండూ మగవే. ఒక కుక్కను ఎవరికైనా కావాలంటే ఇస్తానంటున్నాడు.''

"ఎవరతను?"

"మన బేంకులోఎకౌంటున్నవాడే... చలపతి లేడా.''

"ఫ్యాన్సీషాప్ ఓనరు.''

"ఆ! ఆ! అతనే"... వాళ్ళ సంభాషణ అంతటితో ఆగిపోయింది.

ఈ ఛాన్సు ఎవరన్నా కొట్టేస్తారేమోనని బేంకుపని కాగానే చలపతిరావు ఇంట్లో వాలాడు సుబ్బారావు. గొలుసులతో కట్టివున్న రెండు కుక్కలు ''భౌయ్" మని అరవడంతో బిగిసి పోయాడు అదృష్టవశాత్తూ చలపతి ఇంటిదగ్గరే వున్నాడు. అతిథి సత్కారాలయిన తర్వాత ఆవేశగా కుక్కలను చూస్తూ తను వచ్చిన సంగతి చెప్పాడు. "దానికేం ఒక కుక్కను తీసుకెళ్ళండి" అన్నాడు చలపతి. వ్యవహారం ఇంత సులభంగా చక్కబడుతుం దనుకోలేదు సుబ్బారావు. తేలిగ్గా నిట్టూర్చి "రేపు మంచి రోజు. రేపువచ్చి తీసుకెళతా"అని లేచాడు. "వచ్చేటప్పుడు డబ్బు కూడా తీసుకురండి"

"డబ్బా!" నోరు ఆవలించాడు

''లేకపోతే అల్షెషన్‌ని ఎవరు వూరికే ఇస్తారాండీ;''

'మీరు కుక్కల వ్యాపారం కూడా చేస్తారండీ?"

బిగ్గరగా నవ్వాడు చలపతి. "నిజమే

స్నేహంలో కొందరు ఉచితంగా కూడా ఇవ్వొచ్చు... అసలు నేను వ్యాపారినే కదా.''

"ఎంతేమిటి రేటు?"

''మీ కైతే నూట ఏ భై '' ఈమాటతో సుబ్బారావు కళ్ళు తేలేశాడు. "అసలు దీని ఖరీదు మూడొందలండీ" అన్నాడు. వెధవ కుక్క కూడా ఇంత డింమాడు వుంటుందనే నిజం ఇప్పుడు తెలుసుకున్నాడు సుబ్బారావు.

"వస్తా.'' బేరంసారం లేకుండా పరుగుతియ్యబోయాడు.

''అరెరె! ఏమిటండండీ- ఆగండి" సుబ్బారావు ఆగాడు.

''నిజం చెప్పొద్దూ రెండు కుక్కల్లో ఒకటి ఉచితంగా ఇస్తారని వెంకట్రావు చెబితే వచ్చానండీ''అని నీళ్ళు నమిలాడు.

"వెంకట్రావుగారి కయితే ఇస్తానన్నా."

"నన్ను పరాయివాడిలా భావిస్తున్నారా?" దీనంగా అడిగాడు.

అతన్ని చూసి నిజంగా చలపతికి జాలేసింది.

"సరే మీరెంత ఇవ్వాలను కుంటున్నారు?"

"ఊస లనుకోనిదే!"అన్నాడు సుబ్బారావు.

"అయితే ఓ పని చేయండి. ముందు ఒక యాభై రూపాయలిచ్చి పట్టుకెళ్లండి, తర్వాత చూద్దాం," అన్నాడు చలపతి. ఇక చూసేదేముంది...ఏభై రూపాయలకు ఆ కుక్క తనకు వచ్చినట్టే అనుకున్నాడు సుబ్బారావు. "రేపు డబ్బు తీసుకువస్తానండీ"అంటూ తిరిగి వెళ్లాడు

ఆ రాత్రి సుబ్బారావు భార్యతో అభి వల్ల జరిగే కీడు గురించి మిత్రుడు మణ్యం చెప్పిన సంగతి వివరించాడు ఆమెకు కూడా గుండెలు దడదడలాడాయి కాని ప్రాణంగా పెంచిన కుక్కను విడిచి పెట్టడం ఎలాగా అని ఆలోచనలో పడింది. దానికి ప్రత్యామ్నాయంగా అల్షెషన్ డాగ్‌ను తెస్తానని సుబ్బారావన్నాడు ''అల్షెషనంటే ఏమిటండీ?"అని అడిగింది అమాయకంగా. ''అవి ఈ కుక్కల జాతికే రాజుల్లాంటివి"అని సమయానుకూలంగా ఏదో చెప్పాడు.

"పాపం అభిని ఏంచేద్దామండీ?"

"ఈ చుట్టుపట్లలేకుండా తోలేయడమే." ఈ మాటతో మరీ బాధపడింది. ''పాపం తోకాడించకపోవడం దాని తప్పెలాగవుతుందండీ!" దీనంగాఅంది.

''అదుంటే మనం ఛస్తాం"అన్నాడు బిగ్గరగా. ఈ సారి సీత నవ్వలేక పోయింది "మీ ఇష్టం" అంది భారంగా.

మరునాడు ఉదయంనుంచి సీత మనసు బాగోలేదు. కుక్కను చూడకుండా తప్పించుక తిరగాలనుకుంది. కాని అభిమాత్రం ఆమెను వదలకుండా ఎక్కడ ఆమెవుంటే అక్కడికి వెళుతోంది. తను ఏం నేరం చేశానా అనే

అనుమానం అభీకి కలిగిందేమో! "మీ ఈ అలక్ష్యాన్ని భరించలేను కారణం ఏమిటి అన్నట్లుగా మొహంపెట్టి "భౌ" మని మొరిగింది. కుర్చీలో చతికిలబడ్డ సీత ఇప్పుడు చూడకుండా వుండలేక పోయింది. ముందుకాళ్లు నిగడదన్ని నిటారుగా కూర్చున్న అభి నుదురు చిట్లించి "ఎందుకు బాధపడుతున్నావ్" అన్నట్లు చూసింది అభికి కన్నీరు కని పించకుండా తల వంచుకుంది సీత అభి ఆమె దగ్గరకుచేరి పద్మాల్లాంటి ఆమె పాదాలను నాకింది. సీత వెంటనే లేచి, సుబ్బారావు రాత్రి తనకు తెచ్చిన నేతి లడ్డు పొట్లంవిప్పి దాని ముందుంచింది. అభి ఆనందంగా తింది దాని జీవితంలో అంత రుచికరమైన పదార్థం తినడం అదే మొదటిసారి కావడంతో సీతను మరీ ఆప్యాయంగా చూస్తూ నోరు చప్పరిం చింది. తోకాడించకపోయినా అభిలో వున్నకొన్ని మంచిలక్షణాలే సీతను మరీ ఆకర్షించాయి దొంగతనం చేయదు. పెట్టి పిలిస్తేగాని ఆహారాన్ని ముట్టదు. అభి ఆడకుక్క అయినా గేటు విడిచి బైటికి పోదు ఎంత మగమహారాజు లాంటి కుక్క వచ్చి గేటు దగ్గర్నుంచి తొట్టేసినా "జాగ్రత్త" అన్నట్టు గుర్రు పెట్టి బెదరగొడుతుంది. తన శరీరంపై ఏ కాస్త మలినం వున్నా నాలుకతో క్లీన్ చేసుకుంటేగాని నిద్రపోదు. దానికి పగటినిద్రే అలవాటు. రాత్రంతా కాపలా కాస్తుంది. సీత ఒక రోజున పొరపాటుగా దొడ్డి తలుపు మూయడం మర్చిపోయి పడుకుంది ప్రొద్దున్న పనిపిల్ల వచ్చే సరికి గుమ్మం వెలుపల రెండు కాళ్ళూ, లోపల రెండుకాళ్ళూ పెట్టుకొని కూర్చొ నుంది అభి. కన చీకట్లో పనిపిల్ల రావ డంతో మీదపడి పట్టుకొంది పనిపిల్ల కేకలతో, కుక్క అరపులతో సీత పరు గున వచ్చింది. 'అభీ' అని పిలవగానే ఆ పిల్లనువదిలి సీత పక్కకొచ్చి నిల బడింది. "తలుపు ఎవరు తీశారే" "తెరిచే వుందండీ" అని పనిపిల్ల సమా ధానం చెప్పింది. అప్పుడు తనుచేసిన పొరపాటు జ్ఞాపకం వచ్చింది. నోరులేని అభి తన యజమానురాలు చేసిన పొర పాటు గ్రహించి తెల్లవార్లూ దొడ్డివైపునే కాపలాకాసింది. వెంటనే సీత మోకాళ్ళ మీద కూర్చొని అది జంతువనేమాటే మర్చిపోయి దాని మెడను వాటేసుకొని నుదురు ముద్దుపెట్టుకుంది. కాని ఈ సంగతి సుబ్బారావుకు చెప్పలేదు. కన్నీ టితో కుక్కను చూస్తూ జరిగిన సంఘ టనలన్నీ గుర్తుకు తెచ్చుకుంటూవుంటే మళ్ళీ దుఃఖం పొంగుకొచ్చింది.

గేటు తీసిన చప్పుడుకావడం-పులిలా గొలుసు లాక్కుంటూ పెద్ద గొంతుతో అల్సెషన్ అరుచుకుంటూ రావడం సీతను మళ్ళీ ఈ లోకంలోకి తెచ్చాయి. బేంక్ ప్యూన్ గొలుసు పట్టుకున్నాడు.

అభి ఈ దృశ్యం చూసింది. తన

విరోధి వస్తున్నట్లు భావించిందేమో బలా బలాలు కూడా అంచనావేయకుండా 'భౌ' మంటూ వెళ్ళి అల్షెషన్‌మీద పడింది నన్ను జయించేవారెవరంటూ గర్వంగా లోనికి వచ్చిన అల్షెషన్ జానీ' వెళ్ళి గోడ పక్కన పడి పళ్ళికిలించించి మొర గడం ప్రారంభించింది. కాని అభి వూరుకోలేదు." ఇక్కడ నుంచి పోతావా లేదా అన్నట్టు మొరుగుతూ వార్నింగు ఇస్తోంది సుబ్బారావు ఎంత పిలిచినా వెనక్కి తిరిగిచూడలేదు. ఫ్యాన్ బెదిరి గొలుసు విడిచాడు. అభి అవకాశం చూసుకొని మళ్ళీ జానీమీద కురికింది సీత "అభీ, అభీ" అని అప్పటికే చాలా సార్లు పిలిచింది. సుబ్బారావు సీత ఏదో పెద్ద నేరంచేసినట్లుగా చూస్తూ బుసలు కక్కుతున్నాడు. సీత వెంటనే లోనికి వెళ్ళి కర్రతీసుకొని వచ్చింది ఆవేశంతో కోపంతో అభీని చావబాదింది. ఈ దెబ్బ లతో అభి నోరుమూసింది కన్నీటితో సీతకేసి చూసింది 'నేనేం తప్పుచేశా?' నన్నట్టు. సీత దాని మొహం చూడలేక కర్ర విసిరేసి దుఃఖం ఆపుకుంటూ ఇంట్లోకి వెళ్ళిపోయింది. సుబ్బారావుకు సీత ప్రవర్తన ఆశ్చర్యంగా తోచింది. కాని ఏమీ మాట్లాడలేకపోయాడు. అల్షె షన్ గొలుసు తను అందుకొని "అప్పల స్వామీ ఆకుక్కను చుట్టుపట్లకురాకుండా తోలెయ్యి" అని ఆర్డరు జారీచేశాడు. రాగానే తనను బెదరగొట్టిందనే కోపంతో అప్పలస్వామి సీతవిసిరేసిన కర్ర నందు కొని ఫో అంటూ ఆ ఊరకుక్కను ఒక్క దెబ్బ కొట్టాడు అది 'కుయ్యో' మంది హాల్లో కూర్చున్న సీతకు ఆ ధ్వని గుండెల్లో కలుక్కుమంది వెంటనే బైటకువచ్చింది. అప్పలస్వామి మరో దెబ్బ వేశాడు.

"అప్పలస్వామీ'' సీత ఆవేశంగా అరి చింది అప్పలస్వామి భయంగా చూశాడు. ''ఆ కుక్క నెందుకు కొట్టావ్?''

"అదేంటమ్మాగారు... అయ్యగారు తోలెయ్యమన్నారు... పైగా మీరే కొట్టారు గదా అన్నాడు.''

''నేను కొడతాను... నా ఇష్టం. అది నేను పెంచిన కుక్క పెట్టిన వాళ్ళకే అధికారం వుంది. మధ్యన నువ్వెవడవ్.''

అప్పలస్వామి అయోమయస్థిలో పడ్డాడు. "అప్పలస్వామీ, నువ్వెళ్ళు'' అని సుబ్బారావు పంపించివేశాడు. ''సీతా ఈ కుక్కనచూడు'' అంటూ సీతను ఓదార్చే ఉద్దేశంతో జానీని చూపించాడు. కాని సీత దృష్టి గేటుదగ్గర నిలబడ్డ అభీ మీదేవుంది.

''అభీ! నువ్విక్కడినుంచి వెళ్ళిపో. నువ్విక్కడకు ఎప్పుడూ రావద్దు-పో'' ఆఖరిమాట దుఃఖపూరితంగా వచ్చింది. ఆమె మనోవేదన అర్థంచేసుకున్నట్టు అభి తలవంచుకొని మౌనంగా గేటుదాటి వెళ్లి

పోయింది సీత కళ్ళుమూసుకొని ఏడ్చింది. "సీతా" భయంగా పట్టుకున్నాడు సుబ్బారావు "అది కుక్క కాదండీ...మాటలొచ్చిన మనిషికన్నా మంచిదండీ...తెలివైనదండీ" అంది.

అప్పుడే కథ అయిపోలేదు సీత రెండుమూడు రోజులు అన్నం సరిగ్గా తినలేదు ఇంచుమించు బిడ్డకోసం బెంగపెట్టుకున్న తల్లిలా అయింది. ప్రతిక్షణం తనను నీడలా అంటిపెట్టుకు తిరిగే అభి జ్ఞాపకం రాసాగింది. కాని సుబ్బారావు బాధపడకూడదనే వుద్దేశంతో పైకిమాత్రం జానీని కూడా జాగ్రత్తగా చూడసాగింది అయితే జానీ పెంపకం ప్రత్యేకం. దాని వంట వేరు. దాని తిండి వేరు. ఆ దంపతుల కది పెద్ద సమస్యే అయింది. జీతంలో సగం డబ్బు దానికి ఖర్చయ్యే స్థితికి వచ్చింది. సీత ఈ కుక్కను చూసుకుంటూ అభీని మర్చిపోతే అంతే చాలనుకున్నాడు సుబ్బారావు. సీత కూడా జానీలో అభీని చూడడానికి ప్రయత్నిస్తోంది ఎప్పుడైనా అభి వస్తుందేమోనని అప్పుడప్పుడు గేటుదగ్గర కెళ్ళి చూసేది సీత. కాని అభిమాత్రం తిరిగి ఏనాడూ కనిపించలేదు ఒక నెల గడిచేసరికి క్రమక్రమంగా జానీ సీత మనసులో అభి స్థానాన్ని ఆక్రమించుకుంది. అభిలాగే సీతను విడవకుండా అనుసరించేది సీతలో కూడా రానురాను అభి గుర్తులు మాసిపోసాగాయి.

ఆ రోజు ఆదివారం. సుబ్బారావు ఇంటిదగ్గరే వున్నాడు. సీతకు అష్టాచెమ్మా ఆడ్డమే తెలుసు హాల్లో భార్యాభర్తలిద్దరూ అదే ఆట ఆడుతున్నారు. జానీ దగ్గర్లో కూర్చొని ఆ ఆటను విచిత్రంగా చూస్తోంది

"సుబ్బారావుగారూ" అని పిలుపు వినిపించి ఇద్దరూ అటు చూశారు. చలపతి.

"రండి" అని సుబ్బారావు ఆహ్వానించాడు సీత లోనికి వెళ్ళింది జానీ చలపతిని చూడగానే తోకాడిస్తూ మీద కురికింది. నాలుకతో అతని శరీరాన్నంతా నాకింది. "అబ్బ వుండవే... నీకోసమే వచ్చాలే" అంటూ వారించాడు. 'ఎలావుందండీ మనజానీ.' ప్రశ్నించాడు. "మమ్మల్ని తింటోంది" ముక్తసరిగా సమాధానమిచ్చాడు సుబ్బారావు. చలపతి నవ్వాడు. సీత కాఫీలు తెచ్చింది. కాఫీ తీసుకున్నతర్వాత చలపతి "కుక్కసరదా తీరిపోయినట్టుంది. ఇక తీసుకపోనా" అన్నాడు. సుబ్బారావు ఆశ్చర్యంగా చూశాడు

"ఏమిటలా చూస్తారు ? "కుక్కను తీసుకెళ్ళడమేమిటి? ఎభైరూపాయలిచ్చి మీ దగ్గర నేను కొన్నాను." అన్నాడు. ఇప్పుడు కూడా చలపతి నవ్వాడు. "ఎంత అమాయకులండీ. అల్సేషన్ డాగ్ ఏభై రూపాయలకు రాదని ఆ నాడే చెప్పాను."



"మరెందుకు కిచ్చినట్టు?"

"ముచ్చట పడుతున్నారు కాబట్టి... ఏభైరూపాయలిచ్చి ఒక నెల వుంచుకోమన్నాను."

"చంపతీ" కోపంగా అరిచాడు. సీత భయపడింది.

"ఏం" ఎర్రగా చూశాడు.

"అన్యాయం! ఇంతవరకూ దీని కోసం రెండు వందలు ఖర్చుచేశాను."

"ఊరికే ఖర్చుపెట్టారా? మీ ఇల్లు కాపలా కాసింది కాబట్టి ఖర్చుపెట్టారు" అన్నాడు నిర్లక్ష్యంగా.

సుబ్బారావు ఆ మొరటు మనిషిని జయించడం కష్టమనుకొన్నాడు ఒక నిర్ణయానికి వచ్చి "సరే యాభై ఇచ్చి తీసుకెళ్ళండి"

"ఇంతకాలం మీ దగ్గరుంచి నందుకు అడ్వాన్సుగా ఆ ఏభై రూపాయలూ తీసుకున్నాను. ఇప్పటికైనా అర్థమయిందా."

"అర్థమయింది మీరు వట్టి వ్యాపారస్తులేకాదు...దొంగ వ్యాపారస్తులని."

"సుబ్బారావ్! మర్యాదగా మాట్లాడు."

"లేకపోతే ఇది మర్యాదంటావా?" ఎదురు ప్రశ్న వేశాడు సుబ్బారావు

"మర్యాదస్తుణ్ణి కాబట్టే ఆ రోజూ, ఈరోజూ ఒకే మాటమీదున్నా. ఇది మూడు వందల రూపాయలు విలువచేసే కుక్క ...మీకు కావాలంటే సగం రేటు కిస్తా మిగతా వందా ఇటు పారేయండి" చేయిచాశాడు అతని లౌకికానికి సుబ్బారావు కోపంతో వణికి పోతున్నాడు భర్త అయోమయస్థితిని చూసి "కుక్క

మాకు అవసరం లేదండీ ...మీరే తీసుకెళ్ళండి" అంటూ సీత కంగారుగా భయంగా చెప్పింది.

"ఆడదానికున్న ఆలోచన లేదు .. పైగా పెద్ద ఎకౌంటెంటు" అంటూ గుమ్మం దాటాడు. కుక్క అతన్ని అనుసరించింది. ఆఖరిమాటతో సుబ్బారావు తన్ను తాను మరచాడు "రాస్కెల్ ఏం పేలావ్" అంటూ వెనక బడ్డాడు. వెళ్ళే చలపతి గేటుదగ్గర వెనక్కి తిరిగి "జానీ కేచ్ హిం" అంటూ సుబ్బారావుని చూపించాడు. జానీ భౌ మంటూ వెళ్ళి ముందుకాళ్ళు రెండూ సుబ్బారావు గుండెలమీద వేసి పీకపట్టుకోవడానికి ప్రయత్నిస్తోంది. సీత కెవ్వున అరచింది.

ఇంతలో ఎక్కడ నుంచి వచ్చిందో అభి "భౌ" మంటూవెళ్ళి జానీ పీకపట్టుకుంది. ఈ హఠాత్ పరిణామానికి అంతా విస్తుపోయారు. సీత దుఃఖంతో సంతోషంతో ఊగిపోయింది. జానీ తన ప్రయత్నాన్ని విరమించినా అభి వూరుకోలేదు. తరిమి తరిమి జానీని కరుస్తోంది జానీ పారిపోయింది. చలపతి బెదిరించబోయాడు. ఇప్పుడు సుబ్బారావుకు పట్టిన గతే చలపతికి పట్టింది. రెండుకాళ్ళూ చలపతి గుండెలమీద వేసి భయంకరంగా మొరుగుతూ పీకపట్టుకోవడానికి ప్రయత్నిస్తోంది అభి

చలపతి భయంగా "సుబ్బారావ్" అని అరచాడు. ఇప్పుడు సుబ్బారావు ధీరోధాత్తుడయ్యాడు.

"అది నీలాగా... నీ జానీలాగా విశ్వాసంలేనిది కాదు. పిరికిదీ కాదు. ఏ భై రూపాయలూ నాముందు పడితేగాని అది నిన్ను విడిచిపెట్టదు." కంగారుగా చలపతి వణికేచేతులు కోటు జేబులో పెట్టి అయిదు పదిరూపాయల నోట్లు తీసి ముందుకు విసిరాడు. చలపతిమీది మళ్ళీ మొరిగింది అభి సీత "అభి" అని పిలిచింద. అభి చలపతిని వదలి సీతదగ్గరకొచ్చి నిలబడింది. 'బ్రతుకు జీవుడా' అనుకొని చలపతి వూడిపోయే పంచెని వెనకదోపుకుంటూ గేటుదగ్గర ఒకసారి బోల్తాపడి లేచి పారిపోయాడు. ఈ దృశ్యాన్ని చూసిన సుబ్బారావు సీతే కాదు అక్కడ పోగైన వారు కూడా విరగబడి నవ్వుకున్నారు. "నేను మంచిపనిచేశానా" అన్నట్టు చెవులు రిక్కించి, సుబ్బారావును మార్చి మార్చి చూసింది అభి. తన భర్త అవమానాన్నే కాదు ప్రాణాన్నికూడా కాపాడిన ఆ మూగజీవి మెడను వాటేసుకొని నుదురుపై ముద్దుపెట్టుకుంది సీత. సుబ్బారావు కూడా మోకాళ్ళమీద కూర్చుని "అభీ" అని ప్రేమగా పిలిచాడు సీతను విడచి సుబ్బారావు దగ్గర కొచ్చింది

"ఏది ఏమైనాసరే ఈ జన్మలో నిన్ను విడిచిపెట్టలేం అభీ" అంటూ ఆప్యాయంగా తలపై మెల్లిగా స్పృశించాడు.

"ఏమండీ!" సీత హఠాత్తుగా అరిచింది. ఏమిటని సుబ్బారావు భయంగా చూశాడు. సంతోషంతో ఉబ్బితబ్బిబ్బవుతూ సీత "చూడండీ మన అభి తోకాడిస్తోంది". సుబ్బారావు ఆశ్చర్యంగా చూశాడు. నిజమే అభి ఇప్పుడు సంతోషంతో తోకాడించడమేకాదు చక్రంలా తిప్పుతోంది

---




శ్రీనివాసరావు క్యాంపునుంచి తిరిగి వచ్చి ఆయాసంగా కుర్చీలో కూర్చున్నాడు! తనతో తిరిగి వచ్చిన హోల్డాలు, చేతిసంచీ, గొడుగూ ఎదురుగా కనిపిస్తున్నాయి. కుప్పగా ఒకదాని మీదొకటి గిరవాటు పెట్టి వెళ్ళిపోయాడు కూలివాడు బేడయిస్తే తక్కువని నసిగాడు వాడు. ఎక్కువివ్వటానికి అభ్యంతరంలేదు. కాని తనదగ్గర అంతకుమించి...చిల్లర లేకపోయింది.

"ఏంవండీ, చడీచప్పుడూ లేకుండా వచ్చి కూర్చున్నారే! ఇందాకటినించీ మీ కోసమే చూస్తున్నా...ఇవాళ బస్సు లేటయిందేంవిటీ?" అంటూ శ్రీమతి ప్రవేశించింది..."ఇదుగో, ఇంట్లో బియ్యం నిండుకున్నాయి; ఆదివారం కాబట్టి పర్వాలేదు ఆలస్యమైనా...మీరు కాస్త బజారు వెళ్ళొస్తే అంతలో స్నానానికి వేన్నీళ్ళుకూడా రెడీ అవుతాయి."

డబ్బూ, సంచీ తీసుకురా" అన్నాడు శ్రీనివాసరావు

"డబ్బు! అదేవో మీదగ్గరే వుండాలి!...అదుగో సంచీ, మీరు క్యాంపుకు తీసుకెళ్ళినదాన్నే కాళీ పట్టుకెళ్ళండి...ఆ రెండోది కాస్తా ఎలుకలు కొరికేశాయి."

"నా దగ్గర డబ్బులేదే...ఎట్టాగ మరి?"

"ఎట్టాగ అని కూచుంటే ఎలాగండీ? విచిత్రంగా వుంది... క్యాంపునుంచి వస్తున్నారుగదా తెస్తారనుకొన్నాను."

ఎదురుగా వున్న హోల్డాలూ, సంచీ,

గొడుగూ వైపు నిశ్చలంగా దృష్టి నిలిపి శ్రీనివాసరావు చిన్ననవ్వు నవ్వాడు...

"మంచిదానివే !...ప్రక్కవాటాలో వాళ్ళని బదులడుగు."

"వాళ్ళకిప్పటికే రెండు శేర్లుదాకా యివ్వాలి మనం...ఇహ డబ్బా ? డబ్బు ఆవిడదగ్గ రెక్కడుంటుంది, పాపం... మీరే వెళ్లి ప్రయత్నించండి."

శ్రీనివాసరావు కదల్లేదు ; దుమ్ము నిండిన సామానువైపు పరిశీలనగా చూస్తూ, పరధ్యానంగా కూర్చున్నాడు.

కొన్ని క్షణాలు నిదానించిన శ్రీమతి—"ఎవరైనా స్నేహితుల్ని డగండీ ! .. అలా కూచుంటారేమిటి ? ఏమీ పట్టనట్టు ! పెద్ద వేదాంతిలా... పలక్కుండా, జవాబు లేకుండా కూర్చోటం అలవాటు చేస్తున్నారేమిటీ నన్నేదో సాధిస్తున్నట్లు ! వేగిరం కద లండి మరి...లేకపోతే యీ పూట పస్తే !" అన్నది.

శ్రీనివాసరావు లేచి నుంచున్నాడు. "...అది కాదు... రాధా, ఒక్కపూట అన్నం లేకపోతే ప్రపంచం తలక్రింద వుతుందంటావా ?"

''ఏం మాటలండీ ; బాగుంది... పెళ్లాం పిల్లలు పస్తుంటారంటే మీకేం చీమకుట్టినట్లు కూడా లేదన్నమాట !... అయినా, వెళ్ళి జరిగే పనేమిటో చూడ కుండా, ప్రపంచాన్ని గురించి వైరా గ్యాలు మాట్లాడుతూ కూచుంటా రేమి టంట ?"

"నువ్వు అరవబోక...ఇదుగో... ఏం లేదులే !...వెళ్తున్నా ! అంటే, నేననేది మరేమీ విపరీతం కాదు ; ఈ పూట అన్నం మానేసి రాత్రికి వండు కుంటే యింతలో జరిగే ప్రమాదం ఏమిటి అని అనుమానం !"

"ఏం ప్రశ్నలండీ !...అసలు పస్తుం డాల్సిన కర్మమేంకాలింది ? అంత దరిద్రం మనకేమొచ్చింది ?...ఇబ్బం దులు ఎవరికైనా వస్తాయి...కానీ, ఎట్లాంటి యిబ్బందులు వచ్చినా పస్తు పడుకునేంత దరిద్రం మనకెన్నడూ రాదు...ఎట్లాంటివాళ్లు పస్తుపడుకునేది ! ఊరికే కబుర్లు చెప్పక వెళ్లిరండి... పుణ్యముంటుంది "

శ్రీనివాసరావు బయలుదేరాడు గొడుగూ, సంచీ పుచ్చుకొని...రాధతో వాదించి ప్రయోజనంలేదు...అసలు ఎవరు మాత్రం యీ విషయంలో తనతో ఏకీభవిస్తారు.. నిజంగానే, ఒక్కపూట పస్తుంటే ఏం పుట్టిమునుగ తుందో ! బాగా ఆకలివేసి రెండోపూట అన్నం రుచి స్తుంది. అంతేగాక !...కాని, ఒకపూట పస్తుండిపోతే...ఏదో అవమానం. ఎంతోమేర సాంఘికంగా దిగజారి నట్లు... అయ్యో ! తినటానికి లేక పస్తున్నాం !' ఆ మాటలో ఏదో పెద్ద

దిగులు! "పిల్లలు కడుపులు వెన్నంటుకు పోయి అలమటిస్తుంటే కళ్ళతో చూశాం...తల్లి, దండ్రీ యిద్దరమూ బ్రతికివుండీను!" అని ఏడుపు, తిట్టుకోటం, ఏదో మహాఘోరం జరిగిపోయి నట్లే బాధపడడం...ఇక తర్వాత, తర్వాత— "ఫలానారోజు, బియ్యం లేక, అవి తెచ్చుకోటానికి చిల్లిగవ్వలేక, పస్తుపడివున్నాం"...అంటూ జీవిత చరిత్రలో ప్రధానఘట్టం కింద చిత్రించుకోవటం.. ఈ గోలంతా ఒక్కపూట తిండిని గురించే!! కోఆపరేటివ్ జూనియర్ ఇన్‌స్పెక్టర్ చేస్తున్న మానవుడి జీవితంలో యిలాంటివే మైలురాళ్ళు!

శ్రీనివాసరావు హెడ్‌క్లార్కు రామనాథంగారి దగ్గరకు వెళ్దాం అనుకుంటూండగానే పిలిచాడు కృష్ణమూర్తి . . . "ఏం, శ్రీనివాసులూ! మొగళ్ళపాలెం నించి ఎప్పుడొచ్చావ్...ఈ బస్సు కేనా?... మొగలి రేకులు తెచ్చావా?... మా పెద్దమ్మాయి సరదా పడుతుందోయ్!...'ఇవ్వాళ మామయ్య క్యాంపు నించి వస్తాడు, తెస్తాడు లేవే' అన్నాను"... 'కూరల సంచీ సైకిలుకు తగిలించుకొని, మొహంమీద జలపాతలాం ప్రవహిస్తూన్న చెమట తుడుచుకొంటూ, మూడణాల మొగలిపూల కోసం లేనిబాంధవ్యాన్ని నొక్కి చెప్పుతూ, నవ్వుతూ, ఆసగానిల్చున్నాడు కృష్ణమూర్తి.

"నా దగ్గర డబ్బులేదు. తీసుకురా లేదోయ్!...ముందే చెప్పరాదూ?"

కృష్ణమూర్తి ముందే చెప్పడు. చెప్పితే డబ్బు ఇచ్చుకోవల్సి వస్తుందేమోనని!

"కరణానికి చెప్పలేకపోయావ్? బంట్రోతుగాళ్ళని వురమాయించేవాడు..."

"వాటి విషయం అనుకోలేదు ఇంట రెస్ట్ రేదు... సరే, బ్రదర్! ఒక అయిదు రూపాయలు కావాలి అర్జంటుగా... బియ్యం తీసుకెళ్ళాలి యింటికి..." కృష్ణమూర్తి ముఖంలో నవ్వు మాయమైంది... "సారీ బ్రదర్! ఇవ్వాళ ఇరవైమూడో తారీఖు అని మరచిపోయావు కాబోలు! మనం అంతా ఒక బోటులోనే ప్రయాణం!" అంటూ సైకి లెక్కి రివ్వున మాయమయ్యాడు...

శ్రీనివాసరావు రామనాథంగారి యిల్లు చేరుకునేటప్పటికి ఆయన భోజనానికి కూర్చున్నాడని తెలిసింది. వరండాలో నిల్చున్నాడు శ్రీనివాసరావు. చెమటపోస్తూ చాలా చిరాగ్గావుంది... బస్సులో రద్దీ...ఇద్దరు లావుపాటి మనుష్యులమధ్య బస్సు కుదుపులకు బాగానలిగిపోయాడు ..తలనిండా, ఒంటి నిండా దుమ్ము...చెమటతో కలిసిన దుమ్మునృర్శ తుడుచుకోటానికి ప్రయత్నించినప్పుడల్లా, అసహ్యంగా వుండేది. బస్సుదిగివెళ్ళగానే స్నానం చేసి, మంచంమీద వాలుదామనుకొన్నాడు

ప్రయాణంలో వున్నంతసేపూ...కాని ఆ యోగం పట్టలేదు...మెల్లగా నడినెత్తి కెక్కుతున్న సూర్యుడు రామనాథంగారి వరండాలో విజృంభిస్తూ, దేహాన్నీ, బట్టల్నీ, చివరికి ఉనికినే దుర్భరం చేస్తున్నాడు.

అసహ్యంనించే కాస్సేపటిలో నిర్లిప్తత పుట్టుకురావటం గమనించాడు శ్రీనివాసరావు. అప్రయత్నంగా ఎండి పోయిన పెదవులు నాలుకతో తడుపుకొంటూ...ఎదురుగుండాఉన్న యింటి కిటికీవైపు చూశాడు...కిటికీ తలుపు ఓరచేసుకొని రెండుకళ్లు తనవైపు కేంద్రీకృతమై ఉండటం తెలిసింది—ముఖం మీద చెమట తుడుచుకొని, జుత్తుకాస్త సవరించుకొని, ఠీవిగా నిల్చుందామనిపించి, చెయ్యి జేబురుమాలుకోసం పంట్లాం జేబులోకి వెళ్లింది తటాలున... కాని మళ్ళీ అక్కడే జేబులోనే ఆగిపోయింది... నిర్లిప్తంగా శ్రీనివాసరావు తనదృష్టి రోడ్డువైపు మళ్లించాడు... కుక్కలు రెండు పరస్పరం మూచూచుకుంటూ వలయాకారంగా తిరుగుతున్నాయి.

శ్రీనివాసరావు పెద్ద విసుగు పుట్టుకొచ్చి అక్కడినుంచి వెళ్లిపోదామనుకున్నాడు...ఏం, పట్టిచేతుల్తో యింటికి వెళ్తేయేం? రాధ మొత్తుకోవటం, పిల్లల గోల...అంతకన్న ప్రమాదం ఏమీజరగబోదు కదా! వరాండా మెట్టొకటి దిగబోయాడు వెళ్ళిపోవాలని శ్రీనివాసరావు. కాని, రామనాథంగారు తలుపుతెరచి లోపలికి రమ్మని పిలిచారు...సరే, తప్పదు!

''ఏమిటోయ్, ఈమధ్య కనిపించనే లేదు!... మీ నాన్నగారు కులాసాయేనా?...ఇప్పుడాయన మీ అన్నయ్య దగ్గర కదూ ఉంటోంది? నెల్లూరా?"

శ్రీనివాసరావు చెవులు మూసుకోలేదు గాని, వినటంమాత్రం మానివేశాడు...

''...పాపం కదూ!" అని ఆగారు రామనాథంగారు.

"అవును'' అని అంగీకరించాడు ఏమిటో తెలీకుండానే.

''నలుగురు పిల్లలోయ్...అకస్మాత్తుగా ఆమె పోయిందా. యిహ ఆ సంసారం గతేం కావాలి, ఆలోచించు, ఏమిటో యీ కష్టాలు!"

''అవును...పాపం'' అన్నాడు ఆయన్ని ప్రతిధ్వనిస్తూ.

"ఈ వార్త విన్నప్పట్నించీ మా యింటిల్లిపాదీ విచారంలో మునిగిపోయామనుకో!"...త్రేవు మని త్రేన్చారు రామనాధంగారు త్రేనుపు ఆపుకోవటం సాధ్యంకాదు......దానికి సందర్భ శుద్ధి తెలీదు...రామనాథంగారు అన్నవాహికను సరిచేసుకుంటూ ఆగిన అవకాశం పోగొట్టకూడదని శ్రీనివాసరావు సొంతవిషయానికి వచ్చేశాడు వెంటనే...



"ఏమండీ......నాకో పది రూపాయలు అర్జంటుగా కావాల్సి వొచ్చాను... గంట క్రితం క్యాంపునుంచి వచ్చాను, యింటో బియ్యం నిండుకున్నాయి. చేతిలో కానీ లేదు!"

"ఆఁ...పది రూపాయలు నెలాఖరులో నా దగ్గరమాత్రం ఎక్కడుంటాయోయ్!...మా ఆవిణ్ణి అడుగుతానుండు..."

లోపలికివెళ్ళి అయిదురూపాయలు తెచ్చియిచ్చారు.

"చాలా థాంక్స్ సార్......జీతం రాగానే యిస్తాను...సెలవు."

* * *

స్నానంచేసి, భోజనం చెయ్యగానే కుసుకు పట్టింది శ్రీనివాసరావుకు...... 'క్యారు'మని ఉయ్యాలలో చంటిది ఏడవటంతో మెలకువ వచ్చింది..."అబ్బ, పాడు గోల;...రాధా రాధా"...కేక వెయ్యాలన్న మామూలు ఉద్రేకం...... వచ్చికూడా, అంచుదాటని పాలపొంగులా చల్లారిపోయింది...కేకలు వెయ్యకుండా అలానేచూస్తున్నాడు...రాధవచ్చి పిల్లని తీసుకువెళ్ళింది...... రెండోవాడు.. ఏణ్ణర్ధం వయస్సు...మూత్రంపోసి, ఆ మడుగు రెండు చేతుల్తో తట్టుతూ ఆనందిస్తున్నాడు...శ్రీనివాసరావు గోడవైపు తిరిగి పడుకున్నాడు...గోడ మీద డాగులు...అందులో రెండు చారలు.. నల్లి రక్తం తాలూకు..."అదుగో నల్లి పోతుంది వెళ్ళిపోతుంది...చంపాలి!" ...ఎడమచేతి బొటనవ్రేలితో...ఊఁ లోపలి ప్రేరేపణకు చెయ్యిమాత్రం కదల్లేదు...శ్రీనివాసరావు చూస్తూ ఉండిపోయాడు... 'నల్లి వెళ్ళిపోయింది! ఇహ కనపడదు!' ...పోనీ...ఏం మునిగిపోయినట్టు?

"ఏమండీ...కాఫీ......లేచి మొహం కడుక్కోండి!"

కాఫీత్రాగి మళ్ళీ మంచంమీద కూర్చుండేరా ధ...చంటిదాన్ని తెచ్చి ఒళ్ళోపెట్టింది..."ఇవాళటికి యింటోనే వుంటారు కదూ!"

"లేదు...అలా వెళ్ళి రావాలి."

రాధ అన్నందుకే బయలుదేరాడు... ఎక్కడికి?... యాంత్రికంగా కాళ్ళిడ్చుకుంటూ చెరువుకేసి నడుస్తున్నాడు...... రైలుగేటు దగ్గరకు వచ్చేప్పటికి రైలు వచ్చేసింది...గేటు మూశారు...నిలుచున్నాడు. రైలుపెట్టెలోంచి వింతగా మనుష్యులు తనవైపే చూస్తున్నారు! వేగంగా పెట్టెలు ఒకదాని తర్వాత ఒకటి పను షల్లో వెళ్లిపోతున్నాయి, టకా- టక్ టకా-టక్ శబ్దం చేసుకుంటూ.

గేటు తెరిచారు. టకా-టక్ టకా-టక్ చెవుల్లో మోగుతూనే వుంది......తలుపులు మూసుకొని కిటికీసందుల్లోంచి తొంగిచూస్తూ కూచుంటారు .ఎలుకల్లా.. బొరియల్లో పందికొక్కుల్లా...టకా-టక్, టకా-టక్ వెళ్ళే రైలుపెట్టెల్లో...పాకు మనుషులు!...ఆ రైలుకోసం తనెందుకు ఆగాడు. ఆగకపోతే.. తన దేహం రైలుక్రింద పడుతుంది...అప్పుడు తప్పకుండా రైలు ఆగిపోతుంది!... బోనుల్లోని ఎలుకలూ, బొరియల్లోని పందికొక్కులూ బిలబిలా వచ్చి గుంపుగాచేరి, గలగలాశబ్దం చేస్తాయి...

శ్రీనివాసరావు చెరువుగట్టుమీద కూర్చుని నీళ్ళవైపు చూశాడు...తనకు నీటి ప్రమాదం లేకుండా చెయ్యాలని చిన్నప్పుడు తండ్రి పట్టుపట్టి ఈత నేర్పించాడు...ఎంత జాగ్రత్త!... ప్రాణాలు ఎక్కడ తప్పించుకొని పారిపోతాయేమోనని భయం...ప్రతిదీ యిలాగే...తండ్రి చెప్పినవన్నీ తు.చ. తప్పకుండా ఆచరించాడు...ఇంకా ఆచరిస్తున్నాడు...ఫలానావాళ్ళతో స్నేహం వద్దంటే మానుకున్నాడు; ఫలానా పుస్తకాలు మంచివి, చదవమంటే చదివాడు; తప్పకుండా పరీక్షలు పాసవమంటే అయ్యాడు; బి.ఏ. లో క్లాసు రావాలంటే, క్లాసు తెచ్చుకున్నాడు; ఫలానా అమ్మాయిని చేసుకో, చాలామంచి సంబంధం అంటే చేసుకున్నాడు. పిల్లల్ని కన్నాడు...తండ్రీ, పెద్దలూ మిగతా వాళ్లూ, అందరూ ఏది మంచిది అంటారో అంతా అలానే చేశాడు...యీ కో-ఆపరేటివ్ ఇన్‌స్పెక్టరు గిరీ—సర్కారు ఉద్యోగం—ఆలస్యం చెయ్యకు, వెంటనే ప్రవేశించు, మంచిది అంటే డిగ్రీ పుచ్చుకున్న ఏడాదే, అందరి సమ్మతి ప్రకారం ప్రవేశించాడు...పై అధికారులు చెప్పింది చేస్తున్నాడు; ఎప్పుడూ తిరగబడలేదు. పనిచెయ్యకుండా తప్పించుకోలేదు. అబద్ధాలు చెప్పలేదు; లంచాలు తీసుకోలేదు ఇక తను చెయ్యవలసిందేమిటో ఎవరూ చెప్పలేదు...ఇప్పుడు చెప్పటంలేదు. రాధమాత్రం దినకార్యక్రమం చెపుతూ వుంటుంది. "ఏమండీ, మొహం కడుక్కోండి...కాఫీతాగండి ...స్నానం చెయ్యండి ... భోజనం చెయ్యండి...బజారుకు వెళ్ళండి...ఇక పడుకోండి, దీపం ఆరిపివేస్తాను..." ఇదీ జీవితం అంటే...

మరి దీన్లో ఏమి విశేషంవుందనీ... కాకపోతే, తనలాంటివాళ్లు యీ జీవితం నుంచి ఏం విశేషాన్ని ఎట్లా సృష్టించ గలరనీ... ఊరికే మభ్యపెట్టటం చిన్న ప్పట్నించీ!..."ఇదిగో అబద్ధం చెప్ప బోక...అందరికీ మంచిగావుండు... తల్లిదండ్రుల్ని గౌరవించు...అణకువ, విధేయత నేర్చుకో..." గౌతమబుద్ధు నిలా కావచ్చుననే ఆశ చూపెట్టడం... నీతి, నీతి...మరి యీనీతికీ ఆదర్శాలకి బద్ధుడైన తన జీవితం యిట్లా రైలు పెట్టెలా, బుంద గుంటలా తయార వటం ఎందువేత?...తను యింకేం చెయ్యాలి?...చెయ్యాల్సినదేమీలేనప్పుడు జీవితంనుంచి నిష్క్రమిస్తే ఏమి? చావంటే పూర్వమేదో భయం వుండేది... యిప్పుడాభయమేమీ లేదు...తనకు నీటిపల్ల చావులేదు...రైలుక్రింద పడు కుంటే...గమ్మత్తుగా వుంటుంది...జీవి తానికి అటువేపు ఏముందో చూడవచ్చు.

శ్రీనివాసరావు తిరిగి వస్తూంటే గోపాలం కనిపించాడు...గోపాలం హైస్కూల్లో టీచరు... "సినిమాకు వస్తారా, ఇన్‌స్పెక్టరుగారు!..." అర్ధం లేని వ్యంగ్య ధోరణి!

"డబ్బు లేదోయ్"

''నేను తీసుకువెళ్తాను రావయ్యా... చాలా బాగుందంటున్నారు!" చెయ్యి పుచ్చుకుని లాక్కువెళ్లాడు గోపాలం... పంద్రెండణాల టిక్కెట్టు కొన్నాడు.

జానపద చిత్రం...అరగంట తర్వాత కూర్చోబుద్ధెయ్యలేదు శ్రీనివాస రావుకు..."గోపాలం! సినిమాలో యింటరెస్టు పుట్టటంలేదు...నేను వెళ్తా నోయ్!"

"అదేమిటి! ఎందుకని? తలనొప్పా?"

"లేదు...ఊరికెనే.''

"ఏమిటోయ్! కారణమేమీ లేకుం డానే! ఇదుగో యిహ హీరోయిన్ డాన్సు వుంటుంది...కాస్తవుండు, ఎంజాయ్‌చేస్తావు... ఇంటరెస్టు దానంత టదే పుట్టుతుంది...''ఆ ఎంజాయ్‌మెంటు తనతో పంచుకుంటేనేగాని తృప్తిలేద న్నట్టు ప్రాధేయపడ్డాడు గోపాలం.

హీరోయిన్ డాన్సు ప్రారంభమైంది. సగం తర్వాత మళ్ళీ శ్రీనివాసరావు అన్నాడు..."వెళ్తానోయ్!''

"పంద్రెండణాలు పెట్టాను బాబు. సగం విలువైన వస్తుంది ఇంటర్వెల్ దాక వుండవోయి!"

నిజమే...డబ్బు దండగ పోవటం దేనికి? ఇచ్చిన డబ్బుకోసమైన చివరి దాకా కూచోవలసిందే...అదే అందరూ చేసేపని...లేకపోతే, తనేం ధనవం తుడు, డబ్బు నిర్లక్ష్యం చెయ్యటానికి? గోపాలం వదలిపెట్టడు...డబ్బు వృథా కానివ్వడు...తగిన కారణం లేకుండా వెళ్ళటానికి వీల్లేదు...

"గోపాలం! మా చంటిదానికి వంట్లో వెచ్చగావుందని చెప్పింది మా ఆవిడ...

నా కోసం కనిపెట్టుకుని వుంటారేమో యింటిదగ్గర...అబద్ధంచెప్పాడు.

"నిజంగానే?...యీ సంగతి ముందే ఎందుకు చెప్పలేదోయ్?...సినిమా ప్రొప్రైటర్‌కి ఉత్తపుణ్యానికి చెల్లించావు ...మంచివాడవే?" విసుక్కున్నాడు

"మరేమనుకోకు...వెళ్తాను"

శ్రీనివాసరావు యిల్లుచేరేటప్పటికి పెద్దవానికి అన్నం పెట్టుతూ వుంది శ్రీమతి...మిగతా యిద్దరూ నిద్రపోయారు...కండువా చిలక్కొయ్యకి వేసి, చాప తీసుకొని డాబామీదికి వెళ్లాడు శ్రీనివాసరావు. చాపమీద వెల్లకిలా పడుకున్న తర్వాత నక్షత్రాలకేసి చూస్తూ ప్రశ్నించుకున్నాడు..."రైలు పట్టాలమీద పడుకునే దెప్పుడు?" "ఎప్పుడో ఒకసారి, వెధవది! దానికీ కొంత ప్రయత్నంకావాలి" అని జవాబు వచ్చింది.

శ్రీమతి మెట్లెక్కి వచ్చింది... దగ్గరగా వచ్చి "ఏమండీ వడ్డించమంటారా?" అన్నది. మొగలిపువ్వు పరిమళం తెర శ్రీనివాసరావును ఉక్కిరిబిక్కిరి చేసింది.

"ఎక్కడివి మొగలిరేకులు?"

"పక్కింటావిడ ఇచ్చింది...ఏం, వడ్డించనా, లేక ఇంకా ఆలస్యం వుందా. లేవండి! తర్వాత వచ్చి పడుకుందురు గాని?"

"ఊఁ...కానీయి." రాధ క్రిందికి వెళ్ళిపోయింది.

శ్రీనివాసరావుకు జ్ఞాపకంవచ్చింది... నక్షత్రాలు, ఆకాశం, మొగలిరేకుల వాసనా, గాజుల గలగలా. చిక్కని చీకటి, వెచ్చని కౌగిలి...సుజాత, మొగళ్ళపాలెం ప్రైమరీస్కూలు టీచరు ...రైలు ప్రమాదంలో చనిపోయింది...

ఆదర్శానికి, నీతికి బద్ధుడుగా తనెక్కడున్నాడు?...రెండేళ్ళ క్రితం సుజాతతో ప్రణయం. అది అవినీతి, రాధకు అన్యాయం...మెలుకువతో కాపాడుకోవలసిన రహస్యం...క్యాంపుకు వెళ్ళిన ఒక్కొక్కసారి ఒక మహత్తరమైన అనుభవం...సుజాత తనవాణ్ణి చేసుకుంది ... భయపడ్డాడు బాధపడ్డాడు...కాని, సుజాతను చూడగానే భయమూ, బాధా, పశ్చాత్తాపము, పాపమూ, అంతర్ధానమయ్యేవి!...ఎంత మంచిది సుజాత,...ఆమె కోరిన ప్రతిఫలం ఏమీలేదు...ఒకసారి, బాగుందదనుకొని, పదిహేనురూపాయలు పెట్టి షిఫాన్ చీర కానుక తీసుకెళ్ళితే...వద్దన్నది...తర్వాత నెల తిరక్కుండానే, సుజాత లేదు!

"ఏఁవండోయ్, మిమ్మల్నే?... ఎంతకూ రారేమిటి?"

ప్రత్యక్షానుభవంగా ఉన్నప్పుడు భయమూ బాధా కలిగించినా...దాని మూలంగానే...ఆ రహస్య వల్లే... మొగలిపువ్వు వాసన, నక్షత్రాలు, ఆకాశం. .వీనితోపాటు తనూ వుంటాడు!

———



పాలగుమ్మి పద్మరాజు

# వాసనలేని పువ్వులు

రాజారావు పెళ్ళివిషయంలో చాలా అదృష్టవంతుడు వట్టి బి. ఏ. పాసయిన వాడికి అంత మంచి సంబంధం దొరకడమంటే నిజంగా జాతక ప్రభావమేనన్నారు స్నేహితు లందరూను. భార్య రూపవతి. మామగారు మగపిల్లలు లేని ధనవంతుడు

భార్య కాపురానికి వచ్చిన రెండు సంవత్సరాలలో రాజారావులో ఎంతో మార్పు వచ్చింది. ఎప్పుడూ ఆకాశంలోకి చూసేచూపులు ప్రస్తుతం ఎప్పుడూ నేలమీదే ఉంటాయి. కొంచెం మనిషి వాడినట్టు కనబడుతాడు. చిక్కిపోలేదు. ఇదివరకలాగ ప్రతి విషయాన్ని గురించీ అతిగా, ఉత్సాహంగా మాట్లాడే అలవాటు పోయి, అతను ఇప్పుడు ముభావంగా, ముక్తసరిగా, సాధారణంగా పరధ్యానంగా ఉంటుంటాడు. అతను చదువుకునే రోజుల్లో, ఎప్పుడూకూడా, ఒకప్పుడు తను తాలూకా గుమాస్తాపని చెయ్యాపోతానని అనుకోలేదు. అతను లేనివాడే. కాని ఊహలు ఆదర్శాలూ లేనివాడు కాడు. అందులో ఈ పెళ్ళి అయినతరవాత అతనికి అలాంటిపనిలో ప్రవేశించవలసిన అవసరమేలేదు. మామగారూ, అత్తగారూ కూడా వద్దని ఎంతచెప్పినావినక అతను ఆ పనిలో ప్రవేశించాడు. అతనికి ఎంతోమందిమీద కసి తీర్చుకోవాలని తీవ్రమయిన వాంఛ అకారణంగా కలిగింది. ...ఎవరిమీదో అతనికి

స్పష్టంగా తెలియదు. కొంతవరకూ తన మీదే కసి తీర్చుకోవలసిన అవసరం అతనికి కలిగిందని అతని అనుమానం.

అతను కాపురమున్న ఇల్లు విశాల మయిన ఒక సందులో ఉంది. ఇంటి చుట్టూ ఆవరణ ఉంది. ఏవో ఎర్రటి పువ్వులు పూసే మొక్కలు ఎన్నో ఉన్నాయి అతని భార్య ఆ పువ్వులు రోజూ సాయంకాలం కోసి తలలో పెట్టు కుంటుంది. మొట్టమొదట ఆ ఎర్రటి పువ్వులు చూసినప్పుడు రాజారావుకి విచిత్రమయిన ఆందోళన కలిగింది. వాటినికోసి వాసన చూశాడు ఏ వాసనా లేదు ఇంత రంగుగావున్న పువ్వులకు వాసన ఎందుకు లేదు! ఇది చాలా అన్యాయంగా అతనికి తోచింది. ఆతనికి వర్డ్స్‌వర్త్ అంటే అభిమానం-తద్వారా ప్రకృతి అంటే కూడా అతను అధ్యాత్మి కంగా సామ్యవాది కూడా. వాసన అనే సంపదను అన్ని పువ్వులు సమంగా పంచుకోడం న్యాయమని ఆతని మన స్సులో అభిప్రాయం. అన్ని పువ్వులకు వాసన ఉన్నా లేకపోయినా ఈ ఒక్క రకం పువ్వులకు వాసనవుంటే అతని సామ్యవాద సిద్ధాంతాలకు అఘాతం తగ లకపోను. ఈ పువ్వులద్వారా అతనికి ఈ లోకంలో పంపకపు విధానం అసం దర్భంగా ఉందన్నసత్యం అనుభవం లోకి వచ్చింది. మొదటిరోజుల్లో మేడ మీద వసారాలో కూర్చుని ఆ పువ్వుల వేపు చూస్తూ ఉండేవాడు. కాని ఎప్పుడూ అతను దగ్గరకు వెళ్ళి వాటిని తనంతట తను ముట్టుకోలేదు, కొయ్యలేదు.

అతని భార్య రోజూ వాటినికోసిసాయం కాలం జడలో పెట్టుకోడం ప్రారంభించిన నాటినుంచీ అతనిలో రకరకాల ఉద్రే కాలు రేగుతుండేవి. తెల్లవారిన తరవాత ఆ వాసనలేని పువ్వులు అతని భార్య తలగడమీద వాడిపోయి పడివుండేవి. వాటి వాసనలేని వాసన అతనికి వెగ టుగా తగులుతుండేది. అతనికి రాత్రులు సరిగా నిద్రపట్టడంలేదు. ఏవో కలలు నిత్యమూ అతని తెలివికి దూరంగా వచ్చి పోతుండేవి. నిద్రలేచిన తరవాత ఒక్క కలా జ్ఞాపకం వుండేదికాదు. కాని అతని మనస్సు ఆ కల జరుగుతున్నంతసేపూ ఏదో మధనపడుతున్నట్టు మాత్రం జ్ఞాపకం వుండేది. ప్రొద్దున్న నిద్రలేచిన వెంటనే అతనికి ఎంతో నీరసంగా, బెంగగా వుండేది. భార్య తలలోంచి రాలిన వాడిపోయిన ఆ వాసనలేని పువ్వులు తలగడ పక్కన ఎర్రగా పడి వుండేవి. లోకమంతా వాడిపోయి క్రుంగి పోయినట్లు అతనికి అనిపించేది.

రాజారావు భార్యపేరు కమల. మొదటి రోజుల్లో ఆమెకు రాజారావు తత్వం విచిత్రంగా అస్వాభావికంగా కని పించేది. అతను ఏదో కళ అనేవాడు, ఆదర్శమనేవాడు. ఆమె చదువుకుని అభిరుచిని అలవరచుకోవాలనేవాడు;

పగలంతా ఏదో పనిలో మునిగిపోయిన ఆమెకు, అతను రాత్రి ఏదో ఉద్రేకంగా చెబుతుండే అవులింతలు, కునికిపాట్లు వచ్చేవి. క్రమంగా అతని మాటలు అర్థం చేసుకోడానికి ప్రయత్నించకుండా వినడం ఆమెకు అలవాటయిపోయింది. ఆమె జీవితంలో అదొక భాగంగా ఆమెకు స్థిర పడిపోయింది. అన్నం ఉడకడం, నూతిలో నీళ్ళు తోడడం, వాకిట్లో ఎర్రటి వాసనలేని పువ్వులు పూయడం, రాజా రావు రాత్రులు మాట్లాడడం అన్నీ ఆమెకు అలవాటయిపోయాయి.

కమల మంచి స్ఫురద్రూపి. నిగనిగ లాడే పసుపురంగు దేహం. తగినంత లావు, తీర్చినట్లున్న దేహం, మొత్తంమీద ఆమె అందమయినదనే చెప్పాలి ఆమె శరీరం చల్లగా ఆరోగ్యంగా రాజారావు దేహానికి తగిలినప్పుడు అతనికి అకార ణంగా చిరాకు కలుగుతుండేది. ఏదో తను మరచిపోయినట్టు అదేదో తనకే జ్ఞాపకం రానట్టు బాధపడేవాడు. ఆ మరిచిపోవ డానికి కమల కొంత కారణమని అతనికి అజ్ఞాతంగా అనిపించేది.

రాజారావు కవిత్వం వ్రాయడం ప్రారంభించాడు. అతనికి అనేకమయిన ఉద్రేకాలు లోలోపల ఒత్తిడిచేస్తుండేవి అతను ఉపయోగించే మాటలకు వేరే అర్థం ఏదో ఉన్నట్లు స్ఫురించేది; ఏదో మాత్రం తెలిసేదికాదు ఒకొక్కరోజుని ఆఫీసులో కూర్చుని గంటల తరబడి కొన్ని పదాలను మననం చేస్తుండేవాడు. 'వాసనలేని పువ్వులు' 'చల్లని ఒడలు' 'బెంగ' 'దిగులు' 'బరువు' మొదలయిన పదాలు అతని మనస్సులో తిరిగి తిరిగి ప్రత్యక్షమయేవి. సగం సగం వాక్యాలు, భావాలు పూర్తి కావడానికి వీల్లేని పద్య భాగాలు, చిన్న చిన్న కాగితాలమీద గిలుకుతుండేవాడు. అవన్నీ కోటుజేబు లోకి ఎక్కించి ఇంటికి వస్తుండేవాడు. వాటిని నిత్యం మననం చేస్తుండేవాడు. చిత్రవిచిత్రమయిన విరుపులు, విలక్షణ మయిన యతిప్రాసలు అపురూపమయిన నడకలు, అతనికి అందీఅందకుండా అల్లా జారిపోతుండేవి.

"వాసనలేని పువ్వులు అనే పద్యం ఎంతోమంది మెచ్చుకున్నారు. కొందరు శైలిని పొగిడారు కొందరు భావాన్ని, కొందరు శిల్పాన్ని, మొత్తంమీద రాజా రావు కవి అని నిర్ధారణ అయింది పది మందీ అతన్ని కవిగా అంగీకరించారు. ఆ వుత్సాహ మతన్ని కవిగాచేసింది. వరసగా వ్రాత మొదలుపెట్టాడు. రెండు మూడు నెలలలో రెండు వందల ఖండ కావ్యాలు వ్రాశాడు. మామగారు మెచ్చు కుని వాటిని అచ్చువేయించుకోడానికి డబ్బు ఇచ్చారు. చక్కని కాగితంమీద చక్కని అచ్చుతో చక్కగా తయార యింది పుస్తకం. పుస్తకానికి "వాసన లేని పువ్వులు" అని పేరు పెట్టాడు. అతను కవిగా స్థిరపడ్డాడు అతని పలుకుబడి

అతనికి అమితమయిన ఉత్సాహాన్ని కలిగించింది. అతని చిన్ననాటి స్నేహితు లంతా, అతను ఇల్లా అయితీరతాడని తమందరకీ అప్పుడే అనిపించేదన్నారు. అతని ఉపన్యాసాలు వినడానికి వందల కొద్దీ విద్యార్థులు విద్యావంతులు మూగే వారు అతని పాటలు పద్యాలు ప్రతీ నాగరకుడి నోట్లోనూ మ్రోగేవి. రాజా రావు తన ఉద్యోగానికి రాజీనామా ఇచ్చాడు. కవిగా పెరిగిన పలుకుబడి అతనికి డబ్బు లేకపోయినా, మానుగారి ఆదరాన్ని సంపాదించి పెట్టింది.

*   *   *

అతని భార్య నూతిలోబడి చచ్చి పోయిన నాటి దృశ్యం రాజారావుకి జీవి తాంతంవరకూ జ్ఞాపకంవుంది.

అతను ఇంటికి తిరిగి వచ్చేసరికి సాయంకాలం పడుతోంది. కనుచీకట్లో అతనికి అస్పష్టంగా కొన్ని ముఖాలు, అవ్యక్తంగా కొంత హడావిడి వినబడింది. అతని ఇంటికి ముందు దొడ్డిలో ఒక పక్కగా ఒక నుయ్యి వుంది. ఆ నూతి చప్టామీద కొందరు మనుషులు, రెండు మూడు లాంతర్లు కనిపించాయి. దగ్గ రకుపోయి చూస్తే అతని భార్య శవం చప్టామీద తడి బట్టలతో, తడి తలతో వుంది. చేతివేళ్ళు కాలివేళ్ళు ముడుచు కుని వున్నాయి. అతనికి ఆమె ముఖం మాయగా అవ్యక్తంగా కనిపించింది. ఏదో చటుక్కుని మరచిపోయినట్టు అది ఎంత ప్రయత్నించినా జ్ఞాపకంరానట్టు అని పించింది అతనికి

పంచాయతీ జరిగినప్పుడు అతను అతి ప్రశాంతంగా తను చెప్పవలసిన ముక్కలు చెప్పాడు. అతని ముఖం కొంచెం ముడతలుపడ్డా స్థిమితంగావుంది. అతని జుట్టు చెదిరి చెరిగిపోయినా అందులో విచిత్రమయిన గాంభీర్యం వుంది. అతని గొంతుక దార్ఢ్యంగా మోగింది. అతన్ని చూసిన ప్రతిమనిషి, దుఃఖాలను ఇల్లాగే ఎదురుకోవాలను కున్నారు.

అతను చెప్పిన విషయాలు అందరికీ తెలిసినవే కమలకు ఈ మధ్య మూర్ఛ రోగం పట్టుకుంది. ఒకసారి పొయ్యి దగ్గర మూర్ఛవచ్చి పడిపోతే కాలు కాలింది. అదిగో కాలుమీద మచ్చ. అవును, ఏదో సంసారంలో అనేకమయిన అభిప్రాయ భేదాలు వస్తుంటాయి. తను తిట్టేవాడు. ఆమె ఏడిచేది. అయితే మొత్తంమీద అంత పెద్ద తగాదాలు ఏవీ లేవు...అబ్బేలేదు ఆమెను అతనుహింస పెట్టాడని ఎవరూ అనలేరు. తను ఎరిగు న్నంతవరకు ఆమెఅతనిమీద అసహ్యాన్ని గాని, కోపాన్నిగాని వెలిబుచ్చలేదు. ఆమె నూతిలో నీళ్ళు తోడుతుండగా మూర్ఛ వచ్చి పడిపోయి వుంటుందని అతనికి తోచిన అభిప్రాయం చేతివేళ్ళు ముడుచుకుని వున్నాయి.

తంతు అంతా అయిపోయిన తరవాత




అతను ఇంట్లోకి వెళ్ళి నిలువుటద్దం ముందు నిలబడ్డాడు. తన ముఖం అతి విచిత్రంగా హృద్యంగా అతనికి కనిపించింది. చిందరవందరగా రేగిపోయిన జుట్టులో మళ్ళీ ఒక క్రమం వుంది. ఒక సంకీర్ణమయిన రేఖావిలాసం వుంది. కళ్ళలో ప్రగాఢమయిన విశ్వాసం వుంది. ఆ ముఖం అతని మనస్సులో నాటుకుపోయింది. చాలాసేపు ముగ్ధుడయిపోయి ఆ ముఖాన్ని చూస్తూ నిలబడిపోయాడు. ఇంతలో శ్మశానానికి శవాన్ని తీసుకుపోవడానికి అన్నీ సిద్ధంగా వున్నాయని కబురు వచ్చింది. తక్కినవన్నీ ఒక కలలోలాగ జరిగిపోయాయి.

మరునాడు మామగారు వచ్చినప్పుడు అతనికి నిజంగా దుఃఖంవచ్చింది. ఆయన్ని కౌగలించుకుని ఏడ్చాడు తన ఏడుపు నిజంగా ఏడుపులాగ ఉందా అని అతనికి సందేహం అప్పుడప్పుడు కలిగింది. మామగారు తన కర్మని తిట్టుకున్నాడు మామూలుగా జరిగే పరామర్శలన్నీ అయిపోయాయి. ఇంత యౌవనంలో ఇంత అసహజంగా పోయిన ప్రాణికి కర్మ అవీ సవ్యంగా జరపడానికి తనకు మనస్సు ఒప్పడం లేదన్నాడు రాజారావు. అతని మాటల్లోని సబబు, ఆవేదన అందరికీ నచ్చింది.

సాయంకాలం మంచం వాల్చుకుని ముందు దొడ్డిలో పడుకున్నాడు రాజారావు. ఒక మూలగా ఉంది నుయ్యి. మంచంచుట్టూ ఆ ఎర్రటి వాసనలేని పువ్వులు విరగపూశాయి. అతని భార్యకు వాటినిచూస్తే ఎంత ప్రీతి ! ప్రొద్దు కుంకుతున్నప్పుడు ఎర్రబారిన సూర్యుణ్ణి చూశాను. ఆ రంగుకీ ఈ పువ్వుల రంగుకీ ఉన్న చిత్రమయిన అను

బంధాన్ని ఆతను చటుక్కున గుర్తిం చాడు. ఆరంగు చూస్తుంటే మనస్సులో ఆలోచనలన్నీ ఆగిపోతాయి. ఏదో బరువు ఆవహించి మనస్సుని కిందికి లాగి వేస్తుంది ఆ రంగు చైతన్యం పూర్తిగా పోతుంది. సృష్టిఅంతా లయస్థితికి చేరి నట్టు అనిపిస్తుంది ఏ కృషికీ అవసరం కనిపించదు కాని ఈ దిగువా, ఈ బెంగ, వీటికి అడుగున ఒక ప్రశాంతి లేకపో లేదు. గాలి ఆగిపోయిన తరువాత మహా సముద్రంలాగ చైతన్యం అంతా నిలక డగా నిలిచిపోతుంది. కాని అప్పుడు చైతన్యానికే అర్థంపోతుంది వట్టిరంగు నిర్గుణమైన రంగు పరబ్రహ్మ స్వరూపం లాగా ఏకైక సత్యంలాగా తెలివినంతనీ ఆవహిస్తుంది.

అతనికి కమల జ్ఞాపకం వచ్చింది. అస్పష్టంగా ఆమె తాత్విక స్వరూపంలో అతనికి కనపడింది ఆమెను మనస్సులో మననంచేశాడు. ఎక్కడా వాసనలేని రంగులాగ ఆమె అతని మనస్సులో అవతరించింది తన సంస్కృతి' తన అభిరుచి, తన ఆదర్శాలు అన్నీ ఆమెకు నేర్పాలనుకున్నాడు. కాని ఆమెలో ఏ వాసనాలేదు. అతని గొడవలన్నీ ఆమెకు ఏమీ తెలియలేదు ఆమెముఖం చిట్లించి విని విని ఆవులించేది. అతనికి ఆమెను నమిలి మింగేద్దామన్నంత అసహ్యం కలి గేది ఇప్పుడామె చనిపోయింది గనుక, అతనికి ఆమెతత్వంమీద' అంతకోపం కలగడంలేదు. అంతేకాదు. అసలు ఆమెను తను ఎందుకు అంతగా హింసిం చాడు ? ఆమె నిజతత్వాన్ని ఎందుచేత తెలుసుకోలేకపోయాడు? తన తెలివినీ, తన అభిరుచినీ, తన కళాభిరతినీ మించిన బలిష్ఠమయిన ప్రాకృతికశక్తి ఒకటి ఆమెలో ఉందని అతనికి ఎందుకు తెలియ లేదు ? ఆమె భౌతిక దేహంలేదు గనుక అతనికి ఆమెను గురించి ఈర్ష్య, వ్యతి రేకభావము లేకుండా ఆలోచించడానికి సావకాశం చిక్కింది. ఈ భౌతికదేహం పెద్ద అడ్డంకి. మనుష్యుల నిజతత్వాలను స్ఫుటంగా కనబడనియ్యదు. కమలభౌతిక దేహం అతని కన్నుల కప్పివేసింది. ఆమె అసలు తత్వాన్ని కప్పివేసింది.

ఆమెతో తను గడిపిన అనేకరాత్రులు అతనికి స్మృతిలోకి వచ్చాయి ఆమె భౌతిక శరీరం తన ప్రబలమయిన చిన్న చిన్న కోరికలను అతనిమీద బలవంతంగా ప్రయోగించింది. ఆ కోరికలు అతన్ని వుక్కిరిబిక్కిరి చేశాయి. అతని ఆధ్యా త్మిక జీవితాన్ని కలిచివేశాయి. ఆ భౌతిక దేహంలేదు గనక ఇంక ఆమెకూ తనకూ మధ్య ఏ విధమయిన అంత రాయమూలేదు. ఆత్మసంయోగం, అస లయిన అద్వైతభావం తనలో ఉత్పన్నం కావడానికి ఇప్పుడే సావకాశం ఏర్ప డింది.

అతను వేప నూతిచుట్టూ తిరిగాడు. నిట్టూర్చాడు. పువ్వుల మొక్కలలో

ఇటూ అటూ తిరిగాడు. చెట్టుమీదవున్న పువ్వులను స్పృశించాడు. ఎంచేతో కొయ్యడం అత్యాచారంలాగ అతనికి అనిపించింది. చెక్కులమీద వాటిని రాసుకున్నాడు. బాగా చీకటి వడ్డతరవాత లోపలికి వెళ్ళిపోయాడు. దీపం బాగా పెద్దదిచేసి నిలువుటద్దం ముందు నిలబడ్డాడు. నున్నగా దువ్వినజుట్టు అతనికి వెగటుగా తోచింది. చేత్తో దాన్ని జాగ్రత్తగా చెరుపుకున్నాడు. పూర్తిగా చెరుపుకోలేదు. దువ్వెనతో ఇక్కడా అక్కడా జాగ్రత్తగా సర్దుకున్నాడు. ఆనాటి రాత్రి తన జుట్టు ఎల్లావుందో అల్లాగ సరిదిద్దుకున్నాడు. ఆ మూర్తి అతన్ని అనంతమయిన ప్రశాంతితో నింపుతుంది ఎంతో సంతృప్తిగా ఉంటుంది. తన ఆత్మస్వరూపాన్ని కన్నులార చూస్తున్నానని అతను అనుకుంటాడు. రోజూజాగ్రత్తగాఆస్వరూపం వచ్చేదాకా జుట్టు రేపుకుంటాడు. అతి జాగ్రత్తగా ఆనాటి దుస్తులవంటివే వేసుకుంటాడు నిద్రలో కూడా అతనికి తనజుట్టుయొక్క స్వరూపం కళ్ళకు కట్టినట్టు వుంటుంది.

* * *

రాజారావు సాహిత్యప్రపంచంలో ఉన్నత స్థానాన్ని సంపాదించుకున్నాడు అతని జీవితంలో లౌకికమయిన సాఫల్యం ఉంది. ఆధ్యాత్మిక మయిన సాఫల్యమూ ఉంది. విద్యావంతులు, కవులు, వైజ్ఞానికులు, వేదాంతులు, అందరూ అతన్ని గౌరవిస్తారు. అతని వయసు నడిపొద్దు వాలి పశ్చిమానికి దిగిపోతోంది. అతని ప్రతిభ ఒకప్పుడు తీక్ష్ణంగా వెలిగింది. ఇప్పుడు ప్రశాంతమయిన సాయం సంధ్యా కాంతిలాగ ప్రకాశిస్తోంది అతను వెనక్కి తిరిగి చూస్తే ఒక ఉజ్వలమయిన జీవితచరిత్ర కనబడుతుంది.

రాజారావుమళ్ళీ వివాహం చేసుకోలేదు. అతని ఏకనిష్ఠ ప్రేమ అందరికీ గౌరవపాత్రమయింది. చిన్న వయసులోనే భార్యపోయి, ఇంతవరకు ఆమె స్మృతినే ప్రేమిస్తూ గౌరవిస్తూ దైహిక వాంఛలను, సాంసారిక జీవితాన్ని త్రోసిపుచ్చిన యోగులు చాలా అరుదు అన్నారు తత్వజ్ఞులు

భార్యపోయిన తరవాత ఎన్నో కావ్యాలు వ్రాశాడు రాజారావు. ఖండకావ్యాలు, పెద్దకావ్యాలు కూడా. రకరకాల వ్యాసాలు వ్రాశాడు...ముఖ్యంగా జీవితాన్ని గురించి, ఆశయాలను గురించి, ప్రేమను గురించి, అతని కవిత్వం మాయగా తెలియని ఆవేదనను కలిగిస్తుంది. అతని వ్యాసాలు, పూర్తిగా తెలియడానికి వీలులేని దేన్నో ప్రతిపాదిస్తాయి మొత్తంమీద అతని శక్తిని అందరూ గుర్తించారు.

చివరకు అతను తన ఖండకావ్యాలన్నీ ఒక పెద్ద సంపుటిగా అచ్చు

వేశాడు. ఆ పుస్తకాన్ని తన భార్యకు అంకితమిచ్చాడు. పుస్తకానికి 'మరికొన్ని వాసనలేని పువ్వులు' అని పేరుపెట్టాడు. ఆ పుస్తకంలో ఉపోద్ఘాతం ఒకటి వ్రాశాడు. అది అతనికి సర్వజనామోదాన్ని, కీర్తిని సంపాదించి పెట్టింది. ఒక కవి కవిత్వానికి, ఆతని జీవితానికీ గల అనుబంధాన్ని అంత అద్భుతంగా చిత్రించగల రచయిత ఇంకెవడూ లేడన్నారు విమర్శకులు. అన్ని పత్రికల లోనూ ఆ ఉపోద్ఘాతాన్ని కొనియాడుతూ వ్యాసాలు వచ్చాయి. అతని షష్ఠిపూర్తి సందర్భంలో కూడా ఆ ఉపోద్ఘాతాన్నే ఎంతోమంది పొగిడారు. చిన్న కవులందరూ అతన్ని కవి కులగురువుగా అంగీకరించారు. ఆ ఉపోద్ఘాతంలోని కొన్ని భాగాలను ఇక్కడ ఉదహరిస్తాను :

"నాకు పెళ్ళయిన కొత్తరోజుల్లో ప్రేమ అంటే ఏమిటి? అనే ప్రశ్న వచ్చింది నాకు శారీరకమయిన వాంఛల మీద ఏహ్యభావం ఆనాటినుంచి వుంది. అంచేత దైహికమయిన వైషికమయిన వాంఛలను నేను ప్రేమగా ఎప్పుడూ అర్థంచేసుకోలేదు. కాని నాకు పెళ్ళయిన మొదటి కొద్దిరోజులు నా జీవితంలో అంధకారం ఆవరించిన రోజులని చెప్పి తీరాలి. నా భార్య, కమల, చాలా అమాయకురాలు ఆమె శరీరసౌష్ఠవం అనుపమానం. కాని ఆమె దేహాన్ని నేను ప్రేమించలేకపోయాను. 'ప్రేమ' అనే పదానికి నా అర్థం ఏమిటో ఆమెకు వ్యక్తం చెయ్యడానికి నేను అనేక రకాలుగా ప్రయత్నించాను. కాని ఆమె నా భౌతిక దేహాన్ని చాలా తీవ్రంగా వాంఛించేది. నాకు కొన్ని రాత్రులు ప్రబలమయిన ఉద్రేకాలు వస్తుండేవి. దైహిక ప్రేమలో నేను మునిగిపోలేక పోయాను. నా దేహమే దానికి అంగీకరించలేదు. కాని నా కమలకు ఎల్లాగ నా అభిప్రాయాలు వివరించడం? ఎల్లాగ ఆమెను నా త్రోవలోకి తీసుకురావడం?

"కాని పరిస్థితి విషమించింది ఆమె రాత్రులు ఏదో వైఫల్యంతో గోడపక్కన కూర్చుని అకారణంగా ఏడుస్తుండేది. నాలో చిరాకు వర్షపు హోరులాగ హెచ్చేది. ఈ పరిస్థితి భరించలేక నేను ఆమెను కొట్టడం ప్రారంభించాను. అప్పటి నా రాక్షసత్వానికి మితిలేదు. కాని దెబ్బలు తిన్న తరవాత ఆమె కొంత ప్రశాంతంగా పడుకునేది. ఆ రోజుల్లో నా హృదయం అంతా నల్లబడిపోయినట్టనిపించేది చేయరాని ఘోరపాపాలు అన్నీ నేనే చేస్తున్నాననిపించేది కమలకు మూర్ఛరోగం పట్టుకుంది. క్రమంగా ఆమె దేహసౌష్ఠవం పోయింది. దీనికంతటికీ నేనే కారణమని నా నైతిక స్వభావంలో నాకు అనిపించేది. కాని నా కృషి గొప్పది. ఏమయినాసరే నా జీవిత సాఫల్యాన్ని నేను చూసుకోవాలి. దానికి దైహిక వాంఛలను చంపాలి.

"ఇంతలో కమల చచ్చిపోయింది. ఆరోజున నాకు చిత్ర విచిత్రమయిన ఊహలు వచ్చాయి. అవన్నీ నేను స్పష్ట ముగా చెప్పలేను. నా పద్యాల్లో ఈనాటి వరకూ కూడా ఆనాటి ఊహలను వ్యక్త పరచడానికి ప్రయత్నిస్తూనే ఉన్నాను. నా శరీరంలోని బాహ్యమయిన మార్పులు కొన్ని ఆ నాడు కనిపించాయి. నా దృష్టిని కప్పిన పొరలు తొలగి పోయాయి.

............

"నా అభ్యుదయ మిత్రులతో నేను అంటుంటాను. సహజపరిణామం కవి లోనే రావాలని. కవి లోపలినించే పెరుగు తాడు. అతని అనుభూతులే అతని సత్యా సత్యాలను నిరూపించాలి గాని, కొన్ని బాహ్య సిద్ధాంతాలు కాదు. సామ్యవాది స్నేహితులందరూ ఒకటి గమనించాలి. కవి జగత్తులో ఆర్థిక సమస్యలు లేవు. అవి ఈ లౌకిక జగత్తును ఆశ్రయించి వుంటాయి. ఆధ్యాత్మికమయిన సమా నత్వం అన్నిటికంటే గొప్పది. అసల యిన సామ్యసిద్ధాంతం అది......

"స్త్రీ ప్రేమను గురించి రకరకాల సిద్ధాంతాలు ఈనాడు మనం వింటున్నాం. చాలావరకు అవన్నీ పాశ్చాత్య దేశాల నించి దిగుమతి అయిన అభిప్రాయాలు. మన హైందవ సంప్రదాయంలో స్పష్ట మయిన నిర్వచనం దీనికి ఇచ్చారు. ఔత్కృష్ట్యాన్ని గమనించడానికి చిత్త సంస్కారం కొంత అవసరం. స్త్రీ ఎవరో వుంటే తప్ప స్త్రీ ప్రేమ అసంభవమని ఆధునికుల అభిప్రాయం ప్రేమకు స్త్రీ నిమిత్తమాత్రమని నా అనుభవంద్వారా నేను తెలుసుకున్నాను. ఉదాత్తమయిన ప్రేమకు ఈ లోకంలో ఏ స్త్రీ కూడా అర్హురాలుకాదు. నా ప్రేయసికి ఈ లోకం వాసయోగ్యంకాదు. ఈ కామ లోభాలతో కలిసివున్న వాస్తవిక స్త్రీని నేను ప్రేమించలేను. వాంఛించలేను.

ప్రేయసి ఈ లోకంలోని ఉదాత్తమయిన స్త్రీత్వానికి ప్రమాణం.

"మహా కవులందరూ అందుకే కామాన్ని తెగనాడారు. టాల్‌స్టాయి అసలే స్త్రీ పురుష సంయోగం పాప మన్నాడు. అందరు మహాకవుల జీవితాలను పరిశీలించగా నాకు దొరికిన మహా సత్యం ఇది. కవి కాదగినవాడు దైహిక వాంఛలకు లొంగిపోలేడు. కాని లోక మంతా వాటి ప్రాబల్యంతో నిండిపోయి వుంది. అందుచేత కవి లోకాన్ని ధిక్కరించవలసి వస్తోంది. కుటుంబజీవితంలో అందుచేత కవికి ఘర్షణతప్పదు. కవికి-కవికే కాదు ఆత్మసంస్కృతి కాంక్షించే ప్రతి సాధకుడికీ-ఒక కుటుంబం, సంసారము అనేవి కుదరవు.

"కాని నా భార్యను నేను ప్రేమించాను. అమితంగా ప్రేమించాను. అయితే ఆమె దేహసౌష్టవాన్ని కాదు. ఆ దేహ సౌష్టవం నాకు ఎంతో ప్రతిబంధకంగా అయిపోయింది. దాన్ని నేను అసహ్యించుకునేవాడిని. కాని ఆమె ఆత్మహత్య విచిత్రమయినది. అనంతమయిన ఎర్ర రంగు దానికి సాంకేతికం. వాసనలేని ఎర్రరంగు. ఆమెకు విశాలమయిన సంస్కారాలులేవు. కాని ప్రాథమయిన స్వభావం ఏదో ప్రబలంగా ఆమెలో ఆవరించివుంది. మావాకిటిలో నిత్యమూ పూసే అద్భుతమయిన వాసనలేని ఎర్రపువ్వులకూ ఆమెకూ ఏదో ఆత్మీయమయిన అనుబంధం వుందని నాకు తెలిసివచ్చింది. ఇది అనుమానంకాదు. పరమసత్యం.

"ఒక్కొక్కప్పుడు ఆమె మృత్యువుకి నేనే కారణభూతుడినని అనిపిస్తుంటుంది. నాకంటే ఒక సామాన్య మానవుడికి ఆమె భార్య అయితే ఆమెకు ఈ తీవ్రమయిన వాంఛలు తీరకపోవడం, మూర్ఛ పట్టుకోడం జరగకపోనేమో. నా వల్ల ఆమె దైహికజీవితం ఎండిపోయిందేమో. అయితే ఎవరికి ఏం కావాలో స్పష్టంగా వారికయినా ఈ సృష్టిలో తెలియడానికి వీలులేదు నవీన మనశ్శాస్త్రజ్ఞులు కూడా ఇదే అంటారు. మన వాంఛలన్నీ అజ్ఞాతంగావుంటాయి కాని ఆమె పోయినతరవాత నాకొక అపురూపమయిన దివ్యమూర్తిగా అయిపోయింది. ఆమె నా స్మృతిపథంలో ఎప్పుడూ జ్యోతిలాగ వెలుగుతూ ఉంటుంది.

"ఇల్లాంటి అనుభవాలన్నీ అప్పుడప్పుడు కావ్యరూపంలో వెలువడుతూ వచ్చాయి. నా జీవితాన్ని ఒక సాధనగానే నేను గ్రహించాను. ఇందులో సాఫల్యం ఎంతవరకు వుందో తేల్చవలసినవారు మీరు."

---




# చైత్రసుందరి

చిరాకుగా ఉన్నానేమో, సిల్కులాల్చీ విప్పి పక్కకు విసిరేసరికి..."ఔను, ఇంక మీకు మేం కనపడతామా?" అన్నది, ముఖంమీద పడిన లాల్చీని తొలిగిస్తూ.

ఎదుటఉన్న వ్యక్తికూడా కనిపించనంతటి గర్వం ఏంవొచ్చిందా అనుకున్నాను. ఆమె కిటికీతలుపుల కీసీకలో ఉంది. అయినా నవ్వుతూ...

"అంత మరీ కన్పించకపోవటానికి నా కళ్ళద్దాలేమయినా మారాయనుకున్నావా?" అన్నాను, నేనుకూడా పక్కనే సోఫాలో కూర్చుని.

"అద్దాలు మారకపోయినా ఫ్రేములు మారవొచ్చుగా...సరదాకూ" అన్నది. నా మాటనే సాగనిస్తూ.

"అవును నిజమే. నువ్వుచూస్తున్నప్పటి నుంచీ ఎన్నిరకాల ఫ్రేములు మార్చాననీ —అలా అడుగుతున్నావు? అంతేనా? లేక కవిత్వం ఏమయినా మాటల్లో కలుపుతున్నావా?"

"ఏంమాట్లాడినా మాట్లాడవచ్చు!

సహవాసదోషం...ఇదివరకు మార్చక పోయినా— యెప్పుడూ ఒకలాగానే ఉంటావనే నమ్మకమేమిటి?"

"ఎప్పుడూ లేనిది — ఇంతలోనే నాయందంత అపనమ్మకం కలగటానికి కారణమేమిటో!...ఎంతసేపటికీ చదరంగపుయెత్తుల సమాధానాలేకాని అసలు మనస్సులోని మాటేమిటో తేల్చిచెప్పవు కదా!''

"ఆఁ అలా అంటానా నిన్ను?...ఏం లేదు......కాని ఇవాళింత ఆలస్యంగా వొచ్చావేం?"

"నాఆలస్యానికేనా యీ'హంగామా?' ఊహుఁ మనస్సులోని విషయాన్ని మాత్రం మాటుగానే వుంచి ప్రసంగం మార్చావు. అవునా?"

"నా మనస్సులో వేరే ఉన్నా లేక పోయినా, అసలు నీలోనే ఏదో అవమానం ఉన్నట్లుగా వుందే...అట్టే వేధించక వెంటనే తేల్చిచెప్పరాదూ?"

"నా అవమానం బహుశః అపోహయేనేమో...! అపోహతో ఏమయినా తొందరపడి అంటే—నాకు నేనై అమంగళపుమాటలు మాట్లాడిన వాడనవుతానే మోనని...కాని ..."

అంటూలేచి దగ్గరనే టేబిల్‌మీది సిగరెట్ టిన్ను తీసుకొని, దానికిందనేవున్న పసుపుపచ్చ కవరుకూడా అందుకుని, "ఎప్పుడువచ్చిందీ కవరు?" అడుగుతూ నే మూత సగఁకోసి గాలివిసురుకు కవరుచించి, వుండటం గమనించి, ఉత్తరం తీసి పైపంక్తులు ఉపోద్ఘాతం చదివానో, లేదో!

"ఏం? ఇంక నేను - కనీసం-జ్ఞాపకమైనా వుంటానా?" అన్నది జాలిగా నా మెడకు చేతులు పెనవైచి.

''ఏం?"

"ఇంక నేను చెప్పేదేముందీ? చేతిలోనే వుందిగా కవరు?...అయినా నేనెందుకు మధ్యలో...?"

అంటూ చేతుల్లోంచి మెళుకువగా తప్పించుకుని,

"ఇంక వచ్చే వసంతంలో-మల్లెపూలు మచ్చుకైనా మాలాంటివాళ్ళకు దక్కనీయవుకాబోలు!..." అంటూ చెంగున దూసుకుపోయింది యింట్లోకి.

మామూలుగా సాయంకాలం బయలుదేరబోతూంటే — లోపల గుమ్మంలోనే యెదురై-

"ఈ పూట నీ కిక్కడ బందిఖానా తప్పదు. మీ అమ్మగారు చీకటిపడితేనే గాని రారు" అంటూ టీ కప్పు అందించింది.

టీ సేవిస్తూ వుండగా—

"ఇంక బహుశః మేం ఈవూరునించి వెళ్ళిపోవాల్సి వొస్తుందేమో" అన్నది దిగులుగా.

"ఆఁ వెళ్ళిపోతావా!"అని వొడిసిపట్టుకుని, "వూఁ ఇంక ఎలా వెళ్ళిపోతావో?"

అంటూ...అంతలోనే ఆమె చేతిలో మడతపెట్టివున్న కవరు లాక్కుని, ఆ సంగతి అందులో ఏమయినా ఉన్న దేమోనని ఆదుర్దాగా చదివా.

"నువ్వు చెప్పిన సంగతి యీ ఉత్త రంలో లేదేం!...అబద్ధాలు చెప్పి నన్ను ఉడికించాలని నీకు సరదా ?"

"అవును మరి. నాకు ఏ సరదా అయినా నీతోనేగా!...కాని...ఇది సర దాగా అన్నమాటకాదు. ఇన్నాళ్ళు సెలవు పెట్టారు కనుక బహుశా 'ట్రాన్స్‌ఫర్' అవుతుందేమోనని......అలాగే కనుక అయితే..." అంటూ అరచేతుల్లో ముఖం దాచుకుంది.

"ఏమిటిది? అయినప్పటి మాటకదా! అందుకోసమని ఇప్పుడిలా ముందు గానే..."

అని వోదార్చబోతూ ఆమె ముఖం పైకెత్తాను. ఆ కళ్ళల్లో - అశ్రువులుతొణి కిసలాడాయి రవంతసేపు...అతి జాలిగా నా ముఖంవైపు చూస్తూ...

''అమాయకుడివి - అర్థంకాదు నీకు నా బాధ - అయినా నీ మనస్సు కూడా ..."

—చెప్పలేకపోయినా - అంతవరకు గాద్గదికంగాచెప్పి—''ఎవరో వస్తున్నట్లు న్నారు!" అంటూ తప్పించుకుని వెళ్ళి పోయిందేకాని, పూర్తిగా అప్పుడూ చెప్పలా.

చెప్పలేని బాధమాత్రం పడుతోంది మనస్సులో...అయినా తొణకదు. పైగా నేనెక్కడ తన సంగతి ప్రసంగవశాత్తూ తెచ్చి - ఏవేవో కొత్త కొత్త విషయాలు ఉవ్విళ్ళూరేట్లు చెప్పి - అపూర్వమయిన అనుభవాలు నాకే కలుగబోతున్నట్లు ఆశలు కల్పించి - 'అలాంటప్పుడు నేను జ్ఞాపకమయినా వుంటానా?' అని సహజ మయిన బేలతనం చూపిస్తుంది. మళ్ళీ... 'నీ ఆనందానికి విఘ్నంకాకుండా మాకు ట్రాన్స్‌ఫర్' అవటం కూడా ఒకరకం గానే మంచిదే'—ననీ సమర్థించటానికి ప్రయత్నిస్తుంది

ఆమె మాటలు వింటున్నంతసేపూ— ఏవో అపూర్వమయిన ఆనందమూ; ఉత్సాహమూ, ఉద్రేకమూ కలుగు తాయి. మళ్ళీ మధ్యలో—ఏదో తెలి యనిబాధా...దిగులూకూడా...!

ఏమో! నాకు నేనే అర్థంకాని స్థితిలో వున్నా.

--మా అనుమానానికి తగినట్లుగానే ఆయనకు బదిలీ అయింది. ఇన్నాళ్ళు సెలవుపెడితే ఒకవేళ 'ట్రాన్స్‌ఫర్' కావచ్చునని తెలిసికూడా ఆయ నలా ఎందుకుచేశాడా అనిపించింది. ఆయనకు ఈ వూళ్ళో వుండటం ఇష్టంలేదా/...ఒక వేళ ఆమె నాతో అన్నట్లుగానే—ఈ 'ట్రాన్స్‌ఫర్' ఆమె సలహాననుసరించి చేయించుకోటానికి ప్రయత్నించ లేదు గదా!

ఆయన ముందువెళ్ళి ఆ కొత్తఊళ్ళో-ఉద్యోగంలో ప్రవేశించాడు.

ఆమె తరువాత సామానుతో కూడా వెళ్ళింది.

వెళ్లేరోజున—

"లోకం ఎన్ని మధురక్షణాలు అనుకున్నా ఇక్కడ ఉన్నన్నాళ్లూ నా జీవితంలో గడిచిపోయాయి. ఇకముందునీకు మాత్రం ఇంతకంటె మధురాతిమధురమైన క్షణాలురాబోతున్నాయి. నేనుమెల్లగా తప్పుకుంటే—నువ్వు సంపూర్ణమయిన ఆనందానుభూతిని-పొందగలవనే సంతృప్తితో-కావాలని ఇలా ట్రాన్స్‌ఫర్ చేయించుకోటానికి ప్రయత్నించాను. కాని ఇలా అంటే ఎవరూ నమ్మరు కదూ? నా మీది వ్యామోహంతో ఆమెనుమాత్రం అలసంగా చు డకు. ఇక దాచటమెందుకు? నీకు నేను ఇవ్వలేని - అపూర్వమయిన అనుభూతిని, ఆనందాన్ని—ఆమె ఇవ్వ కలుగుతుంది. ఆదర్శాలకోసమనికాని, అయాచితంగా వొచ్చిందేకదా అనికాని, అలసతతో ఆ అమృతాన్ని ఒలకపోసుకునేవుసుమా! నన్ను రవంత జ్ఞాపకముంచుకుంటే...నా కదే పదివేలు... ఇంక మరి శెలవా నాకు...?"

అంటూ ఆత్మవిశ్వాసంతో చేతిలో చెయ్యి వేయించుకుని...!

—ఇన్నాళ్ళూ ఆమె అనుభవించిన ఆవేదనా, బాధా—అందులో నాలుగో వంతయినా-నేను ఆమె వెళ్ళింతర్వాత కూడా అనుభవించలేకపోయాను.

అప్పుడే - ఇక్కడ వున్నప్పటికీ - అంత బాధపడిందే; ఇంక నేనసలు కనబడనుకదా ఇంకెంతబాధపడుతుందో అన్న ఆలోచనకూడా కలుగలా నాకాక్షణంలో

అవును మరి! నాకేదో పెద్ద ఆశాజ్యోతి-మసకగానైనా రవంతదూరంలో కన్పిస్తూనే వుందిగా...!

ఆ అనుభూతికోసం - నా మనస్సు రెపరెపలాడటం ప్రారంభించింది.

అంతమాత్రాన పాత వ్యామోహం మాత్రం పూర్తిగా పోయిందనా? ఎంత పాతదయినా అంత అల్పమైనదికాదు మరి...! కాగా...మనస్సు పాత-కొత్తల మధ్యలో పడి నలిగిపోతున్నది

మళ్ళీ మరో అనుమానంకూడా...

రాబోయే అమృతాన్ని ఆశించి — చేతిలో ఉన్నది అమృతం కాదనే అజ్ఞానంతోనే వొదిలివేశానేమో...! అయితే ఈ అనుమానం ఆ ఆశాజ్యోతిలో అంత లీనమయి అప్పుడు నన్నంతగా బాధించలా

ఇలా కొన్ని రోజులు మాత్రం పిచ్చి పిచ్చిగానే గడిచాయి.

ఆమె వెళ్ళిపోయిందని విన్న-ఇరుగు-పొరుగువారు మాత్రం - నేనేదో విషసర్పంనుంచి బైటపడినట్లుగా ఆనందించి....




"అవును. అభమూ శుభమూ యెరుగని—అమృతంలాంటి పిల్ల—ఆ అమాయకురాల్ని వదిలి; ఇంట్లో అద్దెకున్నారు కదా అని—ఎల్లకాలం దానితోనే పడివుండటానికి—అతడుమాత్రం అంత అజ్ఞానుడా? ఏదో పడుచుతనంబులబాటఁ కనుక...కొన్నాళ్ళు అదోముచ్చట"... అంటూ సమర్థించసాగారు.

—పాత సంవత్సరం వెళ్ళిపోయింది.

చైత్రంతో ప్రకృతిలో—అపూర్వమయిన శోభ–మార్పు వొస్తుంది కదూ! మరి నేనుమాత్రం ప్రకృతికి అతీతుణ్ణా? ఇంక నా ఉత్సాహానికి, ఉద్రేకానికి అవధి లేకుండా పోయింది.

మధురక్షణాల కోసం అనుక్షణాలు లెక్కించా

ఎలా అయితేయేం?

మూడురాత్రుల ముచ్చటలూ గడిచాయి.

కాని ఎలా గడిచాయి?

తిరిగి వొచ్చాను...

కళ్ళు తెరచాను...

నా కొత్త ఫ్రేములోనుంచి అంతా వింతగానే కన్పిస్తోంది.

కొత్త...అనుభూతి...

మధుర ... మధురాతి మధుర... మయిన క్షణాలు...

ఈ అనుభూతి–ఈ మధురత్వం–నా మాటల్లోనూ–ఊహల్లోనూ తప్ప! మరి మచ్చునకైనా కన్పించలా...

మార్పు అయితే కన్పిస్తున్నది. కాని అనుకొనని మార్పు.

అది చైత్రమని నేను భ్రాంతి పడ్డానేమో!...

లేకపోతే పచ్చని ఆకయినా కన్పిం చని ఆ చిచ్చుల పిడుగుల ఎండ లేమిటి—?

శరీరమంతా సెగలూ-పొగలూ...

మల్లెపూవు తగిలినా మాడిపోతు న్నది. .

ఏమిటో!...

వెనుక ఆమె చెప్పిన - ప్రతి అక్ష రమూ జ్ఞప్తికి వొచ్చింది. ఆమెతో గడి పిన ప్రతి ఘడియమాత్రం ఎలా జ్ఞప్తికి రాకుండా వుంటుంది? ..

వృథా ఆశలు కల్పించి - ఆమె అన్యాయంచేసి వెళ్ళిపోయిందా.. ?

ఆమె దగ్గరవున్న అతిచనువు మూలంగా అలా అనుకుంటున్నా. కాని నిజానికి ఆమె యేంచేసింది...?

ప్రకృతిలోని సహజత్వాన్ని చెప్పింది కాని ఈ వైపరీత్యం, పాపం! ఆమె మాత్రం ఊహించిందా?

అనుభవంలోకి వొస్తున్నా క్రమ క్రమంగా ఆమాత్రం ఊహించుకో లేనూ..! ఊహించేదేమిటి? ప్రత్యక్షంగా కన్పిస్తూంటే.

ఈ నా స్థితి ఆమెకు తెలిస్తే?...

ఏమవుతుందో వూహించగలను. కాని ఇది విన్నమీదట ఆమెస్థితి మళ్ళా తలుచుకుని మనస్సుమాత్రం ఆపుకో లేనేమో—!

అవునుమరి...ఎంత ఇదయినా నా మనస్సుమాత్రం మరీ అంత పాషాణమా?

ఇంక అలాంటి ఆలోచనలు ఎన్నైనా కలుగుతాయి. నాకేకాదు. అలాంటప్పుడు సాధారణంగా ఎవరికైనా అంతేనేమో...!

మానసికబాధకు మందనేది యెటూ లేదు

శారీరకబాధఅయినా తగ్గించుకుందా మని- ఇహ తప్పనిసరిగా-అభిమానాన్ని వదలి-డాక్టరుదగ్గరకు వెళ్ళాను.

మూడురాత్రుల ముచ్చటలకు ఫలి తంగా 'సాల్వర్సన్' నరాల్లోకి గ్రుచ్చుతూ గింగురుమనేట్లు ప్రశ్నిస్తున్నాడు డాక్టరు -"ఎవరు నాయనా ఆ మహాయిల్లాలు?"






**నా** పెళ్ళివిషయమై ఇతర్లు ప్రసంగించకుండా ఉంటే అది నిజంగా ఇంత క్లిష్ట సమస్య కాకపోను. ఎందుకంటే నేనా విషయం తలపెట్టరాదని ఎన్నోసార్లు తీర్మానించుకున్నాను. ఏ పదహారో యేటనో నాకు పెళ్ళయిఉంటే ఎంతో బాగుండిపోయేది. కాని అట్లా జరగలేదు. అటుతరవాతకూడా కొంతకాలంపాటు నేను పెళ్ళివిషయం తీవ్రంగా ఆలోచిస్తూ కూడా చేసుకోలేని స్థితిలో ఉండిపోయినాను ఆ రోజుల్లో నన్ను పిల్చి నాకు పిల్లనిస్తానన్న మానవుడు లేకపోయినాడు. ఉన్న కాస్త ఆస్తిపోయి యాభైరూపాయలమీద పెద్ద సంసారం ఈదుతున్నవాడికి పిల్లనివ్వటానికెవరెగబడతారు మరి?

ఇంతలో నాకు సరోజిని పరిచయం కలిగింది. సరోజినిని చూసిన తరవాత నాకింకొకర్ని పెళ్లాడాలనే ఆలోచన అసాధ్యమయింది. ఆమెకి అంత అగ్రస్థానం

ఎందుకిచ్చానో నేను చెప్పలేను. అంత కన్న అందమైన వాళ్ళను చూసిఉంటాను. అంతకన్న తెలివైనవాళ్ళనీ చూసి వుంటాను. కాని నాకు మరే ఆడదీ అంత సమీపంలోకి మటుకురాలేదు నేను సరోజినికోసం తపించలేదు. కలలు కనలేదు-- సామాన్య ప్రేమికులు చేసేది ఏదీ చెయ్యలేదు, కాని అంతకంటె లక్ష రెట్లు సన్నిహితమైన పనిచేశాను-ఆమెతో నా యిష్టాయిష్టాలూ కష్టసుఖాలూ చెప్పు కున్నాను. సరోజిని నా ఆత్మతో పరి చయం చేసుకున్నది అంతకంటె ఇద్దరు వ్యక్తులు ఒకరినొకరు సమీపించటం ఎట్లాగో నాకు తెలీదు.

నే నే వస్తువులు ఇష్టపడి తింటానో, ఏ పుస్తకాలు ఇష్టపడి చదువుతానో, ఏరకం మనుషులతో మనస్ఫూర్తిగా మాట్లాడతానో, ఏ రకం హాస్యం ఆమో దిస్తానో సరోజినికి సమగ్రంగా తెలుసు ఒక్కముక్కలో చెప్పాలంటే నన్ను గురించి ఆమెకు తెలియని విషయంలేదు.

అదీకాక, నా లక్షణాలను గురించి సరోజిని ఎన్నడూ ఏటువంటి తగాదా కూడా చెయ్యలేదు. "అందుకే నిన్ను చూస్తే నాకు కోపం" అనే పద్ధతి ఆమె నా విషయంలో ఒక్కసారికూడా అవ లంబించినట్టు నాకు జ్ఞాపకంలేదు. నన్ను ప్రత్యక్షాన ఎట్లాచూసేదోపరోక్షాన నన్ను గురించి అంతకంటె తక్కువచేసి మాట్లాడే దనుకోను ..అనేక ంమందికి అపోహ కూడాకలిగింది. ఆమెకు నామీద ఏదో మమకారం ఉన్నదని.

మూడోవిషయం ఏమంటే, నా పరిచయంవల్ల ఎదో కొద్దిపాటి మార్పు కలిగిందని నా నమ్మకం. ఆ మార్పు ఆమెకుగాని అమె నెరిగిన వారికిగాని అసంతృప్తి కలిగించ లేదనికూడా నా విశ్వాసం. "వెనుకటికన్న సరోజిని ఇప్పుడు చాలా నయంకాదూ?...సరదాగా మాట్లాడ్డం నేర్చింది!" అని ఒకరిద్దరు నా ఎదటే అనటం జరిగింది. ఆ మార్పుకు నేనే కారణమైతే ఎంత బాగుండునని చాలాసార్లనుకున్నాను. ఆఖరుకు ఆతిశయం పట్టలేక నేనే కార ణమని తేల్చుకున్నాను కూడాను. వుంది. విశ్వాసంనన్నిప్పటికీ వదలకుండా నిజం దేవుడికి తెలియాలి.

ఏమయినా మా యిద్దరి స్నేహం గురించి ఇప్పుడు వివరాలు తవ్వటం అనవసరం. అందులో తప్పుపట్టేందు కేమీలేదు. దురదృష్ట వశాత్తూ అందులో ప్రణయ లక్షణాలు...నేను పైన చెప్పి నవి తప్ప ఏమిలేవు "నేను సరోజినిని ప్రేమిస్తున్నాను" అనికూడా, నా అంత రాత్మలో అనుకున్న పాపాన పోలేదు.

కాని, అకస్మాత్తుగా ఈ భావం పైకిరావటానికి ప్రబలమైనకారణం యేర్ప డింది. సరోజినికి వరుసగా రెండు మూడు సంబంధాలు వచ్చినై.

సరోజిని నన్ను పెళ్ళిచేసుకోవాలని నేనెప్పుడూ అనుకోలేదు ఆమెకి పై సంబంధాలు నాయెదటే రావటానికి బదులు ముందుగా యెవరైనా మాకిద్దరికీ పెళ్ళయితేబాగుండునని సూచించివున్న ట్టయితే నా ఆలోచనని ప్రతిఘటించి ఉండేవాణ్ణేమోకూడానూ? ఎందుకంటే నా వంటి దరిద్రుణ్ణి పెళ్ళాడి సరోజిని యేం బావుకుంటుంది? నా కా మనిషిమీద ఈషత్తయినా యిష్టంవుంటే నన్ను పెళ్ళాడమని ఎట్లా అనగలను?

కాని అట్లాజరక్క నా యెదటే యెవరో సరోజినిని చూడరావటమూ, సరోజిని తన తల్లిదండ్రులతో ఆ వచ్చిన వాడి మంచిచెడ్డలు తర్కించటమూజరిగే సరికి, నాలో ఏదో వింతవికారం కలిగింది. సరోజినికి నే నేమవుతాను?తన దారిన తను యెవరినో పెళ్ళాడి నా పరిచయాన్ని ఏంచేద్దామనుకుంటున్నది? ఇంకో ప్రాణియొక్క ఆత్మను అంత సులభంగా అవతల పెట్టెయ్యటాని కున్నదా?ఉంటే నేను సరోజినిని అవతల పెట్టి మరెవరినో పెళ్ళాడటానికి నిశ్చింతగా ప్రయత్నంచెయ్యలేనా? ఏ పిల్లనో చూడబోయి ఆమె అందచందాలను గురించీ, చదువు సంధ్యలను గురించీ నిశ్చింతగా చర్చించటం అసాధ్య మని నాకెందు కనిపించాలి?... ఇంతకీ సరోజినికి ఆత్మ - "సోల్" అన్నే పదార్థం - లేదా? అంతసామాన్యపు మనిషా? అంత సామాన్యపు మనిషిని నేనింత పెద్ద చేశానా?

"ఏం చదివితే మాత్రం. నెలకి డెబ్భై సంపాదన ఏం సంపాదన నాన్నా! అని సరోజిని అన్నమాటలు నా అంతరాత్మలో గులకరాళ్ళల్లే చేరి ఎంతమథించినా జీర్ణానికి రాకపోయినై!... యాభై సంపాయించుకునే నన్ను గురించి సరోజిని ఏమనుకుంటూ వుండి ఉండాలి? .. నేను ఒకంతట పశ్చాత్తాపపడే ప్రాణినికాను కాని సరోజినికి నా సంపూర్ణ పరిచయం-స్నేహం— ఇచ్చినందుకు నేను చెప్పతరంగాని బాధపడ్డాను. ఆమె విషయమై వెనక ఎన్నడూ రాని ఆలోచనలన్నీ వచ్చినై. సరోజిని నన్ను పెళ్ళాడటాని కెందుకు ప్రయత్నం చెయ్యదూ? నేను తక్కువ సంపాదిస్తూ ఉంటేనేం? నాతో అంత తృప్తి చెందినట్టుకనిపించిన మనిషి, డబ్బుకొంతవరకు త్యాగం చెయ్యకూడదా? ఎంత భాగ్యవంతుడు వచ్చినా తనకి లక్షాధికారి రాడుగదా! ఏ వందో సంపాదించేవాడు రావచ్చు నాకోసం ఆ పై యాభై త్యాగం చెయ్యకూడదా? తనని పెళ్ళాడేవాడు ఏ రెండు వందలో సంపాదిస్తున్నాడని తెలిస్తే వాడి ఆత్మ ఎటువంటిదైనా పెళ్ళాడేస్తుందా ... యీ ఆలోచనల కంతేలేదు.

నాకు మరో సంగతికూడా తెలిసింది —నేను సరోజినిని ఇంతకాలమూ ఎంతో గాఢంగా ప్రేమించి వుండాలి

ఆమెమీద ఇంతకోపంగా వున్నా కూడా ఇంత విశాలప్రపంచంలోనూ నాకు సరోజినికంటె దగ్గిరగా రాగల మరో ఆడది కనిపించలేదు. సరోజిని మరొకణ్ణి పెళ్ళాడటం ఎంత రూఢో నేను "ఆజన్మ బ్రహ్మచర్యం అవలంబించటం కూడా అంత రూఢే అని తేలిపోయింది.

*  *  *

చిత్రమేమిటంటే నేను మా వూరూ సరోజినినీ వొదిలేసి వెళ్ళిన సంవత్సరానిక్కూడా ఈ విశ్వాసం నాలో అట్లాగే వుండిపోయింది. కాని సరోజిని కింకా పెళ్ళి కుదర లేదు. ఆ విషయం నాకు పట్టలేదు. సరోజిని ఎవర్నయినా చేసుకోనీ, చేసుకోకపోనీ, నన్ను మట్టుకు చేసుకోదు. ఆమెతో స్నేహం చేసినందు కెప్పుడయితే పశ్చాత్తాపపడ్డానో. అప్పుడే మా యిద్దరి మధ్యావున్న బాంధవ్యం కాస్తా దగ్ధమైపోయింది. నేనుచాలా అతిశయంగల జీవిని. నాలో ఒక మనిషి రెండుసార్లు పశ్చాత్తాపం తెప్పించనా? వొట్టిది?

నా కిప్పుడు ఒకటే ఆలోచన — సంపాదన. డబ్బే నాకు చుక్కాని. లంగరు లేనేలేదు. నెలకు రెండు మూడు వందలు సంపాదించేవాళ్ళు చాలా గొప్పవాళ్ళయితే నేను సంపాదనకోసం ఎక్కడికైనా వెళతాను. అవసరమైతే సముద్రాలు దాటిపోతాను. నన్నొకచోట బంధించేటందు కేమున్నది?

సముద్రం వొడ్డుకి పోతే గాగిచిప్పలు కావలసినన్ని. డబ్బు సంపాదించటం కష్టంకాదు— అదే ఆశయంగా పెట్టుకుని, మిగతా విషయాలకు ప్రాముఖ్యం ఇవ్వకుండా ఉంటె. పట్నం చేరాను. మనుషుల్ని ఆశ్రయించాను. ఏర్లుదాటి తెప్పలు కాల్చాను. మనుషులకి వేరే విలవలు చూడలేదు. ఏరుదాటే తెప్ప అవునా కాదా అని తప్ప ఓ సంవత్సరం తిరిగే టప్పటికి ఓ వెయ్యి బాంకులో నిలవ చేశాను. నెల నెలా రెండువందల యాభై అందుతున్నై.

ఆనందమా? తృప్తా? అటువంటి దేమీ లేదు. యదార్థం చెప్పాలంటే ఈ మహా పట్టణంలో నేను పొందిన ఆనందమంతా కలిపితే సరోజినితో ఒక్క గంటగడిపిన తృప్తితో సమానమవుతుందని నాకు నమ్మకంలేదు. కాని, సరోజిని స్నేహానికి జరిగిన పరాభవం చూస్తూ ఆ తృప్తిని గురించి ఏమని తృప్తిపడను? అనుభవాన్ని ఎట్లా తృణీకరించను? ఆ తృప్తిని గురించి తలచుకోటానికి ప్రయత్నించినప్పుడల్లా నాకు జ్ఞాపకం వస్తున్నది పరాభవమే. అది నన్ను వెన్నంటి వదలకుండా ఉంది.

కొంత ఆత్మోపశాంతి చేసుకుందామనే ఉద్దేశంతోనే సరోజిని తండ్రికి ఒక ఉత్తరం రాశాను. నా సంపాదనగురించి రాస్తూ, డబ్బును తిట్టాను. దానివల్ల మన శ్శాంతి లేదన్నాను. సరోజినికి తెచ్చే




మొగుణ్ణి కేవలం డబ్బుమాత్రమే చూసి నావంటి ఆత్మశాంతి లేనివాణ్ణి తీసుకు రావద్దన్నాను.

ఈ ఉత్తరానికి సరోజిని స్వయంగా సమాధానంరాస్తూ నేను బాగా సంపాదించుకుంటున్నందుకు తనకు చాలా సంతోషంగా ఉన్నదనీ, నాకు అర్హమైన సంపాదన లేనందుకు వెనక తనకెంతో కష్టంగా ఉంటూ ఉండేదనీ, దారిద్ర్యం ఎరిగి ఉండికూడా నేను డబ్బును తృణీకరించటం తనకు నచ్చలేదనీ, తను పెళ్లాడితే తప్పకుండా నావంటివాడినే పెళ్లాడుతుందనీ, ఆత్మశాంతి నాకు లోపించిన పక్షంలో నాకుతగిన ఆడదాన్ని పెళ్ళాడి తద్వారాతెచ్చుకోవచ్చుననీ, డబ్బును తిట్టనవసరంలేదనీ బోధించింది.

ఆ ఉత్తరం చూసి నే నేమనుకోను ? ఎండిపోయిన చెట్టు చిగిర్చినట్టయింది. మళ్ళీ నే నెరిగినగొంతు వినిపించింది. సరోజినిని నేనపార్థం చేసుకున్నానేమో నని అనుమానం కలిగింది. ఆలోచించిన కొద్దీ అనుమానం హెచ్చిందేగాని తగ్గ లేదు సరోజిని నాకు చేసిన అపకార మేమిటి? ఆమె పైకేమంటేనేం? ఎవర్ని పెళ్ళాడింది? ఎవర్నీ పెళ్ళాడలేదు. నేను తనని పెళ్ళాడటానికి సిద్ధంగా ఉన్నానని తెలిస్తే — నేను నోరు చేసుకుని అడిగి ఉంటే-నన్ను పెళ్లాడేదేమో? నే నెందుకంత తొందర పడ్డాను? వెనక నాకై నేను ఆమెను పెళ్ళాడతా ననక పోవటానికి కారణం ఉంది-దారిద్ర్యం. ఇప్పుడది అంతగా లేదుగా? ఇప్పుడు మించి పోయిందేమిటీ? ఇప్పు డెందు కడగరాదూ ?

కూచుని సరోజినికి ఎంతో ప్రేమపూర్వకంగా ఉత్తరంరాశాను కవరు మీద ఎడ్రసు కూడా రాశాను. ఉత్తరం తిరిగి చదువుతుండగా భయంకరమైన అనుమానం మరొకటి తల ఎత్తింది.

నేను దారిద్ర్యంలో వున్న రోజుల్లో సరోజిని నావంటివాణ్ణే తప్పక పెళ్ళాడతానని సూచనగానైనా నాతో ఎందు

కనలేదూ? అప్పటికీ ఇప్పటికీ నాలో ఏదో తేడా వుండబట్టేనా? అది నా ఇప్పటి అప్పటి, ఆర్జనల తేడాయేనా?

నా ఉత్సాహమంతా భగ్నమయింది నేను రాసిన ఉత్తరం చించేశాను. నా అశాంతి పదింతలయింది. నేను వెనక హృదయంలో పెట్టుకుని తిరిగినసరోజిని ఏమయింది? ఆ సరోజినికి బదులు ఈ సరోజిని ఎక్కణ్ణించి ఊడిపడింది. ఈ సరోజినిని ఆకర్షించిన నా జీతం మీదా, నేనుచేసే అర్థంలేని ఉద్యోగం మీదా రోతపుట్టింది... నేనింత దూరం వచ్చి డబ్బు సంపాదించటానికింత శ్రమ పడింది ఈ సరోజినిని ఆకర్షించటాని కేనని నా కిప్పుడు తోచసాగింది. నా ప్రయత్నం సఫలమయింది సరోజిని నన్నిప్పుడు నమ్మకంగా పెళ్లాడుతుంది. కాని నాకు సంతృప్తి కలగలేదు పైపెచ్చు ఈ సరోజిని ఎదుట కనిపిస్తున్న కొద్దీ నేను వెనక యెరిగిన సరోజిని కోసం ప్రాణం పీకసాగింది. ఆమెకోసం యెక్కడ వెతకను?

* * *

ఈ విధంగా నేను బాధపడుతున్న సమయంలో నాకు పెళ్ళిచెయ్యాలని చాలామంది. పట్టుబట్టినట్టు విశదమయింది అంతా కూడబలుక్కున్నట్టు అనేక మంది బంధువులూ, స్నేహితులూ నాకు సంబంధాలు తీసుకురాసాగారు... ఒక్కసారిగా ఒక డజనుమంది సరోజినులు—నాకక్కర లేని సరోజినులు-వెంటపడ్డట్టయింది

"ఎవరో ఒకర్ని పెళ్ళిచేసుకుని నలుగురితోబాటే కాలం వెళ్ళబుచ్చు నీ ముష్టి రెండువందలయాభై రూపాయలవుద్యోగం గురించి ఇంత మథనపడకు" అని అంతరాత్మ హెచ్చరించసాగింది

"నీ సరోజిని ఎక్కడోవుంది వెతికి పట్టుకో. నలుగురితోపాటే అనుకుని అందరూదిగే బురదగుంటలో దిగకు నీ వ్యక్తిత్వంచే చేతులారా పారేసుకోక" అని మరోవంక బుద్ధి మందలిస్తూ వచ్చింది

ఈ సందిగ్ధంలో సత్యనారాయణగారు ఒక సంబంధం తెచ్చారు ఎవరో బీద వాళ్ళ పిల్లట. చాలా బుద్ధిమంతురాలట పనిపాటలు బాగావచ్చుట. "నీవు చేసుకుంటే చాలా సుఖపడతావు, ఆ పిల్ల తల్లిదండ్రులకి మహోపకారం చేసినవాడి వవుతావు...నీకు ఉద్యోగం లేకపోయినా నీవంటి సంబంధం వాళ్ళు తీసుకురాలేరు. అంత బీదవాళ్ళు, పాపం నిన్ను కళ్ళ కద్దుకుంటారు..." అన్నారాయన

మిగిలిన బంధుమిత్రులందరి శిఫార్సులూ పెడచెవిని పెట్టిన నేను సత్యనారాయణగారి మాటలు ఆలకించాను. ఆయన భాష నా కెప్పుడూ అర్థమవుతుంది. ఆయన చాలా వుత్తముడు. ఆయనతో పరిచయం లేకపోతే ఈ పట్టణం నాకు దాదాపు అరణ్యమే.



కాని, ఆ బీదపిల్లని చేసుకుంటానని సత్యనారాయణగారి కెట్లా మాట ఇవ్వను? ఆ పిల్లని చేసుకోవటానికి ఒకటే అభ్యంతరం—నేను పోగొట్టుకున్న సరోజిని! ఆ సరోజినిని పట్టుకోవటానికి నేను ఏమాత్రమైనా ప్రయత్నించవద్దా? ఎట్లా ప్రయత్నించను?

ఆలోచించగా, ఆలోచించగా ఒక మార్గం దొరికింది.

* * *

నన్ను చూసి సరోజిని చాలా సంతోషం కనబరిచింది. ఏదో వుద్రేకం దాచటానికన్లే వసపోసిన పిట్టలాగ ఊపిరి తియ్యకుండా మాట్లాడింది. ఆఖరుకు మాటల సందర్భంలో ఏ పనిమీద వచ్చానసేదీ ఎంతకాలం వుంటానసేదీ ఆమె నోటంట దొర్లినై.

పెళ్ళి చేసుకునేటందుకని వచ్చానన్నాను. ఎవరి నన్నది

"చేసుకుంటే నిన్నయినా చేసుకుంటా" నన్నాను.

"నేనే ఏమిటి? చేసుకోదలిస్తే నాకన్న మంచివాళ్ళే దొరుకుతారు?" అన్నది సరోజిని.

"నాకు నువు చాలు," నన్నాను. అయినా పట్నంలో వుద్యోగం చేస్తుండగా ఎవరైనా దొరికేవాళ్ళేమోగాని ఇప్పు డెవరు దొరుకుతా" రన్నాను.

సరోజిని వులిక్కిపడింది. ఏమిటి వుద్యోగం పోయిందా అన్నది

"నేనే వదిలేశాను" అన్నాను.

ఎందుకన్నది.

"చూడు, సరోజినీ నేను నిన్నే పెళ్ళిచేసుకుందామని గట్టి తీర్మానంతో వచ్చాను నువు నన్ను వుద్యోగంకోసం చేసుకుంటున్నావనేది నన్ను బాధించ కుండా వుండగలందులకు వుద్యోగం వదలేసి వచ్చాను," అన్నాను.

సరోజిని మొహం జేవురించింది.

"అయితే నాలో అంత నమ్మకం లేదా?" అన్నది.

"నాలోనే నమ్మకంలేదు నావంటివాణ్ణి నువు చేసుకుంటావని నమ్మకం లేకనే ఈ పని చేశాను" అన్నాను.

"వుద్యోగం మానెయ్యకుండా వస్తే ఆ వుద్యోగం చూసి ఒప్పుకుంటా ననేనా మీ భయం?" అన్నది.

"ఆ భయం నువు ఈ క్షణాన తీర్చ వచ్చు. నన్ను పెళ్ళి చేసుకుంటావా?" అన్నాను.

"క్షమించండి నాలో నమ్మకం లేని వాళ్ళని ఎట్లా చేసుకోను?" అంటూ లేచి వెళ్ళిపోయింది.

నేను ఆమెను నిలిపి, "అన్నీ వట్టిదే. వుద్యోగంపోలేదు. ఏమీ పోలేదు వేళా కోళానికన్నాను" అన్నాను.

తక్షణమే ఆమె మొహం మారింది.

"మీదంతా విచిత్రమైన హాస్యం... పెళ్ళికెన్నిరోజులు శలవ తీసుకున్నారు?" అన్నది.

"వారంరోజులు" అన్నాను

"అంటే, అప్పుడే రెండురోజులైపోయినాయిగదా? ప్రయత్నాలు చేసుకోవద్దా? ముహూర్తం పెట్టుకోవద్దా? ఏదీ వ్యవధానం?" అన్నది.

"ప్రయత్నాలేమీలేవు...వాళ్ళు, పాపం, చాలా బీదవాళ్ళు ఏదో ముహూర్తం వుందని చెప్పారు. దానికి చేసెయ్యమంటే చేసేస్తారు," అన్నాను.

పాపం. సరోజిని మొహం సున్నం కొట్టినట్టయింది.

"ఎ— ఎ—ఎవరు— వాళ్ళు?" అన్నది

చెప్పాను. వీలుంటే పెళ్ళికి రమ్మని ఆహ్వానించాను.

సరోజిని నాకేసి చూళ్లేకపోయింది. తల వంచుకుని పిలుస్తున్నా పలక్కుండా వెళ్ళిపోయింది.

నా మనస్సు కుదటపడింది. ప్రశాంత హృదయంతో ఆ సాయంకాలమే నాక్కాబోయే అత్తవారూరు ప్రయాణమైనాను.






ఈ కథ పేరు చూసి యిదేదో రాజకీయ వ్యవహారం తాలూకు నివేదిక కాబోలునని భయపడకండి. ఇది నూటికి నూరుపాళ్ళ సాంసారిక కథ : ఒక సాధారణ దాంపత్యజీవితంలో సర్వ సాధారణంగా ఎదురయ్యే ఒడిదుడుకుల కథా కమామీషూ మాత్రమే : (సో, సాంసారిక కథలంటే వళ్లమండే పాఠకులు, మొగుడూ పెళ్ళాల కథలనగానే ముఖం మాడ్చుకునే మహానుభావులు - యీ పేజీని ఠపీమని తిప్పేయవచ్చు).

ఆ మధ్య ఓసారి కళ్యాణి భర్తమీద ఎందుకో చాలా గట్టిగా అలిగింది. ఆ మాటకువస్తే కళ్యాణి అడపాదడపా భర్తమీద అలుగుతూనే ఉంటుంది. అసలు అలగటమంటూ జరిగితే చాలా గట్టిగానే అలుగుతుంది కళ్యాణి.

ఏడేళ్ళ సాంసారిక జీవితంలో కనీసం కళ్యాణి భర్తమీద ఏడువందల సార్లయినా అలిగి ఉంటుంది. ఐనా ఆమె ఎప్పుడు ఏ కారణంతో ఎలా అలుగుతుందో యింతవరకు ఆమె భర్త కాంతారావుకి అంతుపట్టనేలేదు. కాలేజీలో ఇంగ్లీషు పాఠాలు చెప్పే కాంతారావుకి 'జీనియస్' అనే మారుపేరుంది.

ఐనప్పటికీ అర్ధాంగి అలకను

మాత్రం - అంటే దాని పుట్టుపూర్వోత్తరాలు, నివారణోపాయాలు, ఉపశమన మార్గాలు - వగైరా విషయాలను మాత్రం పరిపూర్తిగా అర్థంచేసుకోలేక పోయేడు కాంతారావు. అందుకే కాబోలు కళ్యాణి "మీరు 'జీనియస్' అని ఎవరండీ అనేది? నన్నడగమనండి. మీరెంత తెలివితక్కువ మనషులో నాకు తెలిసినట్లు బయటివాళ్ళకేం తెలుస్తుంది చెప్పండి" అంటుంది.

నిజమే! పనిమనిషి నెలలో పది రోజులు 'నాగా' పెట్టినా మందలించకుండా పూర్తిజీతం దాని చేతిలో పెట్టటం, పుచ్చు పురుగూ అన్నీ ఏరిచూసి కూరలను దుకాణంవాడు చేతిలోపెడ్తే బుద్ధిగా వాటిని యింటికి జేరవేయటం, అడిగిన వాళ్ళందరికీ కాదనకుండా చేబదుళ్ళు యివ్వటం, ఆ యిచ్చిన సంగతి మరుక్షణమే మర్చిపోవటం, ఒకవేళ గుర్తున్నా, తనకు ఎంతో డబ్బు అవసరం ఉన్నా, అప్పుని తిరిగి తీర్చమని అడగకపోవటం ... యివన్నీ కళ్యాణి దృష్టిలో తెలివితక్కువ విషయాలు కావటంలో తప్పేంలేదు.

వాటి సంగతటుంచి ఆధునిక ఆంగ్ల సాహిత్యంలోని స్త్రీపాత్రల స్వభావాలను గురించి నిశితంగా చదివి, థీసిస్ సబ్మిట్ చేసి, డాక్టరేట్ పట్టాపొందిన కాంతారావు అర్ధాంగి అలకయొక్క పూర్వాపరాలను క్షుణ్ణంగా తెలుసుకో లేకపోయేడంటే అది ముమ్మాటికీ తన తెలివితక్కువతనమే అని కాంతారావు కూడా స్వగతంలో వాపోతూంటాడు.

కళ్యాణి ఒక్కోసారి అలిగినప్పుడు, అలగబోయేముందు ఆ ఛాయలను తన ముఖకవళికలలోను, వస్త్రధారణలోను, చెంబూ తప్పేలాలు, పోపుడబ్బాలు, పప్పు డబ్బాలు మొదలైన వంటింటి వాద్యసమ్మేళనాలద్వారాను చూపెడుతూనే ఉంటుంది. కాని ఒక్కొక్కప్పుడు చక్కగా కాంతారావు కిష్టమైన చీరకట్టుకుని అతనికిష్టమైన కూరవండి స్వయంగా అన్నం కలిపి నోట్లోపెట్టే సమయంలో కూడా హఠాత్తుగా అలిగేస్తుంది. అక్కడే ఉంది అసలు చిక్కు. ఇక ఆమె అలకపాన్పు ఎక్కిందంటే కాంతారావుకి ఆమె కట్టుకున్న చీర మసిగుడ్డలాగాను, ఆమె పెట్టిన కూరముద్దలు కటిక విషంలాగానూ స్ఫురించక మానవు.

ఏ సినిమాకు వెళ్ళాలీ అన్న విషయంమీదగాని, పండక్కి ఎలాటి చీర కొనాలీ అన్న విషయంమీదగాని పొరపాటున ఎప్పుడన్నా కాంతారావు మాట నెగ్గిందో కళ్యాణి మనసు అల్లల్లాడిపోతుంది. స్త్రీ జాతిని అణగద్రొక్కటానికే పుట్టిన మగరాక్షస జాతికి ప్రతినిధిగా కనిపిస్తాడతడాసమయంలో.

"అసలు మీ బూర్జువా మొగుళ్ళ ఆటలిన్నాళ్ళూ సాగనివ్వటమే మా

తప్పు. ఇప్పటికైనా స్త్రీజాతి మేల్కొని మీ 'జులుం' ని పడగొట్టి, నవసంసార నిర్మాణం చెయ్యాలి" అంటూ ఉపన్యాసం యిస్తుంది.

"అసలు కళ్యాణిని తెలుగు వారపత్రికలు, నవలలు, ఫెమినాలు చదవనివ్వటమే పెద్ద పొరపాటు. ఎక్కడో పాశ్చాత్యదేశాల్లో తలెత్తిన "ఉమెన్సు లిబ్" తాలూకు మంటలు ఇండియాలోకి కూడా పాకేట్టుచేస్తున్నయ్ యీ పత్రికలు, ఖర్మ !" అనుకున్నాడు కాంతారావు.

"కొంపతీసి వీళ్ళుకూడా అప్పడాల కర్రలు, రోకలిబండలు తీసుకుని సాయుధ పోరాటానికి సిద్ధంకారుకదా" అని కూడా భయపడిపోతూంటాడు. ఎంత చదువుకున్నా, ఎన్ని ఉన్నత భావాలున్నా, అతను భారతీయ భర్తయ్యె ! ఆ మాత్రం భయపడటంలో ఆశ్చర్యంలేదు.

ఐతే ప్రేయసిని భార్యగా చేసుకుని, భార్యలోనే ప్రేయసిని చూసుకుంటూ సంసారాన్ని సుందరకావ్యంగా మలచుకోవాలనుకునే సెంటిమెంటల్ మగవాడు కనుక ఆ పరిస్థితి అసలు రాకుండానే చూడాలని ప్రయత్నిస్తుంటాడు కాంతారావు.

వానరాకడ, ప్రాణంపోకడ తెలియదంటారు. అలాగే కళ్యాణి అలకరాకడ కూడా కాంతారావుకి యింతవరకు అంతుపట్టని సమస్యే అయింది.

ఆ అలక రానేరాకూడదు కాని వచ్చిందంటే దాని అంతేమిటో కళ్యాణి తేల్చుకునేవరకు ఇద్దరికీ నిద్రాహారాలుండవు.

"అసలు మీకు నా మీద 'ప్రేమ' అనేదేమన్నా ఉందా ?" అని ఓసారి ఉన్నట్టుండి అడిగేస్తుంది నిలబెట్టి.

"అదేం ? ఏమిటా ప్రశ్న ?" అని అతనింకా యేమిటో అనే లోపలే సగం కోపం వచ్చేస్తుంది కళ్యాణికి.

"ఏమి ప్రశ్నేమిటి ? ఒక ఆడది మొగుణ్ణి అడగవలసిన ప్రశ్నే అది. మీరలా తప్పించుకోవటంలోనే తెలిసిపోతోంది మీకు నా మీద ఎంత ప్రేమ ఉందో..." అంటూ పూర్తికోపం తెచ్చుకుంటుంది కళ్యాణి.

అక్కడినుండి అనునయాలు, కన్నీళ్ళు, లాలింపులు, ముక్కుచీదుళ్ళు, ముద్దులు, మోహమాటాలు, క్షమార్పణలు, బెట్టుసరులు, నవ్వులు... ఆ క్రమంలో ప్రణయకలహం తాలూకు కార్యక్రమం పూర్తవుతుంది.

ఇలాటి తంతులు వారి దాంపత్య జీవితంలో ఎన్ని జరిగేయంటే చివరికి వారికే ఆ ఘట్టం సమీపిస్తుందనగానే బోరుకొట్టడం ప్రారంభించింది.

అందుకే ఏ విషయానికైనా-ఆఖరికి భార్యాభర్తల మధ్య వచ్చే ప్రణయ కలహాలకి కూడా కొన్ని నియమ నిబం

ధనలు ఉండి తీరాలి అన్న ఉద్దేశ్యం వారికి ఏర్పడింది వాటికోసం ప్రత్యేకించి కొన్ని సూత్రాలను ప్రతిపాదించేడు కాంతారావు. సవరణల పేరిట ఆ సూత్రాల స్వరూపమే మార్చివేసి, వాటిని 'సూత్రప్రాయంగా' ఆమోదించింది కళ్యాణి

చివరికి ఆ భార్యాభర్తలిద్దరూ తయారుచేసిన ఆరుసూత్రాల పధకం తాలూకు సారాంశం యిది.

మొదటి సూత్రం :- తమ ఇద్దరికీ మధ్య భేదాభిప్రాయాలు వచ్చినప్పుడు శాంతియుతమైన పద్ధతిలో నోటిమాటల ద్వారా సమస్యను పరిష్కరించుకోవాలే తప్ప అనవసరంగా చెంబులు, గ్లాసులు, పళ్ళేలు మొదలైన నిస్సహాయులు, నిర్జీవులు అయిన జడపదార్థాలను ధ్వంసం చేసుకోకూడదు.

ఈ సూత్రాన్ని కాంతారావు ప్రతిపాదించగానే కళ్యాణి మూతిని ముప్పై వంకర్లు తిప్పింది. "అంటే యేమిటి ? వాటితో మిమ్మల్ని నేనేమన్నా కొడుతున్నానా ? ఇలాటి అబద్ధపు ఆరోపణలుచేసి నన్ను అవమానపరచటానికే మీరీ సూత్రాన్ని యిరికించేరు" అంది ముక్కుచీదేస్తూ.

"నన్ను కొట్టినా బాగానే ఉండును. వాటిని నేలకేసి కొడుతుంటే ఎన్ని గిన్నెలకు సొట్టలుపడుతున్నాయో ఎన్ని గరిటెల కాడలు విరిగిపోతున్నాయో ... నీకు తెలియందేముంది చెప్పు ? అందుకే యిలాటి చిన్న చిన్న విషయాలకోసం వస్తునష్టం చేసుకోవటంలో అర్థమేమన్నా ఉందా ? ఆ వస్తువులు పాడైపోతే చివరికి నష్టపోయేది నువ్వేగా. ఉదాహరణకి క్రిందటి నెలలో ఒక చారుగరిటె, ఒక అన్నంతినే పళ్ళెం మరీ ఉపయోగపడే స్థితిలో లేకపోవటంవల్ల వాటిని కొత్తగా కొనవలసి వచ్చింది. పనిలో పనిగా మరో రెండు స్టీలు గిన్నెలు కూడా కొంటివి. మొత్తం ఎనభై రెండు రూపాయలు నష్టంఅయింది. ఆ గరిటె, పళ్ళెం పాడుకాకుండా ఉన్నట్లయితే ఆ స్టీలు సామాన్లన్నీ కొనకపోయేవాళ్ళమే కదా. ఆ ఎనభై రెండు రూపాయలూ మిగిలినట్లయితే నీకో నైలెక్సు చీర వచ్చేది కదా !" అన్నాడు కాంతారావు.

కాంతారావు యిచ్చిన ఉపన్యాసంలో ఒక్క వాక్యమైనా తలకెక్కించుకోకపోయినా 'నైలెక్సు చీర' అన్న పదం మాత్రం బాగా పనిచేసింది కళ్యాణిమీద

అతనన్నమాటల్లో కొంత నిజం లేకపోలేదు అనుకుంది. వెనుకటికెవరో "తేగలా అయిపోయావే" అంటే 'తేగ కావాలి' అని ఏడ్చినట్లు కళ్యాణికి "నైలెక్సు చీర" అన్నపదం విన్న తరవాత చీరలను గురించి కాంతారావుకి పెట్టుకున్న విన్నపాలు, వేధింపులు అన్నీ గుర్తుకు వచ్చినయ్ వెంటనే ప్రతి నెలా తనకొక చీర - యాభై రూపాయలకు




తక్కువకాకుండా కొనిపెట్టాలనీ, పండగలు, పుట్టినరోజులు (పుట్టిన రోజులు–అని ఎందుకంటున్నానంటే తన పుట్టిన రోజునే కాక భర్త పుట్టిన రోజునకూడా కొత్తచీర కట్టుకోవటం కళ్యాణికి ఆనవాయితీ) మొదలైన సందర్భాలలో పంద రూపాయలచీర కొనివ్వాలనీ దీనిని తమ ఆరు సూత్రాల పథకంలో చేర్చటం తప్పనిసరి అనీ, ఎందువల్లనంటే ఎన్నో సంవత్సరాలుగా తనీవిషయంలో అతనిని ఎన్నిసార్లు వేధించుకుతిన్నా, వేడుకున్నా లెక్కచెయ్యక అతను తన కోర్కెలను తీర్చటం లేదనీ అందుకే యిది తమ పథకంలో లిఖితపూర్వకంగా ఉండవలసిన అంశమనీ నొక్కివక్కాణించింది కళ్యాణి

కాని కాంతారావుకి మాత్రం అంత సిల్లీ విషయాన్ని ఆరుసూత్రాల పథకం వంటి బృహత్తర ప్రణాళికలో చేర్చితాను 'కమిట్' కావటం యిష్టంలేకపోయింది అందుకే ఆ సూత్రాన్ని కాస్త సవరించుకోమని కళ్యాణిని బ్రతిమాలేడు.

"నేడు దేశ పరిస్థితులు ఎలా ఉన్నాయో కాస్త ఆలోచించు" అన్నాడు.

"నేటి దేశ పరిస్థితులకీ నా నైలెక్సు చీరకూ సంబంధ మేమిటండీ? పెట్రోలు ధర పెరిగిందని రిక్షా కిరాయి, బియ్యం, కూరల ధరలు పెంచమని అడిగినట్లుంది" అంది తనెంతో తెలివిగా మాట్లాడుతున్నానని మురిసిపోతూ కళ్యాణి.

"అక్కడే పొరబడుతున్నావు కళ్యాణీ! మనం సంఘజీవులం. ప్రధానంగా ప్రపంచపౌరులం. ఇతరులతో నిమిత్తం లేకుండా, ప్రపంచరాజకీయాలతో సంబంధంలేకుండా మనం బ్రతకాలనుకున్నా బ్రతకలేం. వెస్టేషియాలో యుద్ధం జరుగుతున్నందుకు మనదేశంలో పెట్రోలు ధర పెరగటం, ఎక్కడో

అమెరికాలోని డాలరు విలువనుబట్టి మన రూపాయ పట్టీలు కొట్టడం...ఇవన్నీ ఏమిటనుకుంటున్నావు? దేశ పరిస్థితులు బాగాలేదు కాబట్టి నువ్వు జాకెట్టు కుట్టించుకునే టూబై టూ గుడ్డ మీటరు ఇరవై రూపాయలయింది. నువ్వు పెళ్ళిరోజున నూటయేభై కి కొనుక్కున్న పట్టుచీర ఖరీదు ఈరోజు మూడువందలు. నాలాటి మధ్యతరగతి మొగుణ్ణి నెలకోచీర కొనివ్వమని అడగటం నీవంటి చదువుకున్న భార్యకి తగిన విషయమేనా చెప్పు" అంటూ బిక్కమొహంపెట్టాడు.

"అబ్బబ్బ, నేనేదో గంపగయ్యాళి నయినట్లు, మీ ప్రాణాలన్నీ తోడేస్తున్నట్లు— ఎందుకండీ అలా మొహం పెడ్తారు?''అని విసుక్కుని, కాసేపుగుణిసి చివరకునెలకొకటి కాకపోయినా దసరా, దీపావళి, సంక్రాంతి, ఉగాది, రెండుపుట్టిన రోజులు, వెడ్డింగ్ యానివర్సరీ కాక శ్రావణమాసంలో ఒక చీర-అన్నీ కలిపి ఎనిమిది చీరలు ఏడాదిలో కొనేట్లుగా భర్త అంగీకారాన్ని తీసుకుంది కళ్యాణి.

ఇక మూడవ సూత్రం సినిమాలను గురించి. కాంతారావు నెలకు నాలుగు సినిమాలు చూద్దామంటే కళ్యాణి రెండు చాలు అంటుంది. కళ్యాణి సినిమాలకు అభ్యంతరం తెలపడానికి కారణం పొదుపూ గట్రా అనుకునేరు అది మాత్రంకాదు ఒకప్పుడు కళ్యాణి కాంతారావుకన్న ఎక్కువగానే సినిమాలంటే చెవికోసుకునేది. కాని యీ రోజుల్లో వస్తున్న సినిమాల తీరూతెన్నూ చూసేక కళ్యాణికి సినిమాలనగానే ఒకరకమైన 'ఎలర్జీ' లాంటిది కలగసాగింది. ప్రస్తుతము వస్తున్న తెలుగు సినిమాలను కనుక పరిశీలించినట్లయితే ప్రతి పది సినిమాలలోనూ ఏడు సినిమాలలోని హీరోకి ఇద్దరు హీరోయిన్లుంటున్నారు. ఐనా ఈ మగవాళ్ళకీమధ్య మరీ బుద్ధిలేకుండా పోతోంది. ప్రేయసిగా ఒకస్త్రీకి, భార్యగా ఒక స్త్రీకి హృదయంలో రెండు సీట్లను కేటాయించి అటునుండి యిటూ యిటు నుండి అటూ ప్రేమను కుప్పిగంతులు వేయించడం ఫ్యాషనైపోయిందికొన్నాళ్ళు. పోన్లే ప్రేమించింది ఎవరినైతేనే, పెళ్ళి చేసికొన్నది ఒక్కతినేకదా అని సరిపెట్టుకుంటుంటే యీ మధ్య సినిమా హీరోలకి డెలిబరేట్‌గా రెండు పెళ్ళిళ్ళు చేసేస్తున్నారు సినీ రచయిత (త్రు)లు. ఒక మగవాడు ఇద్దరు స్త్రీలను వివాహమాడటం చట్టబద్ధంకాదనీ, నాగరిక సమాజంలోని ప్రధానాంశమైన వివాహ వ్యవస్థనే కించపరచటమనీ, పైగా అనారోగ్యకరమైన సెంటిమెంట్స్‌ను ప్రేక్షకుల మనసులలో నాటటమనీ...యివన్నీ ఆ కథవ్రాసిన వాళ్ళకు, వ్రాయించిన వాళ్ళకు కథను నడిపించిన వాళ్ళకు - వీళ్ళ కందరికీ ఎందుకు తెలియదా అని వాపోతూంటుంది కళ్యాణి. తనుగనుక సెన్సార్‌బోర్డు మెంబరయినట్లయితే

మొట్టమొదట ఇద్దరమ్మాయిలు, ఒక బ్బాయి మధ్య ఏర్పడిన ప్రణయ త్రికోణాన్ని పుటుక్కుని కత్తిరించేస్తుందిఅను కునేది కళ్యాణి. ఇలాంటి ఇద్దరమ్మాయిల ప్రేమకథలుగల సినిమాలు చూసేక ఎంత శ్రీరామచంద్రుడికైనా మనసు చలించకపోదని కళ్యాణి భయం. అందుకే. భర్తను అలాటి సినిమాలకు ఎంత దూరంగా ఉంచితే అంతమంచిదన్న ఉద్దేశ్యంతో సినిమాలను చూడటం తగ్గించుకుంది కళ్యాణి. భార్య అంతరంగంలోని యీ లోతుపాతులన్నీ తెలియని కాంతారావు ఎంతకూ తన ధోరణిలో సినిమాకు పోదామని పోరుపెడ్తాడేతప్ప ఆమె ఎందుకు రానంటుందో అర్థంచేసుకోవటానికి ప్రయత్నించడు.

ఐతే యీ చూడవలసిన సినిమాల సంఖ్యను ఆరుసూత్రాల పథకంలో చేర్చవలసి వచ్చేసరికి కళ్యాణికి తన అభ్యంతరమేమిటో భర్తకి చెప్పక తప్పలేదు

"అంటే నీ ఉద్దేశ్యం–ఆ సినిమాలు చూసి నేను కూడా రెండో పెళ్లి చేసుకుంటాననా?" అనడిగాడు కాంతారావు చిరాగ్గా.

"అబ్బ, మరీ పచ్చిగా అలా మాట్లాడకండి. మీ సంగతి నాకు తెలియదటండీ. ఏదో ఆడమనసు..."

"చాల్లే. ఫూలిష్‌గా మాట్లాడకు. నెలకు నాలుగు సినిమాలు చూసే ఫన్ అన్నా జీవితంలో లేకపోతే ' ఎలా? కాబట్టి నువ్వు ఎలాగైనాసరే యీ విషయంలో పూర్తిగా ఏకీభవించాలి. మరీ నీకంత భయంగా ఉంటే ఒక పనిచెయ్యి మహిళలందరూ కలసి మీరు కనుక ఇద్దమ్మాయిలతో కాలక్షేపం చేసే హీరో కథలను వెండితెరకెక్కించేరంటే వాటిని చూసిన మా భర్తలు ఏక పత్నీవ్రతానికి ఉద్వాసన చెప్పేస్తారేమోనని మాకంద భయంగా ఉంది కనుక మీరిలాటి సినిమాలను తీసి మా భర్తలను పాడు చెయ్యకండి అంటూ సినీ నిర్మాతలందరికీ ఒక విన్నపం పెట్టుకొండి" అన్నాడు కాంతారావు.

అలాగని అంతటితో ఊరుకున్నాపోయేది. "ఐనా సినిమాలు చూడకుండా అడ్డుపెట్టినంత మాత్రాన సరిపోతుందా? చెడిపోయే రోజు రావాలేగాని మగవాడికి ఎన్ని మార్గాలు లేవు? ఎన్ని అవకాశాలు లేవు?" అన్నాడు కొంటెగా కాంతారావు.

ఇక ఆ మాటలకు అతను కోరుకున్న దానికంటె పదిరెట్లు ఎక్కువగానే కళ్యాణి ఉడుకోవటంతో వాళ్ల సిక్స్ పాయింట్ ఫార్ములాకి హఠాత్తుగా ఆటంకం వచ్చింది.

కళ్యాణి విసురుగా లేచి వెళ్లి పక్కమీద ముసుగుతన్ని పడుకుంది కాంతారావు ఆమె పక్కనే అతికష్టంమీద చోటుచేసుకుని పడుకుని ఆమెను లాలించి మామూలు స్థితికి తీసుకువచ్చేసరికి గంటసేపు పట్టింది

చివరికి సినిమాల విషయంలో

ఇద్దరికీ అంగీకార యోగ్యమైన ఒక సూత్రాన్ని తయారుచేసేరు. అదేమంటే కాంతారావు చెప్పినట్టు నెలకు నాలుగు సినిమాలు చూడవచ్చు. కాని సినిమాలు చూసేముందు ఆ సినిమాలను గూర్చిన సమీక్షలను పత్రికలలో చదివి, అందులో ఇద్దరు భార్యలు, ఒక భర్త థీములేదని తెలుసుకున్న తరువాతనే వెళ్లాలి.

నాల్గవ సూత్రం కళ్యాణి అడపాదడపా దాచే బ్లాక్ మనీని గురించి. ఇంటి ఖర్చులకుగాను కళ్యాణికి భర్తయిచ్చిన డబ్బులో పొదుపుచేసిన మొత్తాన్ని పోపుడబ్బాలలోను పట్టుచీరల మడతలలోను దాచేస్తుంది కళ్యాణి. ఆ సంగతి మొదటిసారిగా గ్రహించిన కాంతారావు "నువ్వేదో అభ్యుదయ భావాలుగల ఆడదాని వనుకున్నాను కానీ మరీ యిలా బ్లాక్ మనీని దాచేంతటి కాపిటలిస్టువనుకో లేదు కళ్యాణీ" అన్నాడు ఆ మాటలు విన్న కళ్యాణి కాసేపు మూతిముడుచుకుని వెంటనే గయ్యిమంటూ లేచింది. "ఎలాగోలా కష్టపడి వెయ్యి రూపాయలు సమకూర్చుదామని నేననుకుంటుంటే మధ్య పానకంలో పుడకలా మీరడ్డు పడతారేమండీ ?" అన్నది

"ఎప్పుడో రాబోయే వెయ్యికోసం యీ నెల సుఖాన్ని పోగొట్టుకోవటమెందుకు ? నువ్వు దాచే పదీ పరకాతో హాయిగా మరో రెండు సినిమాలు చూడవచ్చుగదా అసలే రోజు రోజుకీ రూపాయ విలువ పడిపోతోంది. నువ్వు వెయ్యి రూపాయలు జమచేసే రోజుకి ఆ మొత్తం విలువ నేటి ఐదువందల రూపాయల విలువకు సమానం కావచ్చు అందుకే నా మాట విని నల్ల డబ్బును యిప్పుడే తెలుపు చేసెయ్. హాయిగా ఎంజాయ్ చేద్దాం" అన్నాడు. ఆ మాటలకు ఏం సమాధానం చెప్పాలో తెలియక కళ్యాణి విసవిస లేచివెళ్లి అక్కడా యిక్కడా తాను దాచిన బ్లాక్ మనీ తాలూకు నూటముప్పై ఏడు రూపాయల చిల్లరా అతని ముందు పోసింది ఆ తరువాత భార్యా భర్త లిద్దరూ నల్ల డబ్బును కూడబెట్టటంవల్ల అనుకున్నంత లాభం కలగకపోగా నష్టం కూడా కలిగే ప్రమాదముందనీ అందుకే ఆ పద్ధతిని పూర్తిగా వదిలిపెట్టేయాలనీ అనుకున్నారు.

ఐదవ సూత్రం తాము కలహ ఘట్టంలో ఉండగా ఎలా ప్రవర్తించాలీ అన్న విషయాన్నిగురించి. మౌన వ్రతమే మహోత్తమం అంటాడు కాంతారావు. ఓగంటో రెండు గంటలో(కలహ తీవ్రతనుబట్టి) ఇద్దరూ మౌనంగా చెరో గదిలోనూ కూర్చున్నట్లయితే కోపం దానంతట అదే తగ్గిపోతుందనీ కోపం తగ్గిన తరవాత ఒకరినొకరు మామూలుగా పలకరించుకోవచ్చుననీ అంటాడు కాంతారావు

"మీరు చెప్పే విషయం వినటానికి బాగానేఉంది ప్రాక్టికల్‌గా చూస్తే అసాధ్యం అనిపిస్తోంది. ముఖ్యంగా

నేనీ సూత్రానికి కట్టుబడి ఉండటం అంత తేలికైన విషయంకాదు ఎందు కంటే మీకు కోపం వచ్చినప్పుడు చక్కగా ఏ పేపరో పుస్తకమో చదువు కుంటూ ఈజీఛైర్లో జేరగిలబడి కూర్చుం టారు. నా మటుకు నేను ఎలా కూర్చో గలను? "అన్నం వడ్డించేను రండి" అనో "ఏం కూరవండమంటారు?" అనో టీ "తీసుకోండి" అనో ఏదో ఒక విషయాన్ని గురించి మాట్లాడక తప్పదు మీకు సంబంధం లేని పనులు యీ యింట్లో ఏమున్నాయి? ఉన్న పనులన్ని టినీ చేసేది నేనేకదా అలాటప్పుడు యిష్టం ఉన్నా లేకపోయినా మీతో మాట్లాడక తప్పదు. ఏ కారణంచేత నైనా మౌనవ్రతానికి ఒకసారి భంగం కలిగినా ఆ సూత్రానికే భంగం వాటిల్లి నట్లుకదా" అన్నది కళ్యాణి.

ఆమె చెప్పినదాంట్లో నిజం లేకపో లేదనిపించింది కాంతారావుకి కూడా. అందుకే తన సూత్రాన్ని కొంచెం సవ రించటానికి ఒప్పుకున్నాడు. ఇందాక కళ్యాణి ఉదహరించిన 'అన్నం వడ్డిం చేను' 'ఏం కూర వండా?' లాటి వన్నీ భార్యా భర్తలందరి మధ్యా 'అఫిషియల్'గా జరిగే సంభాషణలే. వాటిని నిత్యజీవితంలోనుండితొలగించటం కష్టం. 'మౌనవ్రతం' అంటే మనసు విప్పి అరమరికలు లేకుండా 'స్వేచ్ఛగా' మాట్లాడకపోవటం అని కాంతారావు ఉద్దేశ్యం. కాబట్టి కలహ ఘట్టంలో అధికార సంభాషణలే తప్ప అనధికార సంభా షణలు, చర్చలు జరగటానికి వీల్లేదు అని ఐదవ సూత్రాన్ని తయారుచేయటం జరిగింది.

ఆఖరుదీ ఆరవదీ అయిన సూత్రం ప్రణయకలహం వచ్చినప్పుడు కోప తాపాల ఘట్టాలన్నీ పూర్తయిన తరువాత ముందుగా ఎవరు మాటలు కలపాలి అన్న విషయాన్ని గురించి.

''ఎవరు కలహానికి నాంది పలుకు తారో వాళ్ళే మాటలు కలిపి ఆ కలహాన్ని సమాప్తం చెయ్యాలి" అన్నాడు కాంతారావు.

కాంతారావు అలా అనటంలో కొంత లౌక్యం లేకపోలేదు. సాధారణంగా కయ్యానికి కాలు దువ్వేది కళ్యాణే. అందువల్లనే దానిని అంతంచేసే బాధ్య తను కూడా ఆమెకిస్తే బాగుండునని భావించి అలాగన్నాడు

కళ్యాణిమాత్రం తక్కువదా? "అసలు కలహానికి కారణాన్ని కలిపిం చిందెవరో వాళ్ళే ముందు పలకరించాలి'' అన్నది ఆమె దృష్టిలో కలహాన్ని ఎవరు ప్రారంభించినా అది కాంతారావు తెలిసో తెలియకో చేసిన పొరపాటు వల్లనే కలహం ఏర్పడుతుంది అందుకే ఆ మాట అన్నది

దానికి కాంతారావు అంగీకరించలేదు కొంచెంసేపు తర్జన భర్జనలు జరిగి నయ్ చివరికి కలహంలో ఎవరిది పైచెయ్యి అయితే వారే మొదట మాటలు

కలపటానికి ప్రయత్నించాలి అన్న నిర్ణయానికి వద్దామనుకున్నారు. కాని "పైచెయ్యి ఎవరిది ?" అన్న విషయాన్ని తేల్చుకోవటం కూడా ఏమంత సులభం కాదని వాళ్లకు తెలిసింది.

"కలహంలో ఎప్పుడూ పైచెయ్యి నీదేగా" అని కాంతారావు అంటే,

"అసలు 'కీ' యిచ్చి కూర్చునేది మీరు. ఆ తరువాత ఊరికే పిచ్చి మొద్దులాగా వాగుతాను నేను. దాంతో మీరేదో మహర్షులయినట్లు, నేనేమో గయ్యాళి గంపనయినట్లు కనపడుతుంది పైకి. నిజానికి నిశితంగా పరిశీలించినట్లయితే కలహంలో ప్రధానపాత్ర మీదే కాబట్టి మీరే మొదట పలకరించాలి." అన్నది కళ్యాణి ఖచ్చితంగా.

కాంతారావుకి తలూపక తప్పలేదు. ఎంతైనా 'లిటరేచర్' మనిషి కనక తప్పు ఎవరిదైనా ప్రణయకలహం భర్త అనునయాలతోను, లాలింపులతోనూ అవసరమైతే క్షమార్పణలతోనూ ముగిసినప్పుడే రక్తికడుతుందని గ్రహించినవాడై తానే మొదట పలకరించటానికి మనస్ఫూర్తిగా అంగీకరించేడు.

అలా భార్యాభర్త లిద్దరూ ఎంతో కష్టపడి ఆరు సూత్రాల పథకాన్ని తయారుచేసి పట్టుమని ఆరు నెల్లన్నా కాకముందే అందులోని ఒక్కొక్క సూత్రం కనీసం అరవైసార్లయినా ఎవరో ఒకరివల్ల ఉల్లంఘింపబడిందని వేరే చెప్పనక్కర్లేదనుకుంటాను. అలాటి కఠిన సూత్రాలను అమలులో పెట్టటం ఎంత అసాధ్యమో అనుభవజ్ఞులైన దంపతులకు అసలే చెప్పనక్కర్లేదు.

కాని ఎంతైనా కాంతారావు కాస్త 'ప్రిన్సిపుల్సు' ఉన్న మనిషి కనుక తమ ఫార్ములా అలా నామరూపాలు లేకుండా పోవటం చూసి ఉసూరుమన్నాడు.

ఓ రోజు ధైర్యంచేసి భార్యతో "మరీ యిలాగైతే. ఎలా కళ్యాణీ ?" అనికూడా అన్నాడు.

దానికి ఫక్కుమని నవ్వింది కళ్యాణి.

"నువ్వు ఎంత ఫూల్‌వి కాంతం ! (కళ్యాణికి భర్తమీద ప్రేమ అతిగా పుట్టుకు వచ్చినప్పుడు అలాగే అంటుంది. కాబట్టి భర్తలెవరూ భయపడనవసరం లేదని ప్రార్థన). ఐదు సూత్రాల పథకాలు, ఆరు సూత్రాల పథకాలు-నిజంగా, నిండుగా బ్రతికే మనలాటి భార్యాభర్తలకు ఆ సూత్రాలన్నీ ఎందుకు ? యుగయుగాలుగా దంపతులందరినీ బంధించుతూ వస్తున్నది ఒకే ఒక్క సూత్రం అదే ప్రేమసూత్రం" అంటూ రెండు చేతులతోను అతని మెడను చుట్టివేసి, అతనిని దగ్గరకు లాక్కుని, అతని తలను తన గుండెకదుముకుంది కళ్యాణి.

అలాటి క్షణాలలో ఏ భర్తమాత్రం నోరుతెరిచి మాట్లాడగలడు ?

---

# అగ్ని పరీక్ష

## మాదిరెడ్డి సులోచన

(గత సంచిక తరువాయి)

రాత్రి పదకొండు గంటలకువచ్చి, భోజనంచేసి, పైకిపోబోతూ, తల్లి గదిలోకి వెళ్ళాడు. రోజూ అది అలవాటే. కొడుకునుచూచి వెడతాడు. అందరూ నిదురబోయారు. ప్రభ తలవైపు టేబిల్ ల్యాంప్ వెలుగుతుంది. అది ఆర్పి, గుండెలమీదున్న పుస్తకం ప్రక్కన పెట్టి, దుప్పటి సరిగ్గా కప్పాడు. భార్య దగ్గరి బల్లమీది మందులు పరీక్షగా చూచి, కొడుకు దగ్గర నిలబడి, వెళ్ళబోయాడు.

"విష్ణూ !"

"నువ్వింకా పడుకోలేదా అమ్మా ?"

"పడుకుంటానుగాని, ఇలాకూర్చో".

అతను వచ్చి తల్లి మంచము చివర కూర్చున్నాడు.

"ఇన్నాళ్ళు నువ్వేది చెప్పినా విన్నానురా. ఈ ఒక్క విషయములో నామాట వినాలి."

"ఏ విషయములో ?" ఆశ్చర్యంగా అడిగాడు.

"ఉదయ్ పెళ్ళి వి ష య ము లో. వాళ్ళు యాభై వేల కట్నంతో అమ్మాయిని చూచుకున్నారు. నీవు అభ్యంతర పెడతావని భయపడుతుంది."

"మన ఆడపిల్లలకు యాభై వేలు ఇచ్చి చేయగలమా ?"

"పిన్నికి ఆడపిల్లలు లేరు "

"ఓహో ! అంతవరకు వచ్చిందా ?"

"ఊం." అన్నది బాధగా.

"అమ్మా ! తెలిసి నిన్ను చాలా బాధపెట్టాను. నన్ను క్షమించు. ఇంత వరకు అందరిని ఆజ్ఞాపించింది మన ఆర్థిక పరిస్థితి సవరించడం కోసమే. నాన్నగారు పో యే నా టి మనకున్న అప్పుల జాబితా చెబితే గుండె ఆగి పోతుంది."

"నిజమట్రా !" లేచి కూర్చుంది

"నిజమేనమ్మా. అంతా అమ్మేసి అప్పులు తీర్చి యెవరి మానాన వారిని ఉండమని అ ం దా ం అనుకున్నాను. నాన్నగారు ఆఖరుసారిగా తన పరువు నిలబెట్టమని కోరుతూ ప్రాణంవదిలారు. ఒకనాడు అతని ధర్మగుణాన్ని కొనియాడినవారే, అతన్ని నిందిస్తారు నవ్వుతారు అది నేను సహించలేను ఆయన

యెన్ని అప్పులుచేసినా, తండ్రిగా నాపై చూపినప్రేమ వాత్సల్యాలు మరువ రానివి. ఆయన అన్యాయమే చేశారు. కాదనను ... "

"అన్యాయంచేసి ఆయన త్రాగలేదు. జూదం ఆడలేదురా ... "

"మరి ఆడంబరాలు మాత్రం జూదాలకంటే తక్కువా ?" అన్నాడు నిట్టూర్చి. "ఆయన వ్యసన లోలుడు కాడు. మంచితనము మితిమీరితే అనర్థం అమ్మా. ఆయన మెతకతనాన్ని ఆసరాగా చేసుకుని అందరూ ఆయన్ను ఆడించారు. చీటీలో వ్రాసి సరుకులు, బట్టలు తెప్పించడం మీకు గొప్ప. వ్యవసాయంపేరున సంవత్సరానికి పది వేలు తగలేయడం బాబాయికి గొప్ప. ఆయన అడిగినంత ఇచ్చారేగాని ఖర్చుల విషయం అడిగారా? ఆ బాధ్యత ఆయన విస్మరించారు - ఇక మేము హాస్టలంటే అదే. హోటలంటే సరే .., ఇలా సాగింది. మరి డబ్బెలా వస్తుంది. మనకు రూపాయలు అచ్చువేసే యంత్ర ముందా ?"

"ఏమిట్రా ! ఆయనను దెప్పు తావా ?"

"లేదమ్మా. నేను నిరంకుశత్వంగా ఉండటానికి కారణం వివరిస్తున్నాను." తల్లి కన్నీరు ఒత్తాడు. "అందుకే చెప్ప లేదు. విని నువ్వు సహించలేవని ... "

"చెప్పరా. నీకు మాత్రం యెవ రున్నారు చెప్పుకోవడానికి?"

"ఆయన ఆశ్రిత జనముతో కాలం గడుపుతూ, ప్రారంభోత్సవాలు చేస్తూ, మేనేజర్, గుమస్తాలకు వ్యాపారం వది లారు. అన్నీ ఆస్తి, పాస్తులు తాకట్టు లోనే ఉన్నాయి. అన్నీ చూచేసరికి ఆయన ఆరోగ్యం దెబ్బతిన్నది."

"నిజమా ... " ఆమె అవధులు దాటిన ఆశ్చర్యంతో చూచింది.

"అంతా అక్షరాలా నిజం. అక్కయ్య పెళ్ళికి ఇచ్చిన కట్నం పది వేలు, పై ఖర్చులు ముప్పై వేలు. నీ బంగారం బ్యాంకులో లేదమ్మా. ఏనాడో అమ్ముడయింది."

"విష్ణూ ! నేను విన్నదంతా అబద్ధం అని చెప్పరా ... చెప్పు."

"అబద్ధమే అనుకో అమ్మా. ఇంచు మించు అన్నీ తీరాయి. ఒక పొలం విడి పించాలి. మొదటే మీకు పరిస్థితి వివ రిద్దాం అనుకున్నాను. భారతదేశపు రాజకీయాలలా, మన సంసారం తయా రయ్యేది. అందుకే అందరికి శత్రువు నయ్యాను. ఆ ఒంటరితనం దూరం చేసు కోవాలనే పెళ్ళిచేసుకున్నాను. ఇంట్లో జరిగే విషయాలు నాకు చెప్పలేక, మిమ్మల్ని యెదిరించలేక సుజాత యెన్నోసార్లు బేలగా ఏడ్చేది.

"వద్దురా ... అవన్నీ జ్ఞాపకం చెయ్యకు. "

"నా ఉద్దేశం అదికాదమ్మా. నేను చేసింది అన్యాయంకాదని చెబుతున్నాను. అప్పుడే బాబాయి భాగం పంచమన్నారు అంతా వినకపూర్వమే హడలిపోయాడు ఇంటివిషయంలో పూర్తిగా స్వేచ్ఛ నిచ్చారు. ఆయన సహకారానికి యెప్పుడూ ఋణపడి ఉంటాను. పిన్ని మామూలు స్త్రీ ఆమెకు లోకం అర్థంకాదు. రాజీవ్‌ను బలవంతంగా చేర్పించింది. ఈసారి థర్డ్ క్లాసు వచ్చింది. వాడిప్పుడు ఏంచేస్తాడు! ఇరవై రెండో ఏడు వచ్చింది."

"అవునురా. వాడి విషయమే మరిచిపోయింది."

"కొత్త అంతా మోజు. పులిమీద పుట్రలా ఇన్‌కమ్‌టాక్స్ గొడవలు వచ్చాయి. ఇప్పుడు అన్నీ తీరిపోయాయి. వాళ్లిష్టం యెలాగయినా చేయమను."

"అమ్మయ్య. నాకు ప్రాణంలో ప్రాణం లేదురా. నువ్వా జగన్నాథం కూతుర్నెక్కడ కుదురుస్తావోనని."

"సలహా ఇచ్చాను. పెళ్ళి విషయంలో బలవంతం యెందుకు? అరువిచ్చేవారున్నంతవరకు అప్పులు చేస్తూనే ఉంటాము. అందుకే అన్నీ కట్టడి చేయాల్సివచ్చింది. ఇప్పుడు భాగాలు పంచుకున్నా ఫరవాలేదు. అప్పు యెవరికోసము చేసినానాన్నగారు చేశారు. అదంతా తీరిపోయింది."

"యెంత గుట్టగా అన్నీ నెట్టుకు వచ్చావురా? తెలియక యెన్ని మాటలన్నామని!" ఆమెకేంగుర్తుకువచ్చాయో, కన్నీరు కార్చింది,

"జరిగిపోయింది గుర్తుకు తెచ్చుకోవటం దేనికమ్మా! ఊరుకో ..."

"ఊరుకోక, ఏంచేస్తాను! మాటసాయము కూడా చెయ్యలేక పోయాము. వస్తూనే భర్తను కొన్నట్టు ప్రవర్తించే ఈ కాలంలో కోడలు ..."

"కోడలికి అవన్నీ ఆలోచించే సమయము యెక్కడుంది?"

"అవునురా. పంపకాలంటూ, నువ్వో నోరు జారకు. వారిష్టమొచ్చిన సంబంధము చేసుకోని."

"నువ్వా విషయంలో నిశ్చింతగా ఉండు." అతడు పైకి వెళ్ళిపోయాడు. చాలా రాత్రివరకు నిదురపోలేకపోయింది.

రెండురోజుల తరువాత, రాత్రివచ్చి తన గది అడవిలా ఉందని దులుపుకుంటున్నాడు. సుజాత పైకి వచ్చింది.

"నేను దులుపుతాను. మీరు అలా కూర్చోండి." ఆమె పని చేయటం మొదలుపెట్టింది.

"ఏమండీ!"

"చెప్పండి!" తమాషగా నవ్వాడు. కాస్త బిల్లు వచ్చిందేమో, ఇంకా రంగు తేలి గమత్తుగా కనిపిస్తుందామె. అతను తదేకంగా చూడసాగేడు.

''ఏమిటంత పరీక్షగా చూస్తున్నారు? లావయ్యాను కదూ ?"

''ఏం లేదు. ఏదో పిలిచావు."

"ఉదయ్ పెళ్ళికాక పూర్వమే విడి పోతే బావుండును ''

"యెందుకు సుజా ? ఒకేసారి అలా అనేశావు ?" ఆమె ఇంతవరకు కుటుంబ విషయాలలో కలుగ జేసుకోలేదు ఒకే సారి విడిపోవటం అంటుందేం?"

''కారణాలు అడగవద్దు.''

''నా దగ్గర కూడా దాపరికమేనా?"

"నా దగ్గర మీరు అన్నీ దాచి పెట్ట లేదు."

"ఆడదాని నోట్లో నువ్వుగింజ నానదట .''

''మొగాడి నోట్లో ఆముదం గింజ నానుతుందేమిటి ? మీరంతా ఒక్కటే యెటొచ్చి, యెటుపోయినా నిష్ఠూరం నాపైనే వేస్తారు ..."

''అలా జరగదని హామీ ఇస్తున్నాను సరా :"

"సుశీలమ్మ అత్త చాలా మారి పోయారు. కోడలు రాకముందే అందరిని ఈసడించివేస్తుంది. మూడురోజుల నుండి కన్నను పైకి వెళ్ళమని చెబుతుంటే, వాడిని రానివ్వదు. ఏదో ఒకమాట అంటుంది."

"మరేం ఫరవాలేదు. వచ్చే కోడలు వడ్డీతో తీరుస్తుంది. కొందరికి మాట పదును యెక్కువ ఆలోచన తక్కువ."

## 32

సుందరమ్మ క్షీణవాతంతో ఆ[illegible] త్రిలో చేరింది. మందులు [illegible] చేతిలో ఒక్క రూపాయిలేదు. [illegible] తారీఖు ఇంకా జీతాలు రావ[illegible] పన్నెండు రోజులుంది. మెల్ల[illegible] మార్వాడీ శేతు కొట్టుకు వెళ్లాడు. [illegible] పంచె కట్టుకుని, తలకు పసుపు [illegible] పాగా చుట్టుకుని కూర్చున్నాడు.

''ఏం భాయి ఇలా వచ్చావు ?"

''ఒక వందరూపాయలు సర్దత[illegible]. శేతుగారూ. పస్టు తారీఖున ఇచ్చేస్తాను. మా అమ్మకు మందులు కొనాలి."

"దానికేం భాయి...''

రఘు హృదయము గంతులు వేసింది చాలా రోజులనుండి బాంక్‌కు కూడా వెళ్లలేదు.

"నిన్ననే వస్తే ఇచ్చేవాడిని వార[illegible] రోజుల వరకు డబ్బులు రావు" అన్నాడు.

"అలా అనకు శేతుగారూ."

"మాఫ్ కర్నా భాయి '' అని ఇంకో ఆసామితో ముఖం చేటంత చేసుకుని మాట్లాడినాడు అతను తెచ్చిన గొలుసు తూకం వేసి, ఆరువందలు ఇచ్చాడు. రఘుకు తల తీసినట్ట యింది. వేలకు, వేలు వడ్డీ ఈ మార్వా డీకే కట్టాడు. అతనికే మాత్రం అభిమానము లేదా!

"మీకు లేదని ఈయనకు ఇచ్చానని

స్తున్నావా ? ఆయన అడిగి వారం ...లు అయింది." రఘుకు అర్థం ...యిపోయింది. ప్రాణం పోయినా శేరు క...రూపాయి ఇవ్వడని. వెనుతిరి ...డు ...సంగా.

"ముందు యెప్పు అడిగితే అప్పు ఇచ్చాను. అందుకే వచ్చాడు. ఇల్లు కూడా అమ్మిండు. ఏమి చూచి ఇస్తము. ... చేతులో కత్తెర్లున్నాయి భాయి, కత్తెర్లు."

రఘుకు వినిపించినా, ఏంచేయ గలడు. నిరాశగా నవ్వుకున్నాడు. స్నేహితులు అతన్ని మాట్లాడనివ్వకనే వారి, వారి బాధలు ఏకరువు పెట్టారు. విధిలేక సుజాత దగ్గర కెళ్లాడు. ఆ ఇంట్లో యెంతో ప్రశాంతత కన్పించింది. పెద్ద కుటుంబం ఉన్నట్టు లేదు. ప్రభ అతన్ని చూచి నవ్వింది. నమస్కరించింది. తరువాత పైకి వెళ్లి సుజాతను పిలుచుకు వచ్చింది.

"ముఖం అలా పీక్కుపోయిందేం ? అమ్మ కెలా ఉంది ?"

"ఇంకా నెల రోజులుండాలంటారు. ఇప్పుడు పరవాలేదు."

ప్రభ కాఫీ, ఫలహారాలు తెచ్చింది.

"నువ్వు ఫలహారం చేస్తుండు. నేను తయారయి వస్తాను." సుజాత వెళ్లిపోయింది కాంతమ్మ శ్రీరామ్ నెత్తుకుని

వచ్చి, యోగ క్షేమాలు అడిగి వెళ్లి పోయింది. సుజాత తయారయి వచ్చినా, తను డబ్బు అడగలేకపోయాడు. ఆమె ముందు జడుసుకుంటాడు. ఆస్పత్రికి వెళ్లాక అసలు సంగతి బయటపడింది.

"మందులేవిరా ?"

"తెస్తానమ్మా" అన్నాడు తలవంచుకుని. సుజాతకతని అసహాయత అర్థం అయింది బయటకు పిలిచి బాగా చీవాట్లు వేసింది. ఇంటికి తీసుకువెళ్లి డబ్బిచ్చింది ఆమె దగ్గరయినా యెక్కడిది ? శ్రీరామ్ నామకరణోత్సవము నాడు సరళ వంద రూపాయలు, సుమతి వందరూపాయలు వాడి చేతిలో పెట్టారు. అవి అలాగే ఉన్నాయి. అత్తగారికి తరువాత చెప్పొచ్చని ఇచ్చేసింది. తల్లికి మందులు, పళ్లు కొన్నాడు. మిగిలిన డబ్బుతో చిత్తుగా తాగి ఇల్లు చేరాడు.

మర్నాడు తల్లిని చూచి వదిన దగ్గరకు వెళ్లింది. సుజాతను చూస్తూనే బావురుమంది సరళ.

''ఏమిటి వదినా ? ఏంజరిగింది ?

''ఏం చెప్పను సుజా, మీ అన్నయ్య పూర్తిగా పతనమై పోయారు త్రాగుడు అలవాటు చేసుకున్నారు."

''వదినా...నేను నమ్మను. అది అసంభవము."

"మన జీవితాలు...ఈ రాత్రి కి ఉండి చూడు. నిన్న నీవు డబ్బిచ్చావు. అది అయిపోయేవరకు త్రాగుతారు.''

"నువ్వూరుకున్నావా వదినా ?''

''ఏంచేయను ! ఏడుస్తూ త్రాగొద్దని బ్రతిమాలితే మరెప్పుడూ త్రాగనంటారు. గట్టిగా అరిస్తే కొడతారు. తన బాధలు మరచిపోవటానికి త్రాగుతారట."

''అంతలేసి బాధ లేమున్నాయి వదినా ?"

"అప్పులు పుట్టటంలేదు. అన్నింటి కన్నా, మానసిక బలహీనత. సంసార బాధ్యత నా కొదిలి ఆఫీసు పనులు చూచుకోమన్నాను. అది నామోషియట. నిర్మల యెక్కడో ఆశ్రమంలో ఉందట. అక్కడ తనలాంటి ఉంపుడు కత్తెలు ఆయనకు చాలా ఉన్నారట. వందరూపాయలు చార్జీల క్రింద పంపితే వస్తుందట. తనకు కడుపట. అది చూచి మీ అమ్మ మంచం యెక్కారు.''

''బాధ యెందుకు ! ఇష్టపూర్వకంగా అతనికి ఇచ్చారుగా. తల్లి, తండ్రికి రాసుకొమ్మనండి.'

"అలాగే రాశాను. ఆతనేమో పోలీసుల బారినుండి తప్పించుకోవాలని యెక్కడెక్కడో తిరుగుతున్నాడట. తనను యెవరూ బాగా చూడరట.''

''ఏడ్వలేక పోయింది.''

''అన్నీ ఈయన ఆలోచిస్తారు. దుర్మార్గుడయినా సరే. మానసికంగా దృఢంగా ఉండాలి పురుషుడు"

అన్నది ఏడుస్తూ. ఇద్దరూ రఘు రాక కోసం యెదురుచూస్తూ కూర్చున్నారు.

"రా సుజా! నువ్వు భోజనం చేద్దువు. ఆయన ఇప్పుడేరారు." ఇద్దరు అన్య మనస్కంగా కూర్చున్నారు. సుజాత కంచాల వంకచూచింది.

"వెండి కంచాలు అమ్మా రా సుజా!"

"మొన్న శ్యామల కొడుక్కు శ్రీకారం చేయించారు. అప్పుడు అత్తయ్య, ఆయన వెళ్లారు"

"అదేం లేదు సుజా..."

"చాలు వదినా."

రఘు వచ్చాడు ఏదో పాట పాడు కుంటున్నాడు. అతన్ని ఆ స్థితిలో చూస్తా నని ఊహించని సుజాతకు, కళ్లు చమర్చాయి.

"చిట్టి...ఏయ్ చిట్టి..."

"పది గంటలు దాటాయి ఇప్పుడు చిట్టి మేల్కుంటుందా!"

"చిట్టిని పిలిస్తే చిట్టి అమ్మరావాలి బంగారు బొమ్మా"

"అన్నయ్యా!" తీవ్రంగా అన బోయిన సుజాత గొంతు బొంగురు బోయింది.

"సుజా...నువ్వా! ఈ నరకంలోకి యెందుకు వచ్చావు!"

"అన్నయ్యా..." బావురుమంది సుజాత.

"యెందుకమ్మా ఏడ్పు ! బావ ఏమన్నా అన్నారా ? ఊర్కో..." లేచి వచ్చి చెల్లెలి తల హృదయానికి హత్తుకున్నాడు

"యెందుకురా...ఈ అలవాటు చేసుకున్నావ్ ?"

"సారీ...సుజా మళ్లీ త్రాగను. ఒట్టు...నన్ను నమ్మవా ?"

"సుజా ! త్రాగి వచ్చిన రోజు ఇదే తంతు. ఇప్పుడు ప్రమాణాలు చేస్తాడు, రేపు గాలిలో యెగిరిపోతాయి...రండి అన్నం..."

"ఏమిటే...ఏమన్నావ్..." సరళ గొంతు పట్టుకున్నాడు

"అన్నయ్యా !" సుజాత అతని చేతులు విడిపించింది అతను తీవ్రంగా చూచి మంచమ్మీద కూలబడ్డాడు సరళ, బ్రతిమాలి, మొట్టికాయలు తింటూ అన్నం తినిపించింది. అన్నం తింటూనే అలసిపోయినట్టు నిదురబోయాడు.

విష్ణు రాగానే, సుజాత వెళ్లిపోయింది. కాని ఆమె యెందుకో పూర్తిగా మారిపోయింది పరధ్యాస, చికాకు యెక్కువ అయ్యాయి. శ్రీరామ్ బాధ్యత పూర్తిగా కాంతమ్మ వహించింది, కాబట్టి సరిపోయింది.

## 32

ఉదయ్ వివాహము వైభవంగా జరిగింది అతని భార్య వాసంతి అందంగా ఉంది. పి. యు. సి. చదివింది. యాభై

వేల కట్నంతో వచ్చానన్న గర్వం ప్రతి నిమిషం ప్రదర్శించుకోవాలని చూస్తుంది. దానికితోడు ప్రతి నిముషం సుశీలమ్మ ఆ కుటుంబాన్ని గూర్చి చులకనగా మాట్లాడుతుంది.

వాసంతికి, ఉదయ్‌కు మేడపై రెండో గది ఇచ్చారు. అది కొంచెము చిన్నది.

"చేతులూపుకుంటూ వచ్చిన వారికన్నీ అమరుతాయి. నా కోడలు యాభై వేల కట్నంతో వచ్చినా, ఇరుకు గదే. ఖర్మ" ఆమె ఒకటే బాధపడసాగింది. కోడలికి ఫలహారము దగ్గరనుండి, పూలవరకు పైకి పంపేది, కన్న యెవరి పనిచేయొద్దని ఆజ్ఞాపించి. ఉమ్మడి కంపెనీలో పనిచేస్తే స్వాతంత్ర్యం ఉండదు. పైగా డాబు, దర్పం రాదంటూ, వాసంతి పోరి, భర్తచేత వేరేచోట ఉద్యోగానికి దరఖాస్తు పెట్టించింది. మామగారి రికమెండేషన్‌తో మంచి ఉద్యోగం సంపాదించాడు. అప్పటినుండి వారి ధీమా ఇంకా యెక్కువయింది.

"యాభై వేలు పెట్టి యెక్కడయినా ఇల్లు కొనాలి. అద్దెలు వస్తాయి." ఒకటికి పదిసార్లు అనుకునేది సుశీలమ్మ.

"యెక్కడయినా పొలం కొందామే." చలపతి ఆలోచన.

"వెధవ స్కూటర్! ఓ కారు కొనాలి. హాయిగా ఉంటుంది." ఉదయ్

ప్రణాళికలు. కష్టపడకుండా వచ్చే డబ్బు యెన్నో అనర్థాలకు మూలము. మనిషికి గర్వం, వక్రమైన ఆలోచనలే వస్తాయి. కష్టపడి సంపాదిస్తే, దాని విలువ తెలుస్తుంది. సక్రమమైన ఆలోచనలు వస్తాయి. రోజుకు లాగే ఆ రోజు ఆఫీసుకు తయారయింది సుజాత.

"నిన్నటి స్టేట్‌మెంటు నిండా తప్పులే ఉన్నాయి. నీ మనసు బాపుండనట్టుంది. విశ్రాంతి తీసుకో." విష్ణు వారించాడు.

"పరవాలేదు."

"ఒకసారి చెబితే వింటారు" విసుక్కున్నాడు అతను వెళ్లిపోయాక, పనేం తోచలేదు. రోజు క్రమంగా పని చేసేవారికి ఆ వేళకు పని లేకపోతే పిచ్చి యెక్కినట్టు ఉంటుంది. యెవరో సోమరివాళ్లకు తప్పితే. అందుకే తోచడం అన్న సమస్యే ఉండదు. సుజాత బూజు కర్రతో బూజు దులుపుతుంది పదిగంటలకు ఉదయ్ మేడ దిగుతున్నాడు సుజాతను ఇంట్లో చూచి ఆశ్చర్యపోయాడు.

"వదినగారు, ఈ సమయంలో ఇంట్లోనా! యెక్కడో పిడుగుపడుతుంది."

"జంట పిడుగులు పడతాయి మరది గారూ, తమరు చాలా తొందరగా లేచారు.'' అంది అతనికి షిఫ్ట్‌డ్యూటీ అంటుకే ఒకోసారి ఒంటిగంటకు

లేస్తాడు. అతను లేవకపోతే, వాసంతి లేవదు. ఫలహారంచేసి పడుకుంటుంది.

"మేం పన్నెండు గంటల దాకా పడుకుంటాము. ఆక్షేపించటానికి నువ్వెవరు?" పై మెట్టు పై నిల్చున్న వాసంతి తీవ్రంగా అంటుంది.

''చూడు వాసంతీ! ఆక్షేపించటానికి సమానత్వం ఉండాలమ్మా. నేను చేతులూపుకుంటూ వచ్చాను. యాభై వేలతో వచ్చిన నీతో నాకేం సాటి. మరిది ఏదో పరిహాసంగా అంటే జవాబు చెప్పాను." సుజాత జవాబుకు అందరూ తెల్లబోయారు. ఆమె నోరు విప్పి ఏనాడూ జవాబు చెప్పలేదు. ఒకటి యిన్నాళ్లు అంతా తనకన్నా పెద్దవారు. ఊర్కుంటె చ్చిపోతుందని జవాబు చెప్పింది.

"యూ...బ్లడీ..."

''లాంగ్వేజ్ ప్లీజ్..." సుజా[illegible] నవ్వుతూ అన్నా, మాటలు వదునుగ ఉన్నాయి "ఉదయ్ చెల్లాయికి కాస్త డీసెంట్ లాంగ్వేజ్ నేర్పించు. అన్నది.

"ఏమండీ...'' వాసంతికి ఉక్రోషంగా ఉంది.

"సుజాతా! ఏమిటేవ్ ... మహా జోరుగా ఉంది. దాన్ని అంటే నేనూరుకోను.'' సుశీలమ్మ వచ్చింది.

"యెవర్నీ అనడానికి తీరికా, ఓపికా

ండూ లేవత్తయ్యా. నోరు అదుపులో పెట్టుకుంటే మంచిది.'' సాయంత్రము రకు సాధిస్తూ ఉన్నారు.

ఉదయ్ జీతం స్వంతానికి ఖర్చు పెట్టుకుంటాడు. యెవరికి ఒక్క పైసా ఇవ్వడు. అయినా అతని అదృష్టము. అతన్ని, అతని భార్యని ఆడబిడ్డలు, అందరూ గౌరవిస్తారు. అదంతా యా భై వేల మహత్యం అని తెలిసిపోయింది.

దీపావళి పండుగకు, సుమతి, సుధ వచ్చారు. అందరూ వాసంతితో చేరి ఆమె పుట్టింటి వైభవము వింటున్నారు.

''కనీసం పూటకు నాల్గు రకాల కూరలు లేనిదే భోజనము చెయ్యము."

ఈ ఇంట్లో అంతే ఉండేది వాసంతీ! మా నాన్న పోయాడు. అంతా పోయింది.''

"అలాగా వదినగారూ! ఒకసారి ఓ గమ్మత్తు జరిగింది. నేను చీర చూచాను కొట్లో. ఇంటికి వచ్చి వెళ్లేసరికి, అది అమ్ముడయిపోయింది. మొత్తం విజయ వాడ షాపులన్నీ గాలించారు. సాయం త్రానికి దొరికిందనుకోండి."

"మాకు అలాగే జరిగింది వాసంతీ.. వీడిచేతిలోకి ఇల్లు వచ్చాక యిలా తయారయింది.''

"మీ అమ్మగారెలా ఊర్కుంటారు?'' నిరసనగా అంది.

''మా అమ్మ అంటే మా అన్నయ్యకు హడలు. మాఅన్నలు నిజంగా యెంత మంచి వారో..." అటుగా వెడుతున్న సుజాత విని నవ్వుకుంది. వాసంతి అన్న లిద్దరూ అడంగి ముత్తయ్యలే. వాళ్లు మొగ వారితో తిరగరు. తల్లి చుట్టే తిరుగు తారు.

"అమ్మా! కంచి చీర తీయనా, ధర్మవరం చీర తీయనా!" తల్లిని అడుగుతూ, తల్లీ, చెల్లెలు విడిచిన బట్టలు జాగ్రత్తగా డ్రైక్లీనింగ్‌కి ఇస్తూ మడతపెడుతూ ఉంటూరు. యెప్పుడూ జేబులోని దువ్వెనతో క్రాపు దువ్వు కుంటూ తిరుగుతారు వారికి విష్ణుకు పోలికా!

"వాసంతీ! ఆ పంజాబీ అమ్మాయి మెడలో నెక్లెసు బావుందే. చేయించమను మీ ఆత్తారిని...''

అలా సాగుతుంది సంభాషణ-తల్లి ఏరిపెట్టిన బట్టవేసుకుంటారే తప్ప, తమది అంటూ ఏంఉండదు. ''మీ అమ్మ అదృష్టవంతురాలు మా అమ్మ చూడ, వాడి కొడుక్కు అయా..."

సుజాత ఉలిక్కిపడింది. ఈ రోజు ఓ కొత్త సత్యం తెలిసివచ్చింది. తను కొడుకును పూర్తిగా అత్తగారికి వదలటం కూతుర్ల కిష్టం లేదని.

"రండి...నా చీరలు చూద్దుగాని."

వాసంతి తన చీరలన్నీ చూపింది. ఆ తరువాత ఏంజరిగిందోగాని, చెరొక చీర పట్టుకుని వచ్చారు సుమతి, సుధ.

"అమ్మా! వాసంతి చాలా పొడవు.

ఇవి పొట్టి అయిపోయాయిట. మాకు ఇచ్చింది."

"బావుంది" అన్నది కా. తమ్మ. ఏమంటే ఏంగొడవ వస్తుందోనని.

మర్నాడు భోజనాలదగ్గర వాసంతి డైరెక్టుగా విష్ణునే డబ్బు అడిగింది.

"డబ్బు యెందుకమ్మా?"

"వదిన, సుధ నాదగ్గర చీరలు కొన్నారు"

"షాపుందా?"

వాసంతి ముఖం కందగడ్డలా అయింది. అతను లేనప్పుడు నానా హంగామా చేసే అత్త, భర్త, అతని ముందుమాట్లాడరు. విష్ణును వంటరిగాయెదిరించటంకష్టంగాతోచింది. అది కాకఅతను నవ్వుతూ ఇంట్లో వారితో మాట్లాడటం ఆమె చూడలేదు.

"కాదు...నా దగ్గరున్నవి నచ్చాయి"

"డబ్బు వారినే అడుగు. మేం ఇచ్చే కట్నాలు, కట్టిన చీరలు కాదు మా కున్నతంలో కొత్తవి ఇస్తాం"

పచ్చి వెలక్కాయ గొంతులో పడ్డట్టు అయింది. ఏమోఅనబోయింది విష్ణు ముఖంలోని గంభీరత, కళ్ళల్లోని ఎర్ర జీరలు చూచి ఆగిపోయింది తనకు అందటం లేదని ఇచ్చిందిగాని డబ్బు తీసుకుంటుందని అనుకోని ఆడబడుచులు తెల్లబోయారు

అక్కయ్యా! కట్టి విడిచిన చీరలు యెవరు కడతారో తెలుసా? పనివాళ్ళు అభిమానం వదిలి మీరు..." కోపంతో మాట రాలేదు.

"ఒకరిని ఒకరు కట్టుకుంటే తప్పేం?"

"తప్పులేదు స్నేహితురాండ్రు ఆత్మీయులయినప్పుడు..." అతను లేచి వెళ్లిపోయాడు. అందరూముఖాలు మాడ్చు కున్నారు. వాసంతి భర్తను కొర, కొర చూసి పైకి వెళ్ళిపోయింది.

## 33

రఘు ఉద్యోగం ఊడిపోయింది. అతనికి రెండు, మూడు వార్నింగ్ నోటీ సులిచ్చారు. అతని ప్రవర్తనలో పనిలో మార్పులేదు. సరళకు ఏంతోచటం లేదు సుందరమ్మ ఆస్పత్రి నుండి వచ్చినా నీరసంగా ఉంది. బలమైన ఆహారం కావాలంటాడు డాక్టరు. అయోమయంగాఉంది కంపెనీ మేనేజర్ ఇంటికి ఓ సారి ఏదో పార్టీకి వెళ్ళింది అది గుర్తుంది. ఆ గుర్తుతో సరళ అక్కడికి వెళ్లింది. తనింటి పరిస్థితి చెప్పింది.

"నేను ఏంచెయ్యాలమ్మా. నచ్చ చెప్పాను సంవత్సరంనుండి ఇదే తంతు ఈ మధ్య మధ్యాహ్నమే తాగి రావటం అంతేనని నానా బూతులుతిట్టటం అన్నీ అవకతవక పనులే." అతను పచార్లు మొదలుపెట్టాడు.

"ఏమండీ! పిల్లల ముఖంచూచి ఇంకొక్క అవకాశము ఇవ్వండి. అయన కిన్నేళ్ళ సర్వీసుంది కదండీ."


SUPER
Surf

చాలా సేపటికి అతను ఇంకొక్క అవకాశము ఇవ్వడానికి అంగీకరించాడు.

"మీమేలు మరిచి పోలేను."

"ఇప్పుడా మాట అనకు. మీ ఆయన మళ్లీ చేరితే పనిలో, అందువు గాది." అన్నాడు. ఆయన మాట నిజమే అయింది. సరళ యెంత చెప్పినా అతను ఉద్యోగం చెయ్యటానికి అంగీకరించలేదు పైగా మేనేజర్, ఇంటికి వెళ్లినందుకు నానా మాటలన్నాడు.

"నన్నేం అన్నా పరవాలేదండి. నా పిల్లలను అన్యాయం చేయకండి." బ్రతిమాలింది.

"నాకు గౌరవము లేనిచోట, ఒక్క నిముషం కూడా పనిచెయ్యలేను. చెయ్యను." అన్నాడు.

"మొగాడు, వాడి మంచి చెడ్డలు వాడికి తెలియవూ! వాడిని బ్రతకనివ్వవా ఏం?"

అత్తగారి మాటలు విని తల బద్దలు కొట్టుకోవాలనిపించింది సుజాతకుకబురు చేసింది. ఆమె వచ్చి యెన్నో విధాలుగా చెప్పింది. రఘు అంగీకరింలేదు.

"అన్నయ్యా! కష్టాలలో నిలదొక్కుకుంటేనే మనిషి అన్నయ్యా. నా మాట విను, నేను వెళ్లినప్పుడు మా ఇంట్లో ఇంతకు అధ్వాన్నంగా ఉంది "

అవునే. వెళ్లావు అప్పచక్కబడ్డాయి ఒక్కొక్క ఆడదాని పాదమహిమే తల్లీ. వచ్చిందిగా ఇనుప గజ్జల తల్లి.''

"అమ్మా!"

"యెందుకు సుజా! అమ్మ అన్నది నిజమేనేమో. నా పెళ్లి అయినాక ఒక్క రోజు శాంతంగా ఉన్నామా!" రఘు అన్నాడు సరళ ముఖం చేతులతో కప్పుకుని బయటికి వెళ్ళి పోయింది.

"నీ అసమర్థత అడదానిమీదికి నెట్టడానికి సిగ్గులేదుట్రా!" ఆడపులిలా లేచింది సుజాత.

"సుజా..."

"ఇంకా నన్నా పేరుతో పిలువకు. అమ్మా! నీ సారెలు చీరెలునాకు అక్కర లేదు. నీ కూతుర్లలాగే కోడలు ఒక మనిషి అని యెందుకు అనుకోవు? మిమ్మల్ని భగవంతుడు బాగుచెయ్యలేడేమో..." సుజాత చరా, చరా బయటికి వచ్చింది. "సుజా..." సరళ పిలిచింది. ''వద్దమ్మా...నాకోసం మీ అన్నయ్యపై విముఖత పెంచుకోకు. మా సంసార చక్రము బురదలోకూరుకుపోయింది బాగుచేయటం యెవరితరము కాదు"

"వదినా!"

"ఒక్క వాగ్దానం చేయి సుజా. నేను యెప్పుడు పిలిచినారావాలి. ఒక విధంగా వాళ్లన్నదీ నిజమేమో. నా పాద మహిమేనేమో!"

"వదినా... అలా అనకు. చేజేతులా చేసుకుని, ఖర్మ అంటే నమ్మను." సుజాతకు కన్నీరు ఆగటంలేదు.

"పోని వారిని పంపించనా?"

"వద్దు సుజా. మాట వినకపోతే మనసులు కష్టపడతాయి. యెవరూ ఆయనను మార్చలేరు" అన్నది సుజాత మతి పోసాగింది. యెందుకిలా జరిగింది!

## 34

సుజాత కారోజే పథ్యం పెట్టారు. ఆమెకీ జ్వరంలో కొన్ని నిజాలు తెలిసి వచ్చాయి భర్తకు తనంటే, పనిచేసినందుకు, అభిమానం తప్పితే మరేం లేదు అనుకుంది. తోటి ఉద్యోగులపై చూపే గౌరవమే తనపై చూపుతున్నాడనుకుంది. కాని, ఈ వారం రోజులలో అతను వెళ్లించే అరుదు. గడ్డం గీసుకోలేదు. అతనో పేషెంటులా తయారయ్యాడు ఆ రోజు పుట్టింటిలోనే, తలపోటు ప్రారంభం అయింది. ఇల్లు యెలా చేరిందో తెలియదు.

"అదేమిటమ్మా, అలా ఉన్నావు?" కాంతమ్మ అడిగింది.

"తల నొప్పి అత్తయ్యా." పైకి వెళ్ళి బెడ్ కవర్ తీసిపడుకుందే గుర్తుంది. మళ్లీ ఈ రోజే తెలివి వచ్చింది.

"సుజా!"

"ఏమండీ... మీకేమయింది" అన్నది అతని గడ్డం రాస్తూ.

"భలేదానివే..." అతను నవ్వాడు. ఆ నవ్వులో ఏదో బరువుదింపుకున్న భావం కన్పించింది. "నువ్వే వారం రోజులు పడకబెట్టావు"

"ఆం..." అన్నది. తలదగ్గర బల్లపై మందులు, పళ్లూ ఉన్నాయి. కొంచెం దూరంలో క్యాంప్ కాట్ ఉంది. లేవాలని ప్రయత్నంచేసి విఫలురాలయింది. నీరసంగా ఉంది. కళ్ళు మూసుకుంది.

"సుజా!...ఈ పాలు త్రాగు." అతను త్రాగించిన పాలు త్రాగింది. అతను ఒకవైపుకు దొర్లించి, పక్కదులిపాడు. ధర్మామీటరుతో జ్వరం చూస్తుండగా కాంతమ్మ వచ్చింది.

"యెలా ఉందిరా?"

"ఈ పూట పూర్తిగా తగ్గిందమ్మా. నార్మల్‌కు వచ్చింది" అన్నాడు ధర్మామీటర్ దులుపుతూ.

"పెళ్ళి అయిన దగ్గరనుండీ జబ్బు యెరగని పిల్ల హడలిపోయాను" తలవైపుగా వచ్చి జుట్టు సర్దింది కాంతమ్మ.

"నేనుంటాను. నువ్వెళ్లి స్నానం చేసిరా. వారంరోజులనుండి వేళకు తిండిలేదు." కొడుకును లేవదీసింది

(సశేషం)

Printed and Published by A Sudhakara Rao, at 5-9-88, Public Garden Road, Hyderabad, for YUVA Publications and Printed at Dolton Press, Hyderabad-500001 Controlling Editor. "CHAKRAPANI"

# పెరిగే వయస్సుకు ప్రియ మిత్రము—ఇంక్రిమిన్*!




ఉప్పొంగే జీవితం. ఎల్లలులేని శక్తి సంపూర్ణమైన ఆరోగ్యం! పెరిగే వయస్సులో మీ పిల్లలకు ఇన్‌క్రిమిన్ టానిక్ ఇవ్వండి. ఇన్‌క్రిమిన్ సిరప్‌లో ఉపయోగకరమైన విటమిన్లు, ఐరన్ మరియు అవసరమైన అమినో ఏసిడ్—పెరిగే వయస్సులో ముఖ్యమైనవి అన్నీ వున్నాయి.




# ఇన్‌క్రిమిన్*

## ఇన్‌క్రిమిన్ టానిక్—పెరిగే పిల్లలకు వరప్రసాదం!

డాక్టర్లు విశ్వసించే పేరు— Lederle ఎ డివిజన్ ఆఫ్ సయనమిడ్ ఇండియా లిమిటెడ్
* అమెరికన్ సయనమిడ్ కంపెనీ వారి రిజిష్టర్డ్ ట్రేడ్ మార్కు.

SSTAS-INC-3088A TEL

విశ్రాంతి పొందండి!
చార్మినార్ త్రాగండి.

అచ్చమైన
మేలిరకం పొగాకుల
పరిమళము కమ్మదనం
అనుభవించండి.

CHARMINAR
THE VAZIR SULTAN
TOBACCO CO. LTD.
HYDERABAD

45 పైసలకు 10*

వి ఎస్ టి తయారీ
భారతదేశపు అత్యధికంగా అమ్ముడుబోయే సిగరెట్!

CMVS-89.182 TL

* సిఫారసు చేయబడిన అధికతమ చిల్లర ధర (స్థానిక పన్నుల అనుసారం)

